

సురేష్ మూవీస్ సమర్పించు

# సిపాయి చిన్నయ్య

నిర్మాత:
డి.రామానాయుడు

దర్శకత్వం:
జి.వి.ఆర్.శేషగిరిరావు

సంగీతం:
యం.యస్.విశ్వనాథం

నవయుగ

NVKR

పోతకులకి, రచయిత(త్రు)లకి ...
దీపావళి శుభాకాంక్షలు!

1969 దీపావళి కథల పోటీలో ఎంతో ఉత్సాహంతో పాల్గొని పోటీని జయప్రదం చేసిన రచయిత(త్రు) లందరికీ మా కృతజ్ఞతలు. మొదటి బహుమతి పొందిన రచయిత్రి శ్రీమతి పత్రి రామసీత కారణాంతరాలవల్ల ఫొటో పంపలేక పోతున్నామని రాశారు. వారి ఉత్తరం, రెండవ బహుమతి పొందిన రచయిత శ్రీ శేల్లపల్లి వెంకట లక్ష్మీనారాయణ శర్మ, మూడవ బహుమతి పొందిన రచయిత శ్రీ రంగధామ్ రాసిన ఉత్తరాలని, వారి ఫొటోలని వేస్తున్నాము.

పోటీలో బహుమతి పొందక పోయినా మామూలుగా తర్వాతి సంచికలలో ప్రచురించడానికి స్వీకరించిన కథల జాబితాని ఈ సంచికలోనే మరోచోట వేస్తున్నాము. పోటీ విషయమై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపలేమని మరొకసారి మనవి చేసుకుంటున్నాము.

—సం.

**శ్రీమతి పత్రి రామసీత**

'స్వస్థలం బందరు. ప్రస్తుత నివాసం కూడా మచిలీపట్నమే. వయస్సు 25 సం. లు. స్కూలు ఫైనలు (ఎస్. ఎస్. ఎల్. సి.) తరువాత హిందీలో విశారద వరకూ చదువు కున్నాను. నా మొదటి కథ "ఇంటర్వ్యూ" 1963 విజయదశమి ఆంధ్ర సచిత్రవారపత్రికలో ప్రచురింప బడినది. ఇది నా ద్వితీయ ప్రయత్నం. గృహిణికి గల సామాన్యాలు పోటీలుగాక కథలు చదవటం ఎక్కువ ఇష్టం.'

**శేల్లపల్లి వెంకటలక్ష్మీనారాయణశర్మ**

'జననం 1940 లో. స్వస్థలం విజయవాడ. ప్రస్తుతం ఉండేది బెంగుళూరులో. బి. కాం. వరకూ విజయవాడ ఎస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్. గవర్నమెంటు కాలేజీలోనూ, యం. కాం. ఆంధ్రా యూనివర్సిటీలోనూ చదివాను. కొన్నాళ్ళు కేరళ రాష్ట్రంలోనూ, తర్వాత హిందూ కాలేజి (గుంటూరు) లోనూ కామర్సు లెక్చరర్‌గా పని చేశాను. ప్రస్తుతం బెంగుళూరు ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సు లోని ఇండస్ట్రియల్ మేనేజిమెంటు డిపార్టు మెంటులో రిసర్చి చేస్తున్నాను. వివాహం అయ్యింది. (శ్రీమతి పేరు రాజ్యలక్ష్మి). మాకో అబ్బాయి. పేరు బాల వెంకటరమణ.

'రచనలు చెయ్యడం మొదలెట్టి సుమారు మూడేళ్ళయ్యింది. ఇంతవరకూ దాదాపు ముప్ఫయ్ కథలు, మూడు నాటికలు వ్రాశాను. ఇటీవల బెంగుళూరులో జరిగిన నాటికల పోటీలో నేను వ్రాసిన "విషవలయం" అనే నాటికకు ద్వితీయ బహుమతి లభించింది. రచయితగా యింతకు మించి చెప్పుకోతగ్గ విశేషాలేమీ లేవు. వాస్తవానికి దగ్గరగా వుండే కథలు చదవటమన్నా, వ్రాయటమన్నా చాలా యిష్టం.'

శ్రీ శేల్లపల్లి వెంకటలక్ష్మీనారాయణశర్మ

శ్రీ రంగధామ్

**శ్రీ రంగధామ్**

'నా పూర్తి పేరు కొల్హారు రంగధామరావు. స్వస్థలం పశ్చిమ గోదావరి జిల్లా, ఏలూరు. విద్యాభ్యాసం ఏలూరు, రాజమండ్రి, నాగపూర్‌లలో జరిగింది. నాగపూర్ లక్ష్మీనారాయణ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో బి. ఎస్. సి. టెక్ డిగ్రీ తీసుకున్నాను. ప్రస్తుతం గుంటూరులో ఒక ఆయిల్ ఫాక్టరీలో కెమికల్ ఇంజనీరుగా ఉంటున్నాను. వయస్సు 39 సంవత్సరాలు.

'సుమారు ఎనిమిది సంవత్సరాల నుండి సారస్వత రంగంలో కృషి చేస్తున్నాను. నాలుగు సీరియల్స్ పత్రిక ద్వారా ప్రచురిత మయ్యాయి. కథలు కూడా చాలానే రాశాను. "అవదలి అబల" అనే నాటిక భారతిలో ప్రచురింప బడింది. సంగీత సాహిత్యాల యందు అత్యధిక ఆసక్తి ఉన్నది.'

---

## వ్యాఖ్యలు

నమస్కారములు. మీ వారపత్రికలో ముఖ్యంగా ఆకర్షించేవి లేఖలు, ముగ్గురు మూర్ఖులు, [illegible] ..... తరువాత మిగతావి.

ముఖ్యంగా లేఖలలో విమర్శనాత్మకమైనవి చదవటం మానివేశాం. ఈ వారం (10—10—69)లో జగజీవన్‌రావుగారిపై కె. సి. రామకృష్ణ వ్రాసిన ఉత్తరం బట్టి చూస్తే మరి ప్రధానమంత్రి జగజీవన్‌గారికి భారత రత్న బిరుదే ఇస్తుందో? హరిజనోద్ధరణ చక్రవర్తి అనే ఇస్తుందో? ఇంత మహామనిషి వ్యక్తిని ప్రభుత్వంలో వుంచి పోషించే మన మెంత మతిమరుపువాళ్ళమో అనిపిస్తుంది.

తెలుగులో కొచ్చిన ఈ మంత్రిగారికి తెలుగు లోనికి రాని (ఆదాయం పన్ను ఎగవేసిన) ప్రముఖులెందరో! అంతా అందరూ ఎక్కారు! అయినా ఒక్కవాడు చిక్కిచిక్కి కూస్తూనే వున్నాడు. ఇదీ భారతం. ఆదాయం పన్నులు ఇదే పాపమొచ్చి [illegible]

## ఉత్తరాలు

తాతాలపై మీరు ఏం చేస్తున్నారు? చట్టం ఏం చేస్తుంది? చట్టాన్ని కాపాడవలసినవాడే చట్టాన్ని అతిక్రమిస్తే శిక్ష ఏమిటి? ఆ దేవుడికే తెలియాలి.

'ముగ్గురు మూర్ఖులు' మాత్రం ముగ్గురు మూర్ఖులు కారు. మిగిలిన భారత ప్రజ మాత్రమే అనడానికి అర్హులనటంలో తప్పులేదేమో. సంఘంలో జరిగే దురాచారాలు, మోసాలు, అధికారుల అన్యాయాలు కళ్ళకు కట్టినట్లు ముగ్గురు మూర్ఖుల ద్వారా వినిపించే మహేష్‌కు నా కృతజ్ఞతలు.

పేరు చెప్తే అధికారులు ఏం చేస్తారో అని భయపడే, ప్రభుత్వంలోని ఓ చిన్న ఉద్యోగి (గుంటూరు.

### ముగ్గురు మూర్ఖులు

ఆర్యా!

వీరు — గాడిదలా [illegible] ఆంధ్రసచిత్ర వారపత్రికకు సంపాదకత్వమును నిర్వహిస్తున్నారు; గాడిదలా పనిచేస్తూ, గాడిదలా బరువు మోస్తున్నారను కొంటాను.

పూర్వం ఈ పత్రికను స్థాపించిన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు అమూల్యమైన కథలు, వ్యాసాలు ప్రచురించారు. దేశోద్ధారక బిరుదును పొందారు. ఇప్పుడు అమూల్యమైన 'గాడిద కథలు' (ఆంధ్ర సచిత్రవార పత్రిక 17.10.69) ఇత్యాదులు ప్రచురించే వీరలాంటి పెద్ద మనుషులు కూడా ఒకవిధంగా 'దేశోద్ధారక' బిరుదుకు తగియున్నారని భావిస్తున్నాను.

ఇంత ఓర్పుతో పని చేస్తూ పవిత్ర భారతి [illegible] ఆంధ్ర సచిత్రవార పత్రికా సంపాదకత్వ చాకిరి చేసే వీరు ఆంధ్రుల పాలిటి గాడిదలా ఉంటున్నారు. తిలకం,—(రాజంపేట.

* * *

అన్నిశుభకార్యములకు
శుభప్రదమైన
పానీయం

గోల్డ్ స్పాట్




పార్టీ ఆర్డర్లకు ప్రత్యేక సదుపాయం నిమిత్తం సంప్రదించండి

| | |
|---|---|
| హైద్రాబాద్ బాట్లింగ్ కో; (ప్రై) లిమిటెడ్)<br>పంజాగుట్ట, హైద్రాబాద్<br>ఫోన్ నెం. 34615 - 38445 | విజయవాడ బాట్లింగ్ కో;<br>కామవరప్పాడు<br>ఫోన్ నెం. 84-25 - 4134 |

| | | |
|---|---|---|
| శ్రీ సర్వరాయ సుగర్స్ లిమిటెడ్;<br>బాట్లింగ్ యూనిట్, వేమగిరి<br>రాజమండ్రి<br>ఫోన్ నెం. కడియం 45 | వైజాగ్ బాట్లింగ్ కో;<br>విశాఖపట్టణం<br>ఫోన్ నెం. ఆఫీస్: 4473<br>రెసిడెన్స్: 4476 | రాయలసీమ బాట్లింగ్ కంపెనీ,<br>కర్నూలు<br>ఫోన్ నెం. [illegible] |

AVIN

## రంగులరాట్నం

శ్రీ క్రిష్ణారెడ్డిగార్కి,

నా రంగులరాట్నం శీర్షికమీద మీరు దయతో రాసిన వ్యాఖ్య సంపాదకులు పంపగా అందుకొన్నాను. నాకు కడప కళాశాల నుండి కాళహస్తికి ట్రాన్స్ ఫరు రవడంవల్ల వెంటనే రాయలేక పోయినందుకు క్షమించగోర్తాను.

ప్రప్రథమంగా, నా శీర్షికను మీరు కుతూహలంతోనేగాక విమర్శనాత్మకంగా చదువుతున్నందుకు కృతజ్ఞుడ్ని. అదేవిధంగా ఇకముందు కూడా చదివి మీ అభిప్రాయమూలా తెలియ గోర్తాను.

కందిరీగను జంతువు అనడం పొరపాటు అని మీరు భావించడం సవ్యంగా లేదు. జంతువులు, వృక్షములు (Animals, Plants అని జీవరాసి, నంతా విభజించారు. జంతువు అంటే నాలుగుకాళ్ళు కలది అని మీరు భావించినట్లు తెలుస్తోంది. అది పొరపాటు. మనిషిని జంతువు అంటే మీరు ఇంకా పొరపాటు అంటారేమో! వృక్ష సంబంధం కాని క్రిములన్నీ కూడా జంతువులే. అదేవిధంగా జంతు సంబంధం కాని క్రిములన్నీ కూడా వృక్షాలే.

రంగులరాట్నం మాకు అత్యంత ప్రియమైనదని రాయడం నాకు ఎంతో ఉత్సాహం కల్గించింది. మీరు తప్పక తిరిగి రాస్తారని ఆశిస్తున్నాను.

ఇట్లు,
శ్రేయోభిలాషి
జ. కో. రావు.

## కార్టూన్

19–9–69 సంచికలో శ్రీ డి. బి. ప్రసాద్ బాబు, కాకినాడ వారి, 'ఇంజనీర్ల మీద' వేసిన 'కార్టూన్ల మీద' విమర్శ చూసెను. విమర్శించటంలో ఆయన కొంత తొందర పడ్డారనుకుంటాను.

(1) మానవుని శరీరంలో అన్ని అంగాలకు ప్రాముఖ్యత గలదు. ఏ అంగం 'ఫంక్షన్' చేయటం మానినా అనారోగ్యం ఎలా తప్పదో అదేవిధంగా దేశ పురోభివృద్ధి ఒక్క ఇంజనీర్ల భుజస్కంధాల పైనే కాకుండా, ఇంకా ఎందరి మీదో ఆధారపడి వుందనీ, 'సొసైటీ'లో ప్రతి ఒక్కరి సహకారం కొద్దో గొప్పో అవసరమనీ విమర్శకులు గ్రహించాలి.

(2) సమయం వస్తే తమశక్తి సామర్థ్యాలు, ఇంజనీర్లు నిరూపించుకోగలరని వ్రాసి దాని క్రిందే అసహాయకులైన ఇంజనీర్లు అని సంబోధించారు. శక్తిసామర్థ్యాలు నిరూపించుకోగలవారు అసహాయకులు ఎలా అవుతారు?

(3) ఇంజనీర్లను పెళ్ళాడటానికి ఏ అమ్మాయి ఇష్టపడదు?' అన్నారు. ఇంజనీర్లు అయినంత మాత్రాన ఇష్టపడాలని ఎక్కడుంది?

ఇకపోతే—

ఇంజనీర్ల పట్ల ప్రభుత్వం అలక్ష్యం చేసిందనటంలో ఎలాంటి సందేహం లేదు. ఇంజనీరింగు విద్యాభ్యాసం కోసం ఒక్కొక్క విద్యార్థి మీద ప్రభుత్వం 47 వేల రూపాయలు ఖర్చు చేస్తూ కూడా ఇంజనీర్లకు తగిన ఉద్యోగాలు చూపించి ఉపయోగించుకోవటం లేదు అంటే, ఇది ప్రభుత్వం చాతకాని తనానికి నిదర్శనం కాక మరేమిటి?

కార్టూనిస్టు ఇంజనీర్ల మీద కార్టూనులు వేసినందువల్ల ఇంజనీర్ల తెలివితేటలు లోపించవు.

మానవుడు సాధించిన అఖండ విజయం.. చంద్రుని మీద మొదట కాలుపెట్టిన కీర్తి నీల్ ఎ. ఆర్మ్‌స్ట్రాంగ్ ఇంజనీరు (ఎయిరోనాటికల్)కే దక్కింది అని ప్రజలు మర్చిపోలేదు. అందువల్ల కార్టూన్లు వేసినందు వల్ల సంఘంలో ఇంజనీర్ల విలువ తగ్గుతుంది అనుకుంటె అది పొరపాటు.

యస్. శోభనాద్రి,
కెమికల్ ఇంజనీరు,
బంటుమిల్లి.


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 7–11–'69
శ్రీ సౌమ్యనామ సం॥ఆశ్వయుజ మా. బహుళ ద్వాదశి
సంపుటము : 63 సంచిక : 8

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన: శ్రీ వెంకట్రావు


కథలు :

నిరంతరత్రయం — 12
స్వార్థంలో నిస్వార్థం — 20
(రెండవ బహుమతి పొందిన కథ)
కోరిక (మొదటి బహుమతి పొందిన కథ)— 40
కీలుబొమ్మలు — 60
(మూడవ బహుమతి పొందిన కథ)

సీరియల్ నవలలు:

పరిలిప్తం — 30
ఆశలూ–అనుభవాలూ — 50

వ్యాసాలు, శీర్షికలు. సినిమా:

ఉత్తరాలు — 2, ఊమెన్ కార్టూన్ — 5, న్యూఢిల్లీ లేఖ — 6, మీ రాజకీయ పరిజ్ఞానం ఎంత? — 7, హీరోలతో నా పరిచయం — 8, నరకునివృత్తాంతం—10, ఐదు దీపావళులు—11, అరబ్బు గెరిల్లాలని అరికట్టే...— 16, ఒకవారం విపరీతం — 18, నేనూ — నువ్వూ (గేయం) — 19, బాంబులు (కార్టూన్లు) — 28, ధర్మపథం — 39, వారఫలం — 46, వనితాలోకం — 48, రంగులరాట్నం — 59, ఆమె చెప్పినది నిజం, సినిమాడైరీ — 72, శారదతో ఇంటర్వ్యూ — 74, పాఠకులకి మనవి — 75, సినిమా. ఇంటా బయటా—76, తెరపై ముద్దు — 78, మద్యనిషేధం రద్దు... — 79.


కొరడా
మార్క్సిస్టు పాలన
గాంధీ ఆయుధాల తో ఇందిరని ఎదిరించుదాం
ప్రతిపక్షం
ఇనకం టాకుసై ఆరోపణలు
సమయంకోసం....
సిండికేటు తో
నాయుడం
ఇక్కడ కొన్ని అత్యావసర విషయములున్నాయి. వీటిని ఆలోచించండి.
చండీగర్
తెలంగాణా
అహ్మదాబాదు

# శ్రీమతి ఇందిరాగాంధీ పద్మవ్యూహం!

సిండికేటు ఓడిపోయింది. కాని యుద్ధం ఆగ లేదు. నిర్విరామంగా సాగుతూనేవుంది. అక్టోబరు 30 న రెండవ దండయాత్రకి ముహూర్తం పెట్టారు. దేశం బాగోగుల దృష్ట్యా ఆలోచిస్తే— ఈ యుద్ధం ఒక ఒడంబడికద్వారా ముగిసి పోకూడదు. అటో యిటో తేలి పోవాలి. అప్పుడే దేశానికీ పార్టీకి మేలు జరుగుతుంది. సిండికేటు కూడా ఎన్నిదండయాత్రలకైనా సిద్ధంగా వున్నట్టే వుంది. మాడమ్ గాంధీకి వున్న స్థోమత సిండికేటు కెక్కడిది? ఆమెకి అధికారం వుంది, అంగబలం వుంది, అర్థిక బలం వుంది. ముసలి సిండికేటు చాలా బలహీనమైంది, అది రంగంలో కొచ్చి యుద్ధమూ చెయ్యలేదు, యుద్ధానికి సన్నద్ధం చెయ్యనూ లేదు.

## అభినవ శివాజీ

తూలనాడ్డం గొప్ప ఆయుధంగా పని చేస్తుం దని కాంగ్రెసు ప్రెసిడెంటు గారికి తెలిసినట్టు లేదు. ఆయన మాట్లాడవలసిన దానికంటే ఎక్కువగా మాట్లాడారు. అది కొంత అనర్థాన్ని తెచ్చి పెట్టింది. ఆయన బెదిరింపులకి అర్థం లేకుండా పోడానికి కారణం తగినంత అంగబలం లేక పోవడమే. పాపం, ఆయనగారు ఒంటరివాడై పోతున్నాడు! రాష్ట్రపతి ఎన్నికసందర్భంలో తమ వోటమికి మేల్కొని శక్తి సామర్థ్యాలని కొంత వరకు కూడదీసుకుని వుండాల్సింది. కాని, ఆయనకి అది సాధ్యం కాలేదు. వర్కింగ్ కమిటీ మీటింగ్ లో ఆయన బలాబలాలు మళ్ళీ తేలాయి. అందులో చవాన్‌గారు జారుకున్నారు. శివాజీ లాగానే చవాన్ గారు కూడా ఒక శాంతియుత పరిష్కారం కుదర్చాలని నాటక మాడారు. అది ఎలాంటి సత్ఫలితాల నిచ్చిందో అందరికీ తెలిసిందే!

## కామరాజు విజాయితీ

ఇక కామరాజు గారున్నారు. ఆయనొక్కరే విజాయితీ గల వ్యక్తిగా కనిపిస్తున్నారు. బెంగుళూరు వర్కింగ్ కమిటీ మీటింగ్‌లో ఆయన శ్రీమతిగాంధి 'ఫామిలీ ఫ్రెండు' ఫక్రుద్దీన్ అలీ అహ్మద్‌గారికి ఒక 'డస్' ఇచ్చారు. ఆయనది ఒక్క కంఠమే అలా ఖంగుమన్నది. మొరార్జీ దేశాయ్‌గారున్నారు, ఆయనకింగా ఉప ప్రధాని పదవిమీద వ్యామోహం ఎక్కువ. అంచేత నిమ్మకు నీరెక్కినట్టున్నారు. అవకాశాన్ని చేజార్చకుండా శ్రీమతిగాంధి మొరార్జీ భాయిని విసిరి కొట్టారు. వెను వెంటనే బ్యాంకుల జాతీయం అన్నారు. [ఆదాయాల వివరం ఇప్పటికింకా అంతు తేలలేదు!] బ్యాంకుల జాతీయం నాటి రాత్రి శ్రీమతి అరుణా అసఫాలీగారు శ్రీమతి గాంధిగారికి కొట్టిన డబ్బా అంతా యింతా కాదు. ఆ రాత్రికి రాత్రి ఆమెగారు గొప్పవారుగా ప్రచార మైపోయారు!

## పదవిని నిలబెట్టిన మోసం

చవాన్‌గారి మోసం శ్రీమతిగాంధి స్థావరాన్ని 1972 వరకు సుస్థిరం చేసింది. ఆమె అప్పటి వరకు అధికారం లోనే ఉండడానికి కమ్యూనిస్టులు, యస్. యస్. పి., పి. యస్. పి. డి. యమ్. కె. ల సాయం వుండనే వుంటుంది. ఎనభై మంది కాంగ్రెసు సభ్యులూ ఓడి పోయినా ఆమె నిలబడగల్గుతారూ అనడానికిదొక నిదర్శనం. కమ్యూనిస్టుల తోడ్పాటు మరీ మెచ్చదగింది. శ్రీమతిగాంధి వారి ఆశ్రయంలోనే వున్నారు. బాబూ భూపేష్‌గుప్తా నిత్యమూ ఆమెని సందర్శించుకుంటూ వుంటారు. ఆయన ఒక మంచి సలహాదారు. యస్. యస్. పి., పి. యస్. పి. ఎప్పుడూ ఆశ్రిత పక్షపాతులే. నిరంకుశ పాలకులకి అధికారాన్ని హస్తగతం చేసే వారు సోషలిస్టులు. ఉదాహరణకి రష్యా కమ్యూనిస్టులకి, ఇటలీ ముస్సోలినీకి, జర్మనీ హిట్లర్‌కి అధికారమిచ్చిన చరిత్ర చాలు. సోషలిస్టులకి తీర్మానాలు అంటే నమ్మకం ఎక్కువ. కమ్యూనిస్టులకలా కాదు, వారికి తక్షణ చర్యలు కావాలి.

## ఆశ్రితపక్షం వ్యవహారం

కాంగ్రెసు వర్కింగ్ కమిటీలో ప్రతిపక్షాన్ని ధ్వంసంచెయ్యడంలో విజయాన్ని సాధించారు శ్రీమతి గాంధి. ఇప్పుడు పూర్తిగా గుప్పిట్లోకి తెచ్చు కుందామని ప్రయత్నం. ఒక్క వ్యవస్థని జయించడం ద్వారానే 1972 వరకు ఆమె సుస్థిరత్వాన్ని చేకూర్చుకో గలిగారు. నిజలింగప్పగారు నోరు జారడం వల్ల యుద్ధం ఆయన మీదికి తిరిగింది. ఆయన పదవికే ఎసరు పెట్టాలని పూనుకున్నారు 'ఆశ్రిత పక్షం'వారు. ఆయనే కదా, శ్రీమతిగాంధి 1972 వరకు నిరాటంకంగా పదవిలో వుంటారని చెప్పింది.

## శ్రీమతి గాంధీ పద్మవ్యూహం

కొందరు మంత్రులని బర్తరఫ్ చెయ్యడంద్వారా శ్రీమతిగాంధి పద్మవ్యూహం ఆరంభమయింది. ఇది మంత్రులందరి లోను ఒకరకమైన భయాన్ని కలగ జేసింది. ఉక్కు మంత్రి పూనాచా, విద్యా మంత్రి డాక్టర్ రావు ఇద్దరూ ఖరకాటంలో పడ్డారు. కె. సి. పంత్‌గారు [యు. పి.] శ్రీమతి గాంధి గీసిన గీతలో నిలబడిపోయారు. డా. రామ్ సుభాగ్‌సింగ్ మాత్రం తొణక్కుండా బెణక్కుండా తాను శ్రీమతి గాంధిని సమర్థించబోవడం లేదని చెప్పేశారు. వర్కింగ్ కమిటీ బేలెన్సు తప్పిందిక్కడే. కాంగ్రెసు ప్రెసిడెంటు కూడా శ్రీమతి గాంధి పద్ధతే అవలంబిస్తూ వర్కింగ్ కమిటీలోని కొందరు సభ్యుల్ని తొలగించినట్టయితే ఏమవుతుంది? ఇది ఇంకా తేలవలసి వుంది. ఇది తేలిన నాడు యుద్ధం బాహాటంగా జరిగినట్టే. జయాపజయాలు దైవాధీనాలు!

ఈ ముసుగులో గుద్దులాటని 'హిందుస్థాన్ టైమ్స్' చక్కగా వివరించింది:

## వోటింగు విలువ

కాంగ్రెసువ్యవస్థ బలపడాలీ అంటే ఎవరో ఒకరు లొంగిపోవడం తప్పదు. ప్రధానమంత్రి అనుయాయులు రాష్ట్రాల పర్యటనకి వెళ్ళి నిజలింగప్ప గారిని తీసివేయించే ప్రయత్నాలు చేస్తున్నారు. ప్రెసిడెంటూ, వారి అనుచరులూ దానికి ప్రతికూలంగా ప్రచారం ఆరంభించారు. క్రిందటిసారి అనుభవాన్ని బట్టి చూస్తే యుద్ధం చేయకుండా లొంగిపోయేట్టు లేరు వీరు. రెండు వైపులా సమాన బలాబలాలు వున్నాయి. ఏ వైపు సరిఅయినదీ అనేది తేలడానికి వోటింగు జరిగినంతమాత్రాన ఏమి ఒరుగుతుంది?

కొన్నివారాల నుంచి ప్రజలను ఆశ్చర్యపరిచే సంఘటనలు అనేకం జరుగుతున్నాయి. అధికారం కోసం జరుగుతున్న ఈ పోరాటం రహస్యం ఏమీ కాదు. సోషలిజమ్, బ్యాంకుల జాతీయం లాంటి నినాదాలు ఐకమత్యాన్ని కాపాడలేవు. ఐకమత్యం వున్నప్పుడు అధికారుల మీద జనానికి మంచి అభిప్రాయం కలుగుతుంది. బొంబాయి పి. సి. సి. మీటింగులో దెబ్బలాట దేశంలో పార్టీ ఐకమత్యానికి ఒక ఉదాహరణ!

## బలాబలాలు తేల్చుకోండి

ఇలాంటి పరిస్థితుల్లో ఒక్కటే మార్గం బలాబలాలు తేల్చుకోవడమే! కాంగ్రెసు నాయకుల కుయుక్తులు ఇతర పార్టీలను కూడా మలినం చేస్తున్నాయి. ఒక పద్ధతి ఒక విధానమూ అంటూ లేకుండా జరుగుతున్న ఈ ప్రత్యక్ష పోరాటానికి ఒక హద్దు అంటూ వుండాలి. వ్యక్తిగత అభియోగాలపై వోట్లను సంపాయించుకోవచ్చు కాని, పార్టీలో నీతి నిలబడదు.

నిజలింగప్పగారిపై మెజారిటీ పార్టీ సభ్యులకు విశ్వాసమున్నట్టయితే వోటింగు పెట్టడమే మంచిది. ఆయనే గెలుస్తారు. అప్పుడు వాదోపవాదాలకు స్థానమే వుండదు. ఆ తర్వాత రాగల కాలం కాంగ్రెసు భవిష్యత్తును చూపిస్తుంది!

## ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్

ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ నిజమైన హేతువాదాన్ని విశదీకరించారు. సంఘంలోని ప్రతి రంగమూ ఒక గమ్యాన్ని ఆశించే విస్తృత మవుతున్నాయన్నా రాయన. ఆయన చూపించిన గమ్యానికి [దారి చూపితే వెళ్లడానికి సిద్ధంగా వున్నామని జనసంఘం నాయకులు అన్నారు. జనసంఘం నాయకులు ఒక ముస్లిం నాయకుడికి మద్దతు ఇవ్వడం ఇదే ప్రప్రథమం.

## బాద్ షా ఖాన్

అధికారంలో వున్న మన పార్టీ బాద్‌షాఖాన్ సృష్టించిన వాతావరణంలో కాస్త గాలి పీల్చుకుంటు న్నది. ఇప్పటివరకు కాంగ్రెసు చీకటిగదిలో వున్నట్టుగా దేశంలో జరుగుతున్న పరిణామాలకి తెల్లమొఖం వేస్తూ కూర్చుంది. అంతర్ యుద్ధాలతో సతమతమై పోతున్న నాయకులకు దేశం సంగతి, పార్టీ సంగతి, జనం సంగతి పట్టించుకునేంత తీరిక లేదు!

## పద్మవ్యూహం మొదటి మెట్టు

తన ఆదర్శాన్ని ఆశయాలని చాటి చెప్పడానికి ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ అహ్మదాబాదు వెళ్లారు. ఢిల్లీలో నల్గురు జూనియర్ మంత్రులపై గొడ్డలి పెట్టు! ఏనుగుల పోరాటంలో జింక నలిగినట్టు ఈ మంత్రులకి ఉద్వాసన జరిగింది. ఇది ఒక వుచ్చు. ఈ వుచ్చు బిగిస్తే తక్కిన నాయకులకు భయం పుట్టుకొస్తుందని చక్కని పద్మవ్యూహం పన్నారు శ్రీమతి గాంధీ!

ఇలాంటి విపత్కర పరిస్థితుల్లో మంత్రుల పదవీ కాలానికి అట్టే ఆయుష్షు వున్నట్టు కనిపించడం లేదు. వారి బాధ్యతలు నిర్వహించుకోడానికి చాల తక్కువ కాలం మాత్రమే వుంటున్నది. అప్పుడు పరిపాలన ఎంత సవ్యంగా జరుగుతుందో వూహాతీతమేమీకాదు. సీనియర్ మంత్రులు స్వంతంగా ఏ నిర్ణయాలూ చెయ్యలేకపోతున్నారు. వారికి స్వయంనిర్ణయాధికారం పూర్తిగా పోయింది.

సమయం కోసం కాచుకు కూర్చున్నారు కాంగ్రెసేతరులు. అస్తవ్యస్తమైన పరిస్థితిని వారు ఉపయోగించుకోలేక పోరు. దూరమాలోచించి మన నాయకులు [illegible] వ్యక్తిగతమైన పట్టు [illegible] [illegible] ఉత్కృష్టమైన [illegible] ●

# మీ రాజకీయ పరిజ్ఞానం ఎంత?

1. అంతరాత్మ అంటే ఏమిటి?
   - అ. చిన్న ట్రాన్సిస్టర్ రేడియో
   - ఆ. మనకి మంచీ చెడ్డ లని గురించి చెప్పేది
   - ఇ. పెట్టిన సంతకం విలువని రద్దు చెయ్యగలిగినది
   - ఈ. ఒక సినీ దర్శకుడి పేరు.
2. రాజీనామా అనేది—
   - అ. బెదిరింపు
   - ఆ. ఉద్యోగం వదులుకునేందుకు ఒక పద్ధతి
   - ఇ. ప్రత్యర్థులని ఓడించే ఒక ఉపాయం
   - ఈ. మెజారిటీ పుట్టించేందుకు సాధనం
3. భారత దేశం లౌకిక విధానాన్ని పాటించటానికి కారణం—
   - అ. ఈ దేశం 'అధికార-మతం' ఇస్లామ్
   - ఆ. నేపాల్ 'అధికార – మతం' హైందవ మతం కావటం
   - ఇ. ఇస్లామ్ సమావేశాలకి వెళ్లటానికి వీలుగా ఉండటం
   - ఈ. ఇస్రాయిల్ మతం యూదుల మతం కావటం
4. మెజారిటీ ఎవరికి అధికం?
   - అ. వయస్సు మళ్లిన వారికి
   - ఆ. ప్రొఫెసర్లకి
   - ఇ. పరధ్యాన్నంగా ఉన్నవారికి
   - ఈ. 10 సంవత్సరాలు పన్నులు కట్టనివారికి
5. అంచెలవారీ ఉపవాసం లక్ష్యం ఏమిటి?
   - అ. జీర్ణశక్తిని పెంపొందించటం
   - ఆ. హోటలు ఖర్చు తగ్గించటం
   - ఇ. సత్యాగ్రహ ప్రదర్శన
   - ఈ. కాలక్షేపం
6. ఐకమత్యం అంటే ఏమిటి?
   - అ. కలిసి ఉండటం
   - ఆ. లోటివారిమీద అసత్యారోపణలు చెయ్యటం
   - ఇ. జ్వరం తగ్గిన తర్వాత పాటించే ఆహార నియమం
   - ఈ. న్యూయార్కులో ఒక సంస్థ

ఈ ప్రశ్నావళి సమాధానాలు కాలానుగుణంగా ఉంటాయి. 1969 లో సరయిన సమాధానాలు 1. ఇ, 2. ఈ, 3. ఈ, 4. ఈ, 5. ఈ, 6. ఆ.

వేరే ఏవయినా సమాధానాలు ఇచ్చారంటే అవి మీ రాజకీయ పరిజ్ఞానం ఇంకా పెంచుకోవాలన్న సత్యానికి నిదర్శనాలు అయ్యే ప్రమాదం ఉంది! అన్ని ప్రశ్నలకీ సరయిన సమాధానాలు ఇవ్వగలిగినవారికి ఉజ్వలమయిన భవిష్యత్తు ఉంది...

—సంచాలకుడు

# హీరోలతో నా పరిచయం

— జయలలిత



'అప్పట్లో నాకు చాలా సిగ్గు.'

నేను నటించిన మొదటి తెలుగుచిత్రం 'మనుషులు మమతలు'; అందులో నా నాయకుడు నటసామ్రాట్ నాగేశ్వరరావు గారు. అప్పట్లో నాకు చాలా సిగ్గు; సెట్టుకు వెళ్ళినప్పుడల్లా నా షాటు కాగానే ఒక మూలలో కూర్చునేదాన్ని; ఎవరితోనూ మాట్లాడేదాన్నిగాను. ఒకరోజున శ్రీ అక్కినేని నా దగ్గరకువచ్చి 'చూడమ్మాయ్, నువ్విలా ఏకాంతంగా కూర్చుంటే ఎలా? అందరితోనూ కలిసి మెలిసి మాట్లాడాలి హ్యాపీగా, ఉత్సాహంగా వుండాల' అని హితబోధ చేశారు. ఆ చిత్రంలోని నటీనటులందరికీ నన్ను పరిచయం చేశారు. ఆరోజునుంచి నేను నా పద్ధతిని మార్చుకున్నాను.

మేమంతా ఔట్‌డోర్ షూటింగుకు వెళ్ళాం. అక్కడ కూర్చునేందుకు కుర్చీలు లేవు. శ్రీ నాగేశ్వరరావు 'మహానటుడు' కదా? ఆయన కుర్చీకోసం చూచేవారుకారు. మాతోపాటు ఆయన నేలపై కూర్చునేవారు. అంతేకాక ఏదో ఒక టాపిక్‌పై చర్చ జరిపేవారు. ఆయన షాటుకుముందు కొంతసేపు తమాషాగా వుంటారో, షాటులో అంత సీరియస్‌గా వుండేవారు. నేను నవ్వడం ప్రారంభిస్తే చాలా సేపటివరకు నాకు నవ్వు ఆగేదికాదు. నాగేశ్వరరావుగారిని చూచి నేను కూడా ఇప్పుడిప్పుడే 'షాట్' అనగానే మూడ్‌లోకి వచ్చేస్తున్నాను. [illegible] సెట్లోకి వస్తే అందరూ లేచి [illegible] కొత్తదనంగదా. అలా [illegible] చెప్పగలరు కూడా. నాకు [illegible] తెలుగు సరిగ్గా వచ్చేదికాదు. శ్రీ అక్కినేని నాకు డైలాగులు ఎలా పలకాలో చెప్పేవారు. ఒక షాటులో నా 'నటన' అనుకున్న విధంగా రాలేదని అనుకున్నారంటే నన్ను సపరేట్‌గా పిలిచి 'మీరు ఇలాచేస్తే చాలా బాగుంటుంది' అని చెప్పేవారు. నేను నాగేశ్వరరావుగారి దగ్గర ఎన్నో మంచి విషయాలను నేర్చుకున్నాను. నాకు ఆయనతో నటించడమంటే మహాసరదా.

* * *

నేను శ్రీ ఎన్.టి. రామారావు నటించిన 'సంపూర్ణ రామాయణం', 'శ్రీ కృష్ణ పాండవీయం' చిత్రాలను చూశాను. ఆయన ప్రక్కన నటిస్తే బాగుంటుంది అనుకున్నాను. నేను ఆయనతో నాయికగా నటించిన మొదటి చిత్రం 'గోపాలుడు భూపాలుడు' తొలిరోజు షూటింగుకు హాజరయిన నాకు 'షేక్‌హ్యాండ్' ఇచ్చి 'మనిద్దరం నటిస్తున్న మొదటి కాంబినేషన్ చిత్రం ఇది. చిత్రం బాగా [illegible] మీకేదయినా కాల్‌షీట్ల అడ్జస్ట్‌మెంట్ కావాలంటే నాకు తెలియచెయ్యండి. అర్థం చేసుకుని నటిస్తాం' అని శ్రీ రామారావు చెప్పినప్పుడు నా హృదయం సంతోషంతో నిండిపోయింది.

శ్రీ రామారావు సెట్లో తనేమో తన పనేమో చూసుకుంటారు. అనవసరంగా మాట్లాడరు. ఎవరి విషయాల్లోనూ జోక్యం కల్పించుకోరు; షాటు కాగానే తన మిత్రులతో కలిసి మాట్లాడుతుంటారు. ఆయన ధరించిన రామ, రావణ పాత్రలే నాలో ఆయనతో నటించాలనే కోరికను కల్పించింది. ఏ పాత్రనయినా చక్కగా నటించగలరు అప్పుడప్పుడు 'ఇలా చేస్తే బాగుంటుందేమో' అని సలహాలిస్తుంటారు.

* * *

నేను శ్రీ జగ్గయ్యతో 'ఆమె ఎవరు?', కృష్ణతో 'గూఢచారి 116', 'విచిత్ర దోపిడి', హరనాథ్‌తో 'శ్రీరామ కథ' చిత్రాలలో నాయికగా నటించినా, నేను వాళ్ళను గురించి యేమని చెప్పగలను?

# లిప్టన్ రూబీ డస్ట్ టీ

## చక్కని రంగు, మంచి రుచి, కమ్మదనము వీటన్నిటితో నిండినది అతి త్వరలో తయారగును

మంచి టీని మెచ్చేవారికి లిప్టన్స్ రూబీ డస్ట్. పైగా రూబీ డస్ట్ ప్రతి పొట్లానికి ఎన్నో కప్పులు ఎక్కువ టీని ఇస్తుంది. బలమైన పానీయ లక్షణంగల టీ. మిక్కిలి రుచి. హాయి గొల్పించే సువాసన. రూబీ డస్ట్ టీని త్రాగడం ఆహ్లాదకరం. ఎక్కువ పొదుపు కూడ యిచ్చును.




లిప్టన్స్ అంటే మంచి టీ




LRDC-1 .TEL

# నరకుని వృత్తాంతం

దీపావళికి ముఖ్యమైనది అమావాస్య నాటి ప్రదోషకాలంలో ఇంటిలో ఏ మూల మూలనూ కూడా చీకట్లు లేకుండా దీపాలను వెలిగించడం. అయినా—ఇప్పుడు జరుగుతూ వున్న పద్ధతిని బట్టి చూస్తే బాణా పంచుకూ, టపాసులకూ వున్న ప్రాముఖ్యం దీపాల పండుగకు లేనట్లు తెలుస్తున్నది. అంతే కాదు. చతుర్దశి నాడు వుండే ఆర్భాటమూ, [illegible] ఉత్సాహమూ దీపావళినాడు కానరాదు. నరకాసురుడి బొమ్మను తయారుచేసి, దానిని ఊరేగించి, దహించడమూ, మందుగుండు సామాను కాల్చి తలంటిపోసుకుని కొత్త దుస్తులు ధరించి భక్ష్యాలు ఆరగించడమూ — వీటితోనే ఉత్సాహానికి అవధి [illegible] తున్నది.

నరకాసురుణ్ణి శ్రీకృష్ణుడు సంహరించాడు కావున లోక కంటకుడైన నరకుని నాశానికి ఆనందంతో పండుగ చేసుకుంటున్నట్లు చాలా మంది భావిస్తారు. నరకుడు విష్ణువునకు భూదేవివల్ల కలిగిన పుత్రుడని పోతనగారి భాగవతం చదివినవారికి—

'ఇల్లాలం గిటియైన కాలమున ము
న్నే నంచు ఘోషింతువో
తల్లీ! నిన్ను దలంచియైన నిచటన్
దన్నుం గృపం గావఁడే!
చెల్లెంబో తల్లడించెనంచు నిల వా
క్రోశించు చందంబునన్
ద్రెళ్లెం జప్పుడుగాఁగ భూమిసుతుఁడు
దీప్తాహవక్షోణిపై.'

అనే ప్రసిద్ధమైన పద్యంవల్ల స్పష్టముగా తెలుస్తుంది. ఇతని సమగ్ర వృత్తాంతం ఎరిగినవారు చాలా తక్కువ.

హిరణ్యాక్ష హిరణ్యకశిపులు లోకాలను అల్లకల్లోలం చేసిన అసురులు. విష్ణుదేవునిపై తీరని విరోధం కలవారు. వారిలో హిరణ్యాక్షుడు భూదేవిని అపహరించుకొనిపోయి సముద్రంలో దాగుకొన్నాడు. అప్పుడు విష్ణువు వరాహ రూపాన్ని ధరించి సముద్రంలో చొచ్చి ఆ రాక్షసుడిని సంహరించి భూదేవిని ఉద్ధరించాడు. అప్పటి అసాధారణ పరిస్థితులలో భూదేవికీ, వరాహ రూపంతో వున్న విష్ణుదేవునికీ కలిగిన కలయికవల్ల భూదేవి గర్భం ధరించినది. ఆమె గర్భం పెరుగుతున్నకొద్దీ కాఠిన్యం వహించి, భూదేవికి ఎంతో బాధ కలిగింది. అప్పుడు విష్ణువు ఆమెతో 'నీకు గొప్ప బలపరాక్రమ సంపన్నుడూ, లోకోపకారీ అయిన కుమారుడు కలుగుతాడు. వానివల్ల తమకు ఏమి ఉపద్రవం కలుగుతుందో అని బ్రహ్మదులు భయపడి నీకు ఇలా బాధ కలిగేటట్లు చేస్తున్నారు. నీవిక భయపడవద్దు. ఇకమీద నీకు ఎలాంటి బాధా కలగదు. నేను త్రేతాయుగంలో రావణుని వధించుటకై రాముడనే పేరుతో అవతరిస్తాను. నేను రావణున్ని చంపిన తరువాతనే నీకు కుమారుడు కలుగుతాడు' అని చెప్పి అంతర్ధానమయ్యాడు. ఆ తర్వాత భూదేవి ఎట్టి బాధా లేకుండా మామూలు స్త్రీ వలెనే ఉండినది.

త్రేతాయుగంలో జనకమహారాజా యాగం కోసం భూమిని దున్నుతూ వుండగా భూగర్భంనుంచి ఒక బాలిక జనించినది. అప్పుడు భూదేవి స్త్రీ రూపం ధరించి, ఆ బాలికకు 'సీత' అనే పేరుపెట్టి, జనకునికి పుత్రికగా ఇస్తూ 'ఈ బాలిక మూలంగానే రావణ వధ జరగగలద'ని చెప్పినది. ఇలా చెప్పి, తనకొక ఉపకారం చెయ్యాలని కోరగా, జనకుడున్నూ 'సరే' అని మాట యిచ్చాడు.

రావణుని వధ జరిగిన తర్వాత ఏమి జరిగిందంటే—మునుపు సీతాదేవి పుట్టిన చోటనే—భూమినుండి ఒక పిల్లవాడు పుట్టాడు. అప్పుడు విష్ణువు ప్రత్యక్షమయి భూదేవితో ఇలా అన్నాడు— 'ఈ కుమారుణ్ణి జనకుడికి అప్పగించి పదహారేళ్ల వయస్సు వచ్చేవరకూ పోషించవలెనని అడుగుము. ఆయన, నీకు ఉపకారం చేస్తానని మాట యిచ్చాడు కదా! వాగ్దానం ప్రకారం ఆయన ఈ బాలుణ్ణి పోషిస్తాడు. నీవు కూడా స్త్రీ రూపాన్ని ధరించి ఈ బాలుడి దగ్గరనే ఉండు. పదహారేళ్లు నిండిన తర్వాత వీడు సమస్త సంపదలతోనూ తులతూగుతున్న రాజ్యాన్ని సంపాదిస్తాడు.' ఇలా చెప్పి ఆయన అదృశ్యుడయ్యాడు.

భూదేవి అర్ధరాత్రివేళ రహస్యంగా జనకుడివద్దకు వెళ్లి యీ వృత్తాంతాన్నంతటినీ చెప్పింది. జనకుడు యజ్ఞభూమికి వెళ్లి అక్కడ ఉన్న బాలుణ్ణి తీసుకొనివచ్చి తన పుత్రునివలెనే పెంచాడు. భూదేవి పెంపుడుతల్లి రూపంతో బాలుణ్ణి జాగ్రత్తగా చూచుకునేది.

జనకుడు ఆ బాలునికి నరకుడని పేరు పెట్టాడు. గౌతమమహర్షి పుత్రుడైన శతానందుడితో కలిసి ఆ బాలుడు విద్యలను అభ్యసించి వినీతుడై వుండేవాడు. రాజు అతనికి క్షత్రియోచితములైన సంస్కారాలను చేయించి, శస్త్రాస్త్ర విద్యలలో కుశలుణ్ణి ఒనరించాడు. ఆ బాలుడు అజేయ పరాక్రముడై జనకుడికి కూడా భయాన్ని కలిగించేవాడు.

పదహారేళ్లు నిండవచ్చాయి. అప్పుడు భూదేవి జనకునికి కృతజ్ఞత తెలుపుతూ, అతని అనుమతిని పొంది కొడుకుతో కూడా గంగాతీరానికిపోయి, అక్కడ అతని జన్మ వృత్తాంతాన్ని నరకునికి తెలియజేసింది. అప్పుడు విష్ణువు ప్రత్యక్షమై కుమారునికి శక్త్యాయుధాన్నిస్తూ 'నీకొక రాజ్యాన్ని సిద్ధంగా ఉంచాను. కామరూపదేశానికి పోయి, అక్కడి కిరాత రాజును జయించి, ప్రాగ్ జ్యోతిషనగరం రాజధానిగా దానిని పాలించు. ప్రాణాపాయస్థితిలో తప్ప ఈ ఆయుధాన్ని ప్రయోగించవద్దు. ఇతర సమయాల్లో ప్రయోగిస్తే నీ ప్రాణానికే ముప్పు కలుగుతుంది. సాధువులను బాధించక, న్యాయంగా పాలించు' అని హితోపదేశంచేసి, ఒక దివ్యరథాన్ని కూడా యిచ్చి, భూదేవితోకూడా అంతర్ధానం పొందాడు.

బ్రహ్మదేవుడు మొట్టమొదట నక్షత్ర సృష్టి చేసిన ప్రదేశమే ప్రాగ్ జ్యోతిషమట! అదే కామరూపదేశానికి ముఖ్యపట్టణం. ఘటకుడనే కిరాతరాజు దానికి పాలకుడు, నరకునితో పోల్చి చూస్తే చాలా బలహీనుడు. మహాబలాఢ్యుడైన నరకుడు కిరాతరాజును ఓడించి, ఆ రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్నాడు. విదర్భరాజ పుత్రి



అయిన మాయాదేవి నరకుని పట్టమహిషి. అతడు చాలాకాలం న్యాయంగానే రాజ్యాన్ని పాలించాడు. అతని కోరికపై జనక మహారాజుకూడా కొంతకాలం అక్కడేవుండేవాడు.

నరకుడికి మంచిరోజులు పోయాయి. మహా క్రూరుడైన బాణుడనే రాక్షసుడితో అతనికి స్నేహం ఏర్పడింది. సహవాస దోషంవల్ల నరకుడున్నూ క్రూరుడై లోకానికి ఉపద్రవం కలిగిస్తూ వుండేవాడు.

ప్రాగ్ జ్యోతిపురంలో కామాఖ్యాదేవి ఆలయం వుండేది. ఒకప్పుడు వసిష్ఠ మహాముని ఆ దేవిని పూజించడానికని ఆ వూరికి వచ్చాడు. దుర్బుద్ధి అయిన నరకుడు కామాఖ్యాదేవి గుడితలుపులు మూయించి, పూజకు అవకాశం లేకుండా చేశాడు. ఈ విధంగా తన్ను అవమానించి నందుకు ఆ మహాముని కోపించి 'ఓయీ! నీవు బల గర్వితుడవై సజ్జనులను అవమానిస్తున్నావు. నీ తండ్రివల్లనే నీకు మరణం సంభవిస్తుంది. నీవు మరణించిన తర్వాత వచ్చి యీ దేవిని పూజించగలను. నీవు మరణించే పర్యంతమూ యీదేవి సపరివారంగా యీవూరు విడిచిపోయి మరొక చోట నివసిస్తుంది అని నరకుణ్ణి శపిస్తూ చెప్పి వెళ్లిపోయాడు.

నరకుడు వసిష్ఠశాపానికి మిగుల భయపడ్డాడు. కాని మిత్రుడైన బాణాసురుడు ధైర్యం చెప్పి, బ్రహ్మదేవుణ్ణి గురించి తపస్సు చెయ్యవలెనని సలహా యిచ్చాడు. ఘోరమైన నరకుని తపస్సుకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షంగా తనకు దేవదానవులవల్ల మరణం రాకూడదని వరం కోరాడు నరకుడు. 'సరే' అన్నాడు బ్రహ్మ. వరగర్వితుడై నరకుడు ఆపైని మరీచెలరేగిపోయాడు. దేవతలనూ, మునులనూ ఎంతో బాధించాడు. తన కొడుకైన భరతునితోనూ మురుడు మొదలైన సేనానులతోనూ ఇంద్రుడిమీదికి పోయి జయించాడు. పదారువేల రాజకన్యలను చెరలో వుంచాడు. అమూల్యాలైన అదితి కుండలాలను అపహరించాడు. ఇంద్రాది దేవతలు శ్రీకృష్ణునితో మొరపెట్టుకోగా నరకుణ్ణి సంహరించడానికి అతడు కామరూపదేశానికి వెళ్లాడు. సత్యభామ నిర్బంధించగా, శ్రీకృష్ణుడు ఆమెనుకూడా తనతో తీసుకువెళ్లాడు.

రాక్షసవీరులతో పోరు ఘోరంగా జరిగింది. అందులో నరకుడి సేనాధిపతి మురుడూ, కుమారుడూ మరణించారు. మొదట నరకుడికి తీవ్రమైనకోపం కలిగింది. అతడు కృష్ణునిమీదికి రాగా, సత్యభామ అడ్డుతగిలి, తానే అతనితో తీవ్రంగాపోరింది. కొంత సేపటికి ఆమె అలసిపోగా శ్రీకృష్ణుడు నరకునితో తలపడి అతన్ని సంహరించి రాజపుత్రికలను చెరనుండి విడిపించాడు. శ్రీకృష్ణుడు ఇంద్రుని తల్లి అయిన అదితికి, ఆమె కుండలాలు ఇవ్వడానికి స్వర్గలోకానికి వెళ్లడమూ, పారిజాతాపహరణమూ ఆ తర్వాతనే జరిగాయి.

నరకాసురుడు అశ్వయుజ బహుళ చతుర్దశినాడు అర్ధరాత్రి గడిచిన తర్వాత సంహరించబడ్డాడు. అతని పీడ వదలడం వల్ల ఆనందపరవశమైన జనం శేషించిన రాత్రిలోనూ, మర్నాడూ మహోత్సవం జరుపుకున్నది. ఆ రెండురోజుల పండుగులే నరక చతుర్దశీ, దీపావళులు!

—అంగీరస ●

# అయిదు దీపావళులు



"ప్రతి దీపావళికి కొత్త వెలుగులు"

ఒక్కొసారి ఆలోచిస్తుంటే జీవితం ఎంతో అద్భుతం అనిపిస్తూ ఉంటుంది. నేను చిత్రపరిశ్రమకు వచ్చిన యీ అయిదేళ్లలోనూ నా జీవితంలో ఎన్నో అపూర్వ సంఘటనలు దొర్లిపోయినవి. అవి ఏమిటీ అంటే 'ఫలానా' అని ఇప్పుడు నిర్వచించలేనివి.

నా చలన చిత్ర జీవితంలో యిది ఐదో దీపావళి. ప్రతి దీపావళికీ జీవితం మారుతూనే వస్తున్నది. కొత్త వెలుగుల్ని తెస్తూనే ఉన్నది.

తొలి దీపావళికి 'తేనెమనసులు' విడుదలయి, నాకు మంచిపేరు తీసుకువచ్చింది. రెండవ దీపావళికి ముందు 'గూఢచారి 116' విడుదలయింది. దానితో నేను నటుడుగా నిలబడే అవకాశం కల్పించిందా దీపావళి.

'చక్కని నటుడుగా నన్ను తీర్చిదిద్దిన దీపావళి మూడోది. 'మరపురానికథ' ఆ సంవత్సరమే విడుదలైంది.

నాలుగో దీపావళికి బిజీ ఆర్టిస్టునై పోయాను. రాత్రింబగళ్లు నిర్విరామంగా పనిచేసి మంచం ఎక్కాను. టైఫాయిడ్‌లో నెల ఉన్నాను. నెల్లాళ్లు మంచం మీదున్నా సఫర్ అవలేదు...అప్పుడు నేను నటించిన చిత్రం 'వింత కాపురం' బాగా ఆడుతున్నది. దాని మీద ఉత్తరాల శరపరంపర...బాగా చేశాననీ; నా వేషం ఎంతో నచ్చిందనీ అనేక మంది అభిమానులు ఉత్తరాలు రాశారు. ఆ ఉత్సాహం నేను తొందరగా కోలుకునేందుకు దోహదం చేసింది.

నా జీవిత పథంలో గొప్ప మార్పు తీసుకొచ్చిన దీపావళి ఐదోది. గత దీపావళి మంచి యీ దీపావళి దాకా ఎదురుచూడని ఎన్నో ఘటనలు — అద్భుతాలు జరిగినవి. అవి తీయని అనుభూతులుగా, మాయని జ్ఞాపకాలుగా నాలోనే ఉండిపోతవి. అందుకే అవి నిర్వచించలేనివీ; నిర్వచించరానివీ ఐనాయి.

గత నాలుగు దీపావళుల కన్న యీ దీపావళికి భౌతికంగాను, మానసికంగాను బాగా ఎదిగానేమోననిపిస్తుంది.

ప్రతి దీపావళీ నాలో మార్పు తెస్తూ ఉన్నది; నాకు మంచి చేస్తూనే ఉన్నది. ఈ దివ్య దీపావళి మరిన్ని నవ్యశోభలతో వచ్చే యేడాది రావాలని ఆశిస్తూ

—కృష్ణ



# నిరంతరత్రయం

మల్లాది సూరిబాబు



(గత సంచిక తరువాయి)

లోపల మ్యాటినీ ప్రారంభం అయింది. నేను నిరాశతో వెనుదిరుగుదామని అనుకుంటున్న క్షణంలో.

ఒక తియ్యటి కంఠం 'దిల్ కిస్‌కో దియా' అని అడిగింది.

'ఏక్ బేవఫాకో' అని సమాధానంయిస్తూ వెనక్కి తిరిగాను. పూర్తిగా తురక సాంప్రదాయంలో పైనుంచి క్రిందదాకా బురఖాతో ఆ మనిషి నిలబడివుంది.

ఆ మనిషే సవడానికి తార్కాణం ఆ కంఠమే!

'బేవఫా క్యాసే!'

'మేరే దిల్ తో లేలియా మగర్ అప్‌కాతో నహీదియా;' సెంఏటి గళంల ఆ నవ్వులో వినిపించింది.

'ఆప్ పరదా' క్యూంకియా?...'అని అడిగాను. 'కి...తో ...వహచానే!' నేను ఏదో ...అనుకునేలోపలే.

'కారు సిద్ధంగా వుంది' అని కోయిల పలికింది.

ఆ కారుని చూడగానే నేను ఒక్క క్షణం హైరాన పడ్డమాట నిజం!

అది పెద్ద పెద్ద ఎంబాసిడర్‌లకు వుండే కారు లోపల ఎయిర్‌కండిషన్ చేసి వుందేమో ఎంతో హాయిగా వుంది.

ఇద్దరం కలిసి చాలాదూరం వచ్చేశాం. 'లవర్స్‌లేన్' దగ్గర యిద్దరం కూర్చుని వుండగా ఆ చిన్నది నాకు చేరువ అవుతూ.

'నన్ను ఎన్నడూ ద్వేషించరు కాదూ' అని అడిగింది.

'నిన్నా?'

'మాట యివ్వండి'

'నిన్ను నేనూ ఎప్పుడూ ప్రేమిస్తాను'...

చిన్నది ఏం మాట్లాడలేదు.

నాకు ప్రేమను కానుకగా యిచ్చిన చిన్నదానిపేరు అడగవచ్చునా?

'మెహర్'

'ఎంతో అందమైన పేరు.'

'మాది కరాచి'

ఒక్కక్షణం నామనస్సు మూగపోయింది. మనస్సులో 'మసలినమాట' — మెహర్ పాకిస్థానీ;

నా మనస్సులోని సంకోచం గ్రహించిందో ఏమో. నన్ను గట్టిగా కౌగలించుకుంది.

చిక్కటిపాలల్లో చిటికెడు వుప్పుపడ్డట్టు అనిపించింది.

'ఇంటికి వెళ్ళిపోదాం' అని అన్నాను.

మెహర్ ఒక్క క్షణం నావంక చూచి 'సరే' అని అన్నది. కారు సరాసరి ప్లాజా దగ్గరకు వచ్చి ఆగింది. కారు దిగి,

'ఖుదాహాఫిజ్' అని అంది.

నేను 'అల్‌విదా!' అని అన్నాను.

మర్నాటినుంచి ఎదుటియింటి కిటికీలు మూసివుండేవి. నేను రామయ్య పాట పాడటం మానేశాను.

రాంమోహన్ 'ఏం మజానూ లైలా ఎలావుంది ?' అని ఒకరోజున అడిగాడు.

ఆ రోజు ఉదయమే మెహర్ వాళ్ళ యింకొక యింటికి మారారని తెలిసింది.

మనస్సులో ఏదో అర్థంకాని వెలితి కనిపించింది. సాయంకాలందాకా కాలుకాలిన పిల్లిలాగా కరోల్‌బాగ్ అంతా తిరిగాను. ఎగ్జిబిషన్‌కు వెళ్ళానన్న మాటేకాని పని చెయ్య బుద్ధికాలేదు.

స్టాల్లో సుదర్శన్‌సింగ్ ఎవరో పంజాబీ అమ్మాయితో మాట్లాడుతున్నాడు. నన్నుచూసి చిరునవ్వు నవ్వాడు. ఆ నవ్వుకు అర్థం నాకు వెంటనే తెలిసింది. వాళ్ళ యిద్దరిని అక్కడే వదిలి 'చైనీస్ పెవిలియన్‌కు వెళ్ళాను'

నన్ను చూడగానే ఒక చైనీస్ కుర్రవాడు నవ్వి హిందీలో పలుకరించాడు.

'ఢిల్లీ యూనివర్సిటీలో తను చదువుతున్నానని, మా స్టాల్ చూశానని చాలా బాగుందని', నేను అడగకుండానే తనే చెప్పాడు.

నాపేరు 'శివచరణ్' అని నేను చెప్పాను.

నాపేరు 'సింగ్—పో' అని తనపేరు చెప్పాడు.

తను దగ్గరవుండి వాళ్ళ పెవిలియన్ అంతా చూపించాడు. చివరకు ఇద్దరం కలసి 'ఇండియా కాఫీ హవుస్' లో టిఫిన్ తిన్నాం.

ఆ రోజునుంచి అతను నాకు స్నేహితుడయ్యాడు. తరుచూ నా దగ్గరకు వస్తూ

# నిరంతరత్రయం

వుండిపోయా -

ఎగ్జిబిషన్ జనవరి రెండవ తారీకున సమాప్తమయింది. ఆరోజు ఉపరాష్ట్రపతి రాధాకృష్ణన్ సభలో ఆ పారిశ్రామిక ప్రదర్శనానికి భరతవాక్యం పలికారు.

ఆ రోజు సాయంకాలం జరిగిన సభకు రేణుక వచ్చింది. మేము లోపలికి వస్తూ వుండగా మెహర్ కనిపించింది. నన్ను చూడగానే ఆ పిల్ల ముఖంలో వెయ్యి వెన్నెలలు వెల్లి విరిసాయి. నేనే ముందుగా 'హల్లో!' అని పలకరించాను.

రేణుక ముఖంలో కొండంత బరువు తీరినట్టు కనిపించింది. మెహర్ నా ప్రక్కన వచ్చి కూర్చుంది. నేను ఏదో చెబుదామని అనుకున్నాను. కాని ఏం చెప్పలేక పోయాను.

'గుడ్ థింగ్స్ ఉయ్ ఆర్ సారీ! బాడ్ థింగ్స్ ఉయ్ ఆర్ గ్లాడ్! మస్ట్ కమ్ టు ఎండ్' అని రాధాకృష్ణన్ ఉపన్యాసం ప్రారంభమైయింది.

'మేము రేపు వెళ్లిపోతున్నాం' అని మెహర్ అన్నది.

'ఎక్కడికి?'

'టెహరాన్, నాన్నగారికి అక్కడికి బదిలీ అయింది'

నేనేం మాట్లాడలేదు.

'ఫిర్ కభి మిలేంగే?' అని రజియా అడిగింది.

'శాయద్' అని నేను అన్నాను.

ఉపన్యాసం అనంతరం పెద్ద పార్టీ జరిగింది.

పార్టీలో సింగ్‌పో కూడా కనిపించాడు. రజియా అతను చాలా కాలంనుంచి పరిచయం వున్నవాళ్లల్లాగా మాట్లాడుకున్నారు.

'రజియా నా క్లాసుమేట్' అని తనకు పరిచయం చేశాడు.

'నేను రేపు మావూరు వెళ్లిపోతున్నాను' అని నేను అన్నాను.

రేణుక ఉలిక్కి పడ్డది.

రజియా ఏం మాట్లాడలేదు.

అంతా కలిసి రజియా వాళ్లకారులో 'కనాట్ ప్లేస్' వచ్చాం. 'డిన్నర్ ఎట్ గేలార్డ్స్' అని సింగ్‌పో అన్నాడు.

ఆ రోజు రాత్రి పది గంటలూ అక్కడే గడిపాం. — సింగ్‌పో పీకింగ్, ఫార్మోసా, హాంగ్‌కాంగ్, బర్మా, యీ ప్రాంతాలనిగురించి అక్కడ తన అనుభవాలని గురించి చాలాసేపు చెప్పాడు. చెబుతూ చెబుతూ,

'చరణ్‌జీ మీరుకూడా ఒక్కసారి 'కింగ్‌పీ' రావాలి. ప్రజారాజ్య మంటే మీకు అర్థమవుతుంది.' అని అన్నాడు.

నేనేం మాట్లాడలేదు. మెహర్ నాచేతిని తన చేతిలోకి తీసుకుంది.

నేను క్రీగంట ఆ పిల్ల వంక చూశాను.

రేణుక నావంక చూసి తలవంచుకుంది.

పదిగంటలు కొడుతూవుండగా బయటకు వచ్చాం.

'మనం మళ్లీ కలుద్దాం' అని సింగ్‌పో అన్నాడు.

'గుడ్‌బై!' అని నేను అన్నాను.

అతను ఎక్కిన కారు కనుమాపైంది.

రేణుక ఎక్కడో అనంతంలోకి చూస్తోంది.

'మరిచి పోతావా?' అని మెహర్ అడిగింది.

'లేదు' అని అన్నాను,

'లేదు అని కాదు, గుర్తు పెట్టుకుంటానని అనకూడదా?' అని మెహర్ అడిగింది.

'నా స్మృతికి నువ్వు ఎన్నడూ దూరం కావు.'

'థాంక్యూ.'

నేనూ రేణుకా మిగిలాం.

ఇంటికి వెడదామా అని అడిగాను.

'ఎక్కడైనా కూర్చొందాం' అని అన్నది.

నేను ఉలిక్కి పడ్డాను.

అది జనవరి మాసం. ఢిల్లీలో చలి విపరీతంగా వుంది. రాత్రి పది గంటల సమయం. దాదాపు వూరు అంతా నిర్మానుష్యంగా వుంది.

కాని రేణుక మాట కాదనలేక పోయాను.

ఇద్దరం కలిసి ఇండియా గేటు దగ్గరకు టాక్సీలో వెళ్లాం.

దూరంగా అక్కడక్కడ ఒకటి రెండు జంటలు నడుస్తున్నాయి. ఎటు చూసినా చలి—మంచు.

'నిజంగా రేపు వెళ్లిపోతున్నారా?' అని రేణుక అడిగింది

'ఉద్యోగం చేసుకునేవాళ్లం. వెళ్లక తప్పుతుందా!'

'మీరు వెళ్లిపోతే నాన్నగారికి తోచదు' నాకూ ఏం తోచదు

మమ్మల్ని అందరిని మరిచిపోతారా?'

అప్పుడు నా అంత కృతఘ్నుడు యింకా ఎవరూ వుండరు.

అంతేనా?

'అంతేకాదు రేణూ మీ అందరు నా ఎడల చూపిన ప్రేమ, అనురాగం నేను ఎప్పుడూ మరిచిపోను. మీ అందరి ఋణం ఎలా తీర్చుకోవాలో?'

'ఋణమా? మేము మీకేం అప్పు యివ్వలేదే?'

ఆ మాట వినగానే ఎందుకనో కాని నా కంఠం గద్గదమైంది. కన్నీరు కంఠాన్ని అడ్డుకుంది.

'నన్ను క్షమించు రేణూ' అని అన్నాను.

రేణు ఏం మాట్లాడలేదు. నా చేతిని తన చేతులోకి తీసుకుంది. మనం మళ్లీ కలుసుకుందాం. నేను ఢిల్లీ వచ్చినప్పుడు తప్పక నిన్ను చూడటానికి వస్తాను

'చూడటానికి వస్తారా? అంతేనా!'

'మీ యింటికే సరాసరి వస్తాను సరేనా.'

'థాంక్యూ!'

మర్నాడు ఢిల్లీ వదిలి వచ్చేశాను. ఎన్నో మధురస్మృతులు అనుభూతులు నింపుకుని యింటికి తిరిగి వచ్చాను.

1962 అక్టోబరులో నాకు తెలియని దస్తూరిలో ఉత్తరం వచ్చింది.

ప్రియమిత్రమా!

నేను మా దేశం తిరిగి వెళ్లిపోతున్నాను. ఎంత సిగ్గుతో అవమానంతో తిరిగి వెడుతున్నానో చెప్పలేను. 'ఐయామ్ ఎషేమ్డ్ ఆఫ్ అవర్ కంట్రీ అండ్ ఇట్స్ ట్రెచరీ' నేను భారత దేశం తిరిగి ఎన్నటికి రాగలనో చెప్పలేను. కాని ఒక్కమాట నమ్మమని నా ప్రార్థన—మా దేశంలో అందరూ మావోలు కారు. మనం మళ్లీ తప్పక కలుస్తాం. బుద్ధదేవుని దేశంలో ఎక్కడో అక్కడ మనం కలుస్తాం! గుడ్‌బై.

ఆ ఉత్తరాన్ని వెయ్యిముక్కలుగా చింపి వేద్దామన్నంత కోపం వచ్చింది. ఎందుకంటె అంతకు అరగంట క్రితమే ఢిల్లీ నుంచి నాకు టెలిగ్రాం వచ్చింది.

'ఐ హేట్ యు! ఐ హేట్ ఎవ్వెరి వన్ ఆఫ్ యూ' అని బిగ్గరగా ఆక్రోశించాను.

మూడు సంవత్సరాలు గడిచిపోయాయి. గడచిన బాధలు మరచిపోయానని అపోహ పడ్డాను.

పాకిస్థాన్ దండయాత్ర ప్రారంభమైంది. రాంమోహన్ ఎక్కడ వున్నాడో తెలియపరచమని రేణుకకి ఉత్తరం రాశాను.

'హి ఈజ్ ఇన్‌ది ఫ్రంట్ ఎలాంగ్ విత్ మై హజ్‌బెండ్' అని సమాధానం వచ్చింది.

రోజూ వెయ్యిమంది దైవాలకి మొక్కుకునేవాడిని. కాని నా ప్రార్థన ఏదైవం వినలేదు.

రెండు అమావాస్యలు గడిచాయి. మెహర్ దగ్గరనుంచి రోమ్‌నుంచి వుత్తరం వచ్చింది.

'మనదేశాలకు పట్టిన శాపం ఏమిటి? ఎప్పుడు విముక్తి? ఎప్పుడు శాంతి? మన రెండుదేశాలు కలిసి ఒకే తల్లి పిల్లలుగా జీవించగల దినం ఏనాడైనా వస్తుందా?'

ఈ ద్వేషజ్వాలలు చల్లారే దెప్పుడు? మనం స్నేహంగా కలుసుకునే దెప్పుడు? ఏ యుగంలో? ఏ జన్మలో?'......

మొసలి కన్నీళ్లు!!!

చూస్తూండగానే ఆ ఉత్తరం వెయ్యి ముక్కలుగా గాలిలో కలిసిపోయింది.

మనస్సు వేసిన బొమ్మని మనసే చెరిపి వేసింది.

అర్థంకాని అంతస్థులేని వాళ్లతో చెలిమిచెయ్యడమే మనంచేసిన పొరబాటు... అందుకు ప్రతిఫలం అనుక్షణం అనుభవిస్తూనే వున్నాం...

పీడకలలు మరిచిపోదా మనుకున్నాను! కాని పూర్వజన్మ పాపంలాగా వెన్నంటి వస్తూనే వున్నాయి...

చీకటినుంచి వెలుగువచ్చింది ... మనస్సులో ఏదో ఆశకలిగింది.

'మెహర్' అని పిలిచాను.

ఉద్దవ్‌సింగ్ ముఖం కనిపించింది.

'ఇంకొక అరగంటలో మనం ఇండియాకు వెళ్లిపోతున్నాం' అని అన్నాడు.

వాళ్లేరి?

'వస్తారు...తొందరగానే వస్తారు.'

కొద్ది క్షణాలలో కారు వచ్చింది.

కారులో ఇద్దరంకలిసి ఎయిరో డ్రోముకు వచ్చాం.

కారులోంచి దిగే ముందు ఉద్దవ్ సింగ్‌తో 'ఒక్కమాట అడగనా?' అని ప్రశ్నించాను.

నువ్వేం అడుగుతావో నాకు తెలుసు. నువ్వు రాంసింగ్ అనే స్మగ్లర్‌వి ఈదేశం నుంచి చాలాసార్లు బంగారం, వెండి మన దేశానికి దొంగచాటుగా రవాణా చేశావు. నీకూ యిక్కడి ముఠాకు ఏదో చెడింది. ఈ సారి నువ్వు ఈ దేశం వచ్చినప్పుడు నిన్ను అంతం చెయ్యాలని వాళ్ల ప్లాను

రాం సింగ్?

'అచ్చంగా నీలాంటి మనిషి. మీయిద్దరికీ ఏమాత్రం తేడా లేదు, అందుకనే ఈ జాగ్రత్తలన్నీ తీసుకోవలసి వచ్చింది!'

'నేను శివచరణ్ అని నమ్మకం ఎల్లా?'

మాకు తెలుసు ఆధారాలు వున్నాయి, అవి ఏమిటని నన్ను అడగొద్దు. నువ్వు సురక్షితంగా యిండియా చేరటం మాకు కావాలి ... ప్రభుత్వానికి నీ అవసరం ఎంతైనావుంది. మీలాంటివాళ్ల విషయంలో ఎంత జాగ్రత్తైనా అవసరం.

'థాంక్యూ!'

ఇంటర్నేషనల్ లాంజ్‌లోకి వచ్చాం! అక్కడ మెహర్, సింగ్‌పో కనిపించారు. మెహర్ చేతిలో పెద్దపువ్వుల గుత్తివుంది..

నా దగ్గరకువచ్చి నా చేతికి యిచ్చింది. సింగ్‌పో నా దగ్గరకు వచ్చాడు.

'మీరు మమ్మల్ని ఆశీర్వదించాలి' అని అన్నాడు.

'దేనికి?' అన్నట్టు వాళ్లవంక చూశాను.

'మేము యిద్దరం వివాహం చేసుకున్నాం?'

పాకిస్థాన్ పెళ్లికూతురు! చైనా పెళ్లికొడుకు!

ఆశీర్వదించుదామని చెయ్యి ఎత్తాను. కాని అంతలోనే మనస్సు భగభగమని మండింది.

స్థాణువులాగా నిలబడిపోయాను.

'అయామ్ సారీ!' అని అన్నాను.

వాళ్లిద్దరూ ఒక్క క్షణం తెల్లబోయారు, అంతలోనే మెహర్ తెప్పరిల్లుకుని...

'ఇండియాలో మీ ఫ్రెండ్సు ఎల్లా వున్నారు?' అని అడిగింది. నా మనస్సు యిహ వుండబట్టలేక పోయింది

'ఫ్రెండ్స్? ఇంకెక్కడి ఫ్రెండ్స్.'

'ఏం?'

'ఓపిక వుంటే వెళ్లి వెదకండి. తుపాకి గుళ్లతో శరీరమంతా తూట్లుపడ్డ సుదర్శన్‌సింగ్ శవం వేఘా రంగంలో దొరుకుతుంది'

'అయ్యో! మరి రాంమోహన్!'

'లాహోరు రంగంలో పాటన్ టాంకు క్రింద నల్లిలాగా నలిగిపోయాడు.

వాళ్లిద్దరూ ఏం మాట్లాడలేదు. మెహర్ తలవంచుకుంది. సింగ్‌పో అనంతంలోకి చూస్తున్నాడు.

'యువర్ అటెన్షన్ ప్లీజ్ యువర్ అటెన్షన్ బిఓఏసి ఎనౌన్స్ ఇట్స్ ఫ్లైటు కలకటా 471'

సింగ్‌పో నా చేతిని తనచేతిలోకి తీసుకున్నాడు 'ఫర్‌గివజ్! వుయార్ ది డామ్‌డ్!' అని అన్నాడు.



## నిరంతరత్రయం

'అల్‌విదా!' అని మెహర్ అన్నది.
'ఖుదా హాఫీస్' అని అన్నాను.
విమానంలో పైలట్‌దగ్గర మొట్ట మొదటి సీటులో కూర్చున్నాను— ఉద్ధమ్‌సింగ్ ముఖంలో విషాదం కనిపించింది. నాకు షేక్‌హాండు యిస్తూ, 'అడియోస్ ఏమిగో!!' అని అన్నాడు. నేను గుడ్ బై మై ఫ్రెండ్స్! అని అన్నాను. విమానం భారతదేశం దిక్కుగా కదిలింది. ●

---

# అరబ్బు గెరిల్లాలని అరికట్టే ఇస్రాయిలీ అమ్మమ్మ



తన కుమార్తె పిల్లలని తోపుడుబండిలో తిప్పుతున్న శ్రీమతి గోల్డామెయిర్

అరబ్బు-ఇస్రాయిల్ యుద్ధం గురించి ప్రస్తావిస్తూ శ్రీమతి గాంధీ, భారత దేశం ఈ పోట్లాటని అంతంచెయ్యాలనీ అంతర్జాతీయ వేదికలలో ఈ సమస్యని శాంతియుతమయిన పరిష్కారం తీసుకు రావాలనీ ప్రయత్నిస్తోందన్నారు. ఇస్రాయిల్ ఉనికిని భారత దేశం గుర్తిస్తున్నదనీ, ఇస్రాయిల్ ఒక దేశంగా ఉండే హక్కుని భారత దేశం గుర్తిస్తున్నదనీ ఆమె అన్నారు. (25-10-69 బొంబాయిలో ప్రధాన మంత్రి ఉపన్యాసం వార్త, పి. టి. ఐ, యు ఎన్. ఐ)

కొంతకాలం క్రితం అరబ్బు గెరిల్లా కూటమి 'అల్‌ఫతా'కి చెందిన కొందరి బొమ్మలు భారత వార్తాపత్రికలలో పడ్డాయి. 'అల్‌ఫతా' ఇస్రాయెల్ చేస్తున్న చెడ్డపనులని ధైర్యంగా ఎదుర్కొంటున్న ఉద్యమమనుకుంటారు చాలామంది. 'అల్‌ఫతా' చేసే ప్రచారంకొంతఆవిధంగాఉంటుంది అయితే 'ఆల్‌ఫతా' లక్ష్యాలు వేరు; ఈ విషయం వారి చేతలవల్లా, అరబ్బుదేశాలలో అదిచేసే ప్రచారంవల్లా గ్రహించవచ్చు. 'ఇస్రాయల్' అనబడే దేశం ఒక కోట వంటిదనీ, సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా దానిని ఒక దీర్ఘమయిన, రక్తసిక్తమయిన యుద్ధంతో నాశనం చేస్తేగాని తమ ఉద్యమం లేక యుద్ధంలోని వర్తమానఘట్టం నెగ్గలేదని 'అల్‌ఫతా' అధిపతి యాస్సర్ అరాఫత్ ఒక సవుదీ అరేబియా పత్రికా విలేఖరితో అన్నాడుట.

ఒక అల్‌ఫతా సాధించిన 'విజయాలు' అధికంగా అసహాయులయిన గ్రామప్రజలమీద, సేనలతో సంబంధంలేని నగరపౌరులమీద, విదేశాలలో విమానాశ్రయాల సిబ్బందిమీద అధికంగా ఉంటాయి. ఈ 'విజయాలవల్ల' బాధపడేది యూదులు మాత్రమే కాదు. అరబ్బులు కూడా. అరబ్బులు ఎందుకంటే, వారు ఇస్రాయిలీ అధికారులతో సహకరిస్తారేమోనని, అసలు అరబ్బుప్రాంతాలలో కల్లోల పరిస్థితి ఏర్పడటానికని.

ఈ 'అల్‌ఫతా' ఉద్యమానికి శ్రీ నాసర్ మద్ధతు ఉన్నట్లు కనిపిస్తుంది. అఖిల అరబ్బుజాతి మహానాయకుడనని చెప్పుకుంటున్న నాసర్ 'అల్‌ఫతా' నాయకుడితో తీసుకున్న ఫోటోలు పత్రికలలో పడ్డాయి.

ఈ మహానాయకుడి వెనుక కొందరు కోట్లమంది అరబ్బులు ఉన్నారు— కనీసం అరబ్బుదేశాల జనాభాలు అలా ఉన్నాయి. వారి సేనలు, ఆయుధ సామగ్రీ కూడా పెద్దవే...

దీనినంతనీ సునాయాసంగా ఎదుర్కొంటున్న చిన్నదేశం ఇస్రాయెల్ జనాభా ముప్పయి లక్షలుకూడా లేదు! ఈ దేశం ఆయుధబలంకూడా తక్కువే. ఇక, ఇస్రాయల్ నాయకత్వం వహిస్తున్న వ్యక్తి మహానాయకులమనుకునే వారివలే యోధుడనా, వీరుడనా అని చెప్పుకునే వ్యక్తి కాదు.

ఇస్రాయల్‌దేశం ప్రధాన మంత్రి ఒక మధ్యవయస్సు వనిత. తన కుమార్తె పిల్లలని తోపుడు బండిలో తిప్పే అమ్మమ్మ! తరుచు తన వంట స్వయంగా చేసుకునే మహిళ. ఇంటికి ఎవరయినా అతిథులు వస్తే స్వయంగా కాఫీచేసి ఇచ్చే వ్యక్తి. ఎల్లప్పుడూ శాంతికోసం ఎదురుచూసే స్త్రీ. ●

## చావుకి కారణం

భారత ప్రభుత్వానికి చీఫ్ ఎకనమిక్ ఎడ్వైజరు [ఆర్థిక సంబంధ ముఖ్య సలహాదారు అనవచ్చు] గా పని చేస్తున్న 42 ఏళ్ళ వి. కె. రామస్వామి అనే ఆయన తన సొంత యింటిలో చనిపోయి వున్నాడట. పోలీసు కథనం ప్రకారం ఆయన వూపిరి ఆడకపోవడం వల్ల చనిపోయి వుండొచ్చట. ఢిల్లీలోని ఆయన సొంత యింటిలో ఒక రూములో సోఫా ఒకటి కాలిపోయి వున్నదనీ, అది తగులబడడానికి కారణం ఒక సిగరెట్టు పీక అయి వుండచ్చనీ అంటున్నారు. పోస్టుమార్టమ్ చేసినా, ఆయన చావుకు సరియైన కారణం తెలియక ఆయన కడుపులోని పదార్థాన్ని తీసి, అందులో ఏమైనా "విషయం" వున్నదేమోనని పరీక్షకు పంపారట.

## నూతిలో విషవాయువు

తిరువళ్ళూరుకు సమీపంలో వున్న ఒక గ్రామములో ఒకాయన నూతిలోని బోరింగు పంపు




బాగు చేదామన్న వుద్దేశ్యంతో నూతిలో దిగాడట. వున్నట్టుండి అక్కడ పుట్టిన విషవాయువు వల్ల లుంగ చుట్టుకు పడిపోతే, అది చూసి, అతనిని రక్షిద్దామని నూతిలోకి దిగిన ఇద్దరు ఆడవారూ యిద్దరు మగవారు కూడా పడిపోయారట. ఆ విషవాయువుకు అయిదుగురూ చనిపోయారట. రెడ్ హిల్స్ ప్రాంతంలో [మద్రాసు] ఒక నూతిలోకి దిగిన మరో యిద్దరూ నూతిలో పుట్టిన విషవాయువు వల్ల చనిపోయారట. ఆ నూతుల్లో విషవాయువు అసలు ఎక్కణ్ణుంచి, ఎలా వచ్చిందో, యింకా యీ రకంగా ఎన్ని నూతుల్లో విషవాయువు వుందో తేలాల్సి వుంది. కనుక ఏ నూతిలో ఏ వాయువుంటుందో—తెలియక దిగరాదు.

* * *

సేలం—ధర్మపురి పాసింజరు బండి తోప్పురు సివాడి స్టేషనుల మధ్య వెళుతుండగా [కొండ విరిగి] తొమ్మిది టన్నుల [9 వేల కిలోల] బరువున్న బండరాయి దొర్లి రైలు ఇంజనుకు తగిలిందట. దాంతో ఇంజను పక్క కెంపు పెట్టెలూ గతి తప్పినా, ప్ర[illegible]




## దొంగలకి హెచ్చరిక!

బ్రస్సెల్‌లో దొంగలు ఒక కారుని తస్కరించారట. పోలీసుల సోధనలో కారు దొరికినా అందులో వుండాల్సిన ఒక ప్యాకెట్టు మాత్రం లేదట. ఆ ప్యాకెట్టులో భయంకరమైన విషపు—ఆఫ్రికా జాతి సముపు తేళ్ళు వొదులను వున్నాయనీ, అదేదో నిధో, నగో అనుకుని వాటిని గభుక్కున విప్పి చేతులు పెడితే ప్రమాదమనీ, ఆ ప్యాకెట్టు దొంగిలించినవారు భయంకరమైన ఆపదలో వున్నట్టనీ—పోలీసు దొంగలందరికీ బహిరంగంగా హెచ్చరిక చేస్తున్నారట. ఇంతకీ అంత భయంకరమైన తేళ్ళను ఎవరు ఎందుకు ప్యాక్ చేసుకున్నట్టో—, దీని మర్మమేమి! ఏమో!!!




## భగవంతుడు అతీతుడు

ఒక నీగ్రో ఆయన ఆపరేషను ద్వారా స్త్రీత్వాన్ని పొందడటమే గాక, ఒక నీగ్రో మెకానిక్‌ని వివాహం చేసుకుని, అంతేగాక, కడుపుతో వుండి పిల్లను కూడా కనేసరికి అతనికి ఆపరేషను చేసి స్త్రీత్వాన్ని ప్రసాదించిన డాక్టర్లు ముక్కున వేలేసుకుని, "ఇంపాసిబుల్ అప్పుడే కడుపుతో వుండడం—పిల్లను కనడం — క్వైటింపాసిబుల్ ఎక్కడ ప్రసవం ఏ ఆసుపత్రిలో" అని అడిగారట. తను ప్రసవమయిన ఆసుపత్రి పేరు వగైరాలు బయట పెట్టక, స్త్రీగా మారి, మాతృమూర్తియిన ఆ నీగ్రో "ఈ వైద్యులకు, వైద్యశాస్త్రానికి కూడా భగవంతుడు అతీతుడు. నా బిడ్డ నీగ్రో జాతికి మణిపూస" అన్నారట [!]

## సోదె ఆధారంగా పోలీసు దర్యాప్తు

సంజీబ్ చౌదరి అనే 15 ఏళ్ల కుర్రాడిని మార్చి నెలలో ఎవరో ఎత్తుకుపోయారట. ఆ కుర్రాడి




తండ్రి [జౌంపూర్—ఆపూరు] యస్. యన్. చౌదరికి ఒక సోదె చెప్పి ఆమె చెప్పిన సోదె ప్రకారం 60—65 ఏళ్ళ వయస్సున్న ఒక సాధు తన శిష్యుడిగా చేసుకోడానికి సంజీబ్ చౌదరిని ఎత్తుకుపోయాడని, సిర్‌ఖండ్ ప్రాంతంలో వున్నాడనీ యీ కుర్రాడిని ఆ సన్యాసి తలగొరిగించి సన్యాసం యిచ్చాడని, గతం గుర్తులేని స్థితిలో ఆ కుర్రాడు, ఒక చెట్టు క్రింద కూర్చుని వున్నాడని తేలింది. దాంతో ఆయన [సిఫాలో సెంట్రల్ ట్రెజరీలో పని చేస్తున్నాడాయన] యీ విషయం ఇనస్పెక్టర్ జనరల్‌కి తెలియజేస్తే పోలీసు బలగం ఆ ప్రకారం చెట్టు చెట్టూ వెతక నారంభించిందట—ఐసే—ప్రతి పోలీసుస్టేషనులోనూ [లేక కనీసం ప్రాంతానికొక పెద్ద పోలీసుస్టేషనులోనైనా] సోదె చెప్పేవారు ఒకళ్ళు వుండితీరాలి. అప్పుడే దేశం పురోగమిస్తుంది. యీజిట్!!




రేయి నిదరపోయింది
రేడియో నిదరపోయింది
చెట్టు నిదరపోయింది
జుట్టు నిదరపోయింది
కాలం నిదరపోయింది
క్యాలెండర్ నిదరపోయింది
లిపి నిదరపోయింది
లిప్‌స్టిక్ నిదరపోయింది
నిదరపోనిది ఎవరు?
నేననే జీవి
నిట్టూర్చే భావి.

గంగ నిదరపోయింది
గతం నిదరపోయింది
రంగం నిదరపోయింది
రక్తి నిదరపోయింది
కల నిదరపోయింది
కలత నిదరపోయింది
వల నిదరపోయింది
వలపు నిదరపోయింది
నిదరపోనిది ఎవరు?
నేననే గువ్వ
నివురులోని నిప్పురవ్వ.

వేదన నిదరపోయింది
వేదం నిదరపోయింది
నరకం నిదరపోయింది
నైమిశం నిదరపోయింది
కత్తి నిదరపోయింది
కరుణ నిదరపోయింది
చీకటి నిదరపోయింది
వేకువ నిదరపోయింది
నిదరపోనిది ఎవరు?

నేననే నువ్వు
నీడ లేని వెలుతురు పువ్వు.

1969 దీపావళి కథలపోటీలో రెండవ బహుమతి రు. 1600 పొందిన కథ

# స్వర్గంలో విహారం

వేళ్లపల్లి వెంకటలక్ష్మీనారాయణ





'ఆ పేపరు కూడా యిచ్చెయ్యండమ్మగారూ!' అన్నాడు పేపర్లు సంచిలో వేసుకుంటూ పేపర్లు కొనేవాడు.

పేపర్లోకి దీక్షగా చూస్తున్న కామేశ్వరమ్మ కామాటలు వినపళ్లేదు.

పేపర్లవాడు మళ్ళీ 'ఇచ్చెయ్యండమ్మగారూ!' అన్నాడు.

ఈ పేపర్లు కొనేవాడిచేత అరగంటనుంచీ కామేశ్వరమ్మ పేపర్లని సరిగా తూచేట్టు చేద్దామని చాలా తిప్పలు పడింది. కానీ అతడిదగ్గర ఏమాయవుందోగానీ కనీసం ఆరు కిలోలు తూగుతయ్యనుకున్న పేపర్లు మూడు కిలోలు మాత్రం తూగాయి. అవి మూడునెలల పైనుంచీవున్న దిన పత్రికలు. ఆరు కిలోలకి పైనే వుంటయ్‌గానీ తక్కువ వుండవు. అప్పటికీ మొదట్లోనే చెప్పింది —

'నువ్వు ఒక్కొక్క పేపర్నొప్పున వేస్తూ తూచాలి. ఒక్కతడవ కట్ట కట్టి త్రాసులో వేసుకుని తర్వాత దఖీమని సంచిలో వేసుకు చక్కా పోవటానికి వీర్లేదు' అని.

'సరే' నంటూ తూచటం మొదలు పెట్టినవాడు తను ఒక్కొక్క పేపరు వేస్తుంటె మెల్లగా సణగటం మొదలెట్టి తర్వాత పెద్దగా అరవటంకూడా సాగించాడు.

'నువ్వలా అరవకు; సరిగ్గా తూచటం నీ కిష్టంలేకపోతే వెళ్ళిపో' అని పేపర్లు యివతలకు లాక్కుని తనూ కసిరింది అతగాణ్ణి.

అట్లా కసురుకున్నపుడు అరవటం మానేసి గొణుక్కుంటూ తూచాడేగానీ వెళ్ళనుమాత్రం వెళ్ళలేదు. ఇట్లా అరుస్తూ, గొణుక్కుంటూ ఆరుకిలోలు తూగుతయ్యనుకున్న పేపర్లని మూడుకిలోలకి దించాడు.

'అందుకే యీ పేపర్లని బజార్లో అమ్మమని చెపుతాను. ఆయనకి తీరిక కనుపిస్తేనా? ఉద్యోగానికి తోడు యిన్నేళ్ళకి చదువుకోక ఏదో చెయ్యనా అన్నట్టు చదువుకూడా మొదలెట్టారు' అంటూ విసుక్కుంది కామేశ్వరమ్మ.

ఆ పేపర్లలో పదిహేను రోజులనాడు యిమ్మెస్సీ పరీక్షా ఫలితాలువడ్డ పేపరుంది. ఆ పేపర్నితీసి యివతలగా పెట్టింది. పేపర్లన్నీ తూచటం అయినతర్వాత పేపర్లోకి చూడటం మొదలెట్టింది. పెన్నుతో క్రింద గీతగీచివున్న నంబరే గోపీది.

పరీక్షలు వ్రాసివచ్చిన రోజున 'ఫస్టు క్లాసు వస్తుందమ్మా! ఏరాంకు వస్తుందో చెప్పలేను' అన్నాడు చాలా వుత్సాహంగా.

గోపీ దగ్గర్నుంచి ఆమాట విన్న రోజున గానీ కామేశ్వరమ్మకు కంటినిండా నిద్ర పట్టలేదు. గోపీ పరీక్షలు యింకా నెల రోజు లున్నప్పటినుంచీ 'వీడు పేసవుతాడా?' అన్న దిగులు కామేశ్వరమ్మకు పట్టుకుంది. సరిగ్గా ఈ పరీక్షలకు దాదాపు నెలముందే కామేశ్వరమ్మ భర్త సూర్యనారాయణ డిపార్టుమెంటల్ కేండిడేటుగా ఆఫీసరు పరీక్షలకు వెళ్ళాడు. చివరి పేపరు వ్రాసొచ్చిన సూర్యనారాయణ —

'అన్ని పేపర్లు బాగా రాశాను కామేశ్వరీ! ఈ యేడాదినుంచీ నువ్వొక ఆఫీసరు భార్యనని చెప్పుకోవచ్చు' అన్నాడు నవ్వుతూ.

ఆవాలు బాగుచేస్తున్న కామేశ్వరమ్మ త్వరగా లేచి పూజామందిరంలోకి వెళ్ళింది.

'పిచ్చి కామేశ్వరీ!' అని అనుకుంటూ కుర్చీలో కూర్చున్నాడు సూర్యనారాయణ.

పూజా మందిరంలో విగ్రహంముందు నమస్కరిస్తూ నిలబడ్డ కామేశ్వరమ్మలో అంతులేని భయాందోళనలు.

'నాకోసం నిన్నేమీ అడగను భగవాన్! గోపీని విద్యావంతుడిగా చేసే భారం నీదే' నంటూ నమస్కరించింది. చాలాసేపటికి బయటకు వచ్చిన భార్య ముఖంలో తనాశించిన వుత్సాహం, సంతోషం కనిపించ లేదు సూర్యనారాయణకు.

'ఏంవిటలా వున్నావ్?' అన్నాడు సూర్యనారాయణ.

'అబ్బే!...ఎలా వున్నాను?! ... అం... యిప్పటికయినా ఆ చదవటం ఆపేసి మీ ఆరోగ్యంగురించి శ్రద్ధ తీసుకోండి' ఆవాల పళ్ళెం చేతిలోకి తీసుకుంటూ అంది కామేశ్వరమ్మ.

'పిచ్చి కామేశ్వరీ! ఈ మాత్రానికే ఆరోగ్యం పాడవుతుందా?! అయినా చదవటం ఆపేస్తే ఎట్లా? వచ్చేయేడు ప్రయివేటుగా ఎం. ఏ. పరీక్ష కెడ్దామనుకుంటున్నాను' అన్నాడు సూర్యనారాయణ.

లోపలికి వెళ్ళబోయే కామేశ్వరమ్మ ఆగింది.

'మీకేదో నిజంగానే పిచ్చిపట్టేనట్టుంది. ఇప్పుడీ చదువు లెందుకండీ? ఉద్యోగం చేస్తూనే ఆ యల్లెల్బీ చదివారు. ఇప్పుడీ పరీక్షలకి చదివారు. మళ్ళీ ఎం. ఏ. చదువుతారా! బాగుంది మీ వరస!! జీవితాంతం మీరు చదువుకుంటూనే గడుపుతారనుకుంటా చూడగా' అంది.

'అవును కామేశ్వరీ! ప్రతి మనిషి జీవితాంతం చదువుతూనే వుండాలి. చదువు అనే దొక అన్వేషణ. ఆ అన్వేషణకు అంతం అంటూ లేదు. సోక్రటీసు లాంటి వ్యక్తులు నిజమైన అన్వేషకులు. ఈనాటి మనుష్యులేముంది? డిగ్రీ తెచ్చుకోగానే చదవటం, నేర్చుకోవటం మానేసి చచ్చేవరకూ ఆ డిగ్రీగురించే చెప్పుకుంటూ బ్రతుకుతారు...అయినా నాతో పోలిస్తే వాళ్ళంతా అదృష్టవంతులే. వాళ్ళు డిగ్రీలన్నీ చిన్న వయసులో తెచ్చుకున్నారు. నేను ఈ వయస్సులోకూడా చదువుతున్నానన్న మాటేగానీ ఇంకా డిగ్రీకోసమే చదువుతున్నాను...'

'అందుకే డిగ్రీలకోసం మానేసి మామూలుగా చదువుకోండి. అప్పుడు యింత కష్టపడక్కర్లేదు...' అంది కామేశ్వరి.

సూర్యనారాయణ నవ్వాడు.



# స్వార్థంలో నిస్వార్థం

"అబ్బే. ముందీ ఏం. ఏ. డిగ్రీ రావాల్సిందే...నీకు తెలియదు కామేశ్వరీ ! నేను రేపు ఆఫీసర్నయినా ఎం.ఏ. డిగ్రీ రావాలి. ఎందుకో తెల్సా? ఈ రోజుల్లో క్లర్కు పోష్టుల్లోకూడా ఎం. ఏ. లుంటున్నారు. వాళ్లకంటె తక్కువ డిగ్రీ వున్న ఆఫీసర్ని గురించి వాళ్లేం చెప్పుకుంటారో తెల్సా?...'ఆ...వాడికేం చదువుందని ఆఫీసరయ్యాడోయ్ ? ఏదో లక్ తన్నింది; పైకెళ్లి పడ్డాడు' అని అంటారు. అందుకే నాకు ఎం. ఏ. చదవాలని వుంది. ...ఇంకో విషయం వుంది యిందులో. నీ కొడుక్కీ, నాకూ పోటీ. వాడీ యేడాది యెమ్మెస్సీ పూర్తి చేస్తే నేనింకో రెండేళ్లకన్నా ఎం. ఏ. పూర్తి చెయ్యొద్దూ ?' అంటూ నవ్వాడు సూర్యనారాయణ.

'ఏవిటి మీరంటుంది? మీకూ గోపీకి పోటీ ఏమిటండీ?...పోటీ...పోటీ అన్న మాట యింకెప్పుడూ అనకండి. పోటీ చేసేవాడు ప్రత్యర్థి పతనాన్ని కోరుతాడు. అంటే మీరుకూడా...'

'ఛీ ! అట్లా ఆలోచిస్తా వెందుకు? నేను నాకొడుకు పతనాన్ని కోరుతానా ? అయినా వాడు ప్రతి క్లాసులోనూ ఫస్టున వస్తున్నవాడు. ఎవరో యింకొకరు విధంగా కోరితే మాత్రం వాడు ఫస్టున రాక పోతాడా ?...నే చెప్తున్నాగా...వాడు అమెరికా వెళ్లి డాక్టరేటు తప్పకుండా తెచ్చుకుంటాడు.'

'ఏమో !?...ఇంకెవరిదాకానో ఎందుక్కు? వాడి చదువు విషయంలో అవాంతరం మీ వల్లే కలుగుతుంది. ఈ విషయం నేనెప్పుడో చెప్పాను. మీరు విన్నారు కాదు' అంది కామేశ్వరమ్మ ఆవేశంగా.

సూర్యనారాయణ ఆశ్చర్యపోయాడు. తను యెంతో వుత్సాహంగా తను కడుతున్న పరీక్ష గురించి చెప్తున్నప్పు డెప్పుడూ కామేశ్వరి యెందు కిలా ప్రవర్తిస్తుందో సూర్యనారాయణ కెంత ఆలోచించినా అర్థం కాలేదు.

తను యల్లెల్బీ ఈవెనింగ్ కాలేజీలో చదివేటప్పుడు కూడా కామేశ్వరి అట్లాగే ప్రవర్తించేది. సాయంత్రం అయిదుగంటల వరకూ ఆఫీసులో పని చేసి తొందర తొందరగా తను కాలేజీకి వెడుతూ వుండేవాడు. వారానికి కనీసం రెండు మూడు సార్లయినా అనేది కామేశ్వరి—

'ఏవండీ...యిలా అయితే మీ ఆరోగ్యం పాడవుతుంది. ఎందుకొచ్చిన చదువు యిది? ఇప్పుడున్న వుద్యోగం, జీతం మనకు చాలకనా ఈ లేనిపోని బాధలు' అంటూ.

'ఇందులో బాధేముంది కామేశ్వరీ ! కొంచెం యిబ్బందిగా వున్నమాట నిజమే ననుకో. అయినా కష్టపడందే ఫలితం వస్తుందా ? గోపీ యూనివర్సిటీ కెళ్లేసరికయినా నేను ఆఫీసర్ని కావొద్దూ ? ! ఈ 'లా' డిగ్రీకూడా వాస్తే యింకొంచెం ఎక్స్ట్రా క్వాలిఫికేషన్ వస్తుంది ... ఇక కష్టం సంగతి అంటావా? చిన్నతనంలో మా నాన్నగారు చదువు చెప్పించినప్పుడు శ్రద్ధగా చదువుకోనందుకు నాకీ శిక్ష కావాల్సిందే ... అన్నట్లు నా 'ఆరోగ్యం సంగతలా వుంచి నేనిలా ఆఫీసునుంచి కాలేజీకి తిరగటంతో యింటివిషయాలు సరిగా చూడక నీకేమన్నా యిబ్బంది కలిగిస్తున్నానా ?...'అనేవాడు.

'ఇబ్బంది సంగతలా వుంచండి. ముందు మీ ఆరోగ్యం ముఖ్యం...ఇబ్బంది వున్నమాట కూడా నిజమే ననుకోండి. సాయంకాలం మార్కెట్టుకి వెళ్లటంలాంటి పనులు గోపీ చెయ్యాల్సి వస్తోంది. వాడి చదువు పాడయిపోదూ ? వాడిపుడు కాలేజీలోకూడా చేరాడు. ఇవన్నీ ఆలోచిస్తే మీ రిప్పుడు యింత హైరానపడటం అనవసరం అని తోస్తోంది' అనేది.

గోపీ చదువు పాడయిపోతోందంటె సూర్యనారాయణకు బాధగానే వుండేది. కానీ కామేశ్వరమ్మ అలా అన్నప్పుడే గోపీ అనేవాడు—

'నీకేం పిచ్చాఅమ్మా ! సాయంత్రం ఒక్కగంట మార్కెట్టుకి వెళ్లి వచ్చినంత మాత్రాన పాడయిపోతుందా చదువు ? నాన్నగార్తో రోజూ యిలా మాట్లాడకు. మీ కెందుకు మీరు కాలేజీకి వెళ్లండి నాన్నగారూ ! ఈ విషయాలు నేను చూసుకోగలను' అని.

చిన్నవాడయినా గోపీకున్నపాటి వివేకం కామేశ్వరి కెందుకులేదో సూర్యనారాయణ కర్థంకాలేదు. ఆమె యిలా ప్రవర్తించటాని కేదో బలమైన కారణం వుండి వుండాలి. ఈ వయస్సులో తన భర్త చదువుకుంటున్నాడని చెప్పుకోటానికిసిగ్గా ? ఇందులో సిగ్గుపడాల్సిన విషయ మేమీలేదే? పైగా గర్వించాలిగాని...ఏమో ?... కామేశ్వరి మనస్సు తన కర్థం కాదు. గోపీ బజారుపనులు చేస్తానని ముందుకొచ్చినా గోపీని పంపేదికాదు. తనే వెళ్లి ఆ పనులు చూసుకొచ్చేది.



'అయితే గోపీచదువు పాడవుతుందనే కామేశ్వరిభయం కాబోలు' అనే నిర్ణయాని కొచ్చేవాడు సూర్యనారాయణ.

కానీ ఆ నిర్ణయంకూడా యెంతోకాలం నిలిచేదికాదు. ఎందుచేతనంటే తను మార్కెట్టుకు వెళ్ళినప్పుడు తరచు గోపీని అడుక్కోమని పంపటమో లేదో అప్పుడప్పుడూ తనవెంట తీసుకు వెళ్ళటమో చేసేది కామేశ్వరమ్మ ఉద్దేశ్య మేమిటో సూర్యనారాయణ కర్థంకాలేదు.

ఒకనాడు సూర్యనారాయణ తలనొప్పిగావుండి కాలేజీనుండి త్వరగా యింటికి తిరిగి వస్తున్నాడు. మార్కెట్టుదగ్గర అనేకమంది మధ్యవయస్సు భార్యాభర్తలు కబుర్లు చెప్పుకుంటూ నడుస్తూ యేవేవిటో కొనుక్కుంటున్నారు. సూర్యనారాయణ, కామేశ్వరమ్మ కలిసి యిలా బయటకు రావటం యీమధ్య జరగలేదు. ఆరునెలల క్రితంవరకూ అంటే సూర్యనారాయణ యీ 'లా' కోర్సులో చేరక ముందు వరకూ యిలాగే సాయంత్రం మార్కెట్టుకు వస్తూవుండేవారు. పగలంతా ఆఫీసుపనితో విసిగిపోయిన సూర్యనారాయణకూ, యింటిపనితో సతమత మయిన కామేశ్వరమ్మకూ యిట్లా సాయంకాలం బయటకురావటం ఆహ్లాదన్నిచ్చేది. ఇప్పుడీ జంటల్ని చూస్తుంటె తను కామేశ్వరికేం లేకుండా చేస్తున్నాడో అర్థమయింది సూర్యనారాయణకి. అందుకే కామేశ్వరికి తన చదువుపట్ల అయిష్టత యేర్పడింది కాబోలు ననుకున్నాడు. వయస్సు పెరుగుతున్న భార్యలాంటివి భర్త నుంచీ ఆశిస్తూనే వుంటుంది. అది సహజం, కామేశ్వరమ్మ వుద్దేశ్యం అర్థమయిందనిపించిన సూర్యనారాయణకు. త్వరగా యింటికి చేరుకున్నాడు.

'నీ బాధ నా కర్థమయింది కామేశ్వరీ!' అన్నాడు నిద్ర కుపక్రమించేముందు.

'ఏవిటి ?' అంది కామేశ్వరమ్మ తమలపాకులకు సున్నం రాస్తూ.

'నేనీ చదువు మొదలుపెట్టడంతో మనం పూర్వంమాదిరి కబుర్లు చెప్పుకుంటూ తిరిగే అవకాశం కలగటంలేదు కదూ ?... కానీ యీ రెండేళ్ళూ నువ్వు కొంచెం వోపికపట్టు...తర్వాత మనం రోజూ షికార్లకి వెళ్ళొచ్చు.'

# స్వార్థంలో నిస్వార్థం

'అయ్యోరాత !...ఎవరన్నావింటే నవ్వుతారు ! నా కిప్పుడు షికార్లు కావాల్సొచ్చిటండీ మిమ్మల్ని చదువు మానమంది ?'

'మరి ?...మార్కెట్టుకి గోపీని పంపకుండా నువ్వే వెడుతుంటివి. పోనీ వాడి చదువు పాడవుతుందని వాణ్ణి పంపించటం లేదా అంటె వాణ్ణేమో ఆటలకు పంపిస్తుంటివి...'

'అవునండీ...ఇప్పటినుంచే వాడినెత్తిన యీ బాధ్యతలన్నీ పెట్టమంటారా ? వాడికి సరదాగా సాయంత్రం ఆడుకోవాలనుండదూ ? ఆట్లా ఆడుకుంటేనే రాత్రికి చదివింది వాడితల కెక్కుతుంది. అందుకే వాణ్ణి పంపించటం లేదు.'

'మరి నన్ను చదువు మానమనటంలో నీ వుద్దేశ్యం...నాకు తెల్సులే...నీకు చెప్పటానికి సిగ్గుగా వుందికదూ ? నేనివ్వాళ మార్కెట్టులో మన వయస్సు భార్యాభర్తలు సరదాగా తిరగటం చూశాను. మనం మాత్రం అలా తిరక్క యెందుకొచ్చిన చదువిప్పుడు అని నీ కనిపించటం సహజం...కానీ యీ రెండేళ్ళూ కొంచెం వోపికపట్టు...తర్వాత మనం రోజూ షికార్లు చెయ్యొచ్చు. ఏమంటావ్ !' అంటూ దగ్గరకు తీసుకున్నాడు.

సూర్యనారాయణ ముఖంలోకి చూసినవ్వి. గుండెలమీద తల ఆనిస్తూ 'నాబాధ మీ కర్థంకాదు' అంది అస్పష్టంగా కామేశ్వరమ్మ.

సూర్యనారాయణకి యల్లెల్బీ మొదటి సంవత్సరం పరీక్షలు దగ్గర కొస్తున్నయ్, గోపీకి కూడా ప్రీయూనివర్సిటీ పరీక్షలు యింకొక్క రెండునెలల్లో వున్నయ్. ఇద్దరూ చాలా శ్రద్ధగా చదువుతున్నారు.

ఒకరోజున కాలేజినుంచి యింటి కొచ్చిన గోపీ 'తలకాయ నొప్పిగా వుందం'టూ పడుకున్నాడు మర్నాటికి జ్వరం వచ్చింది. రెండు మూడురోజులకు డాక్టర్ 'ఇది టైఫాయిడ్' అని తేల్చాడు. కామేశ్వరమ్మలో అంతవరకూ అనుమాన మాత్రంగా వున్న కొన్నివూహలు బలపడినయ్. 'ఇదంతా యిదిగో యీయన చదువు వల్లే' అని నిర్ధారణ చేసుకుంది.

వినపడూ భర్తతో కోపంగా మాట్లాడని కామేశ్వరి గోపీకి జ్వరం మొదలయినప్పటి నుంచీ కోపంగానూ, ఆవేశంగానూ సూర్యనారాయణ దగ్గర మాట్లాడుతోంది. సూర్యనారాయణ కూడా చాలా విచారంగా వున్నాడు. అయినా అటు ఆఫీసు, కాలేజిల పని యిటు గోపీకి మందుల విషయాలు చూస్తూ సతమత మవుతున్నాడు.

పదిహేనురోజుల తర్వాత జ్వరం తగ్గుముఖం పట్టింది. కాని యింకా పదిహేను రోజుల వరకూ గోపీకి పూర్తి విశ్రాంతి యివ్వాలని డాక్టరు చెప్పాడు.

ఒకరోజున కాలేజీకి వెళ్ళబోతున్న సూర్యనారాయణతో అంది కామేశ్వరమ్మ—

'ఏవండీ!...వాడికి పరీక్షలు దగ్గర కొస్తున్నయ్. మీరు మీ చదువు సంగతి చూసుకోకపోతే. వాడి దగ్గర కూర్చుని వాడి పుస్తకాలు చదివి వినిపిస్తూ వుండకూడదూ ? ఈ సంవత్సరం పరీక్షలు సరిగా వ్రాయకపోతే చదువులో ఒక సంవత్సరం వెనక పడతాడు... ఇప్పుడు వాడి చదువు ముఖ్యమా. మీ చదువా?' అని.

ఈ మాటలు విన్న సూర్యనారాయణ ఆశ్చర్యపోయాడు. గోపీకి యీ పదిహేను రోజులు పూర్తి విశ్రాంతి యివ్వమన్నాడు డాక్టరు. ఇప్పుడే యీ పుస్తకాలు బలవంతంగా వాడి తలలోకి యెక్కించటం యిష్టంలేదు సూర్యనారాయణకి. అలా చేస్తే గోపీ త్వరగా కోలుకోలేడని సూర్యనారాయణ భయం. అదీగాక తన పరీక్షలు కూడా దగ్గరి కొస్తున్నయ్. తనకి వయస్సు ముదరటంవల్ల ఒకటికి పదిసార్లు చదివితేగానీ యే విషయం గుర్తుకి వుండటంలేదు గోపీకి రెండుసార్లు చదివితే యే విషయమైనా యిట్టే గుర్తుకుంటుంది. తన చదువు విషయం వొదిలి వేసినా గోపీ ఆరోగ్య పరిస్థితి దృష్ట్యా కామేశ్వరమ్మ చెప్పినట్లు సూర్యనారాయణ చెయ్య దల్చుకోలేదు.

తల్లిమాటలు విన్నగోపీ—

'అవును నాన్నగారూ!—మీరు చదువుతుంటె నేనర్థం చేసుకుని గుర్తుంచుకోగలను...నేనే చదువుదామంటె కాస్సేపు చదవంగానే కళ్ళు నొప్పులు పుడుతున్నయ్ తలనొప్పి వస్తోంది' అన్నాడు.

గోపీకి చదువు పాడయిపోతోందని

భయం. పరీక్షలు దగ్గర కొస్తున్నయ్యని ఆందోళన. అంతేగానీ యీ పదిహేను రోజులూ విశ్రాంతి తీసుకుంటె త్వరగా కోలుకోవచ్చన్న ధ్యాసే లేదు.

'ఫరవాలేదులేరా!...నీ కీ పదిహేను రోజులూ విశ్రాంతి ముఖ్యం. నీ పరీక్షల గురించేం దిగులు పెట్టుకోకు. పరీక్షల వేళ్టికి కోలుకుని బాగా రాస్తావు. ఒకవేళ బాగా రాయకపోయినా ఫరవాలేదు. వీట్ని గురించి ఆలోచిస్తూ మనస్సు పాడు చేసుకోకు' అన్నాడు సూర్యనారాయణ.

ఈ చివరి మాటలు గోపీకి ధైర్యాన్నివ్వాలనే చెప్పాడు సూర్యనారాయణ. కానీ ఈ మాటల్లో కామేశ్వరమ్మకు విపరీతార్థం గోచరించింది. ఆమె ఆలోచనలు ఒకే మార్గంలో నడుస్తున్నయ్. ఆ మార్గం పూర్తిగా అర్థం లేని అనుమానాలతో నిండి వుందని ఆమెకు తెలియదు. ఆ అభిప్రాయాలే నిజం అని ఆమె నమ్మకం.

'అవును...వాడి చదువుకంటె ఇప్పుడు మీ చదువే ముఖ్యం... వాడికో సంవత్సరం పోతేమాత్రం ఏం పోయింది? మీ మాదిరి వయస్సు ముదిరిన తర్వాత చదువుకుంటాడు...నాకు తెల్సు...మీ కిప్పుడీ చదువు మీద ధ్యాస పూరికె కలగలేదు' అంటూ విసురుగా లోపలికి వెళ్ళింది కామేశ్వరమ్మ.

'ఎప్పుడూ "నా చదువో" అంటూ ఇంట్లో గోల. ఎవరయినా కొంచెం ప్రోత్సాహం యిస్తారు... ఈ యింట్లో అదీ లేదు. ఛీ...ఇప్పుడే పోయి మానేస్తున్నానని ప్రిన్సిపాల్తో చెప్పి వస్తాను'— అంటూ విసుక్కుంటూ బయటకువెళ్ళాడు సూర్యనారాయణ. బయటకు వెడుతున్న భర్త వంక లోపల్నుంచి చూస్తూ అనుకుంది కామేశ్వరమ్మ—

'క్షమించండి...మిమ్మల్ని విసిగించాను ...కానీ...కానీ నా బాధ మీ కర్థం కాదు' అని.

బయటకు వెళ్ళిన సూర్యనారాయణ కాలేజీకి వెళ్ళలేదు. ఆ నేట్టికి మాత్రం కాలేజీ మానేశాడు. పార్కులో కూర్చుని రాత్రి యెనిమిదింటికి యింటికి తిరిగొచ్చాడు.

'నాన్నగారూ? మీరు నిజంగా కాలేజీ పంతం మానేశారా?' అన్నాడు గోపీ.

'లేదురా' అంటూ గోపీ మంచం మీద కూర్చున్నాడు సూర్యనారాయణ. తండ్రి కాలేజీ మానలేదని తెలిసి గోపీ సంతోషించాడు. కామేశ్వరమ్మలో ఈ సమాధానం యెలాంటి భావాన్నీ కల్గించలేదు. ఆమె మనస్సంతా గోపీ భవిష్యత్తు మీదే లగ్నం అయింది. గోపీ చదువు పూర్తయే వరకూ ఆమె అనుమానాలు ఆమెకుంటూనే వుంటయ్. ఈ సమస్య కిప్పటిలో పరిష్కారం లేదు. సూర్యనారాయణ చదువు మానేస్తే ఆమెకి మనశ్శాంతి లభిస్తుంది. కానీ అలా తను సూటిగా భర్తతో చెప్పలేదు.

* * *

కామేశ్వరమ్మ గోపీ నంబరు వంకే చూస్తూ కూర్చుంది.

'ఆ పేపరు కూడా యిచ్చెయ్యండమ్మగారూ!' అన్నాడు పేపర్లు కొనే అతను మళ్ళీ.

ఇక్కడ చేసిన బేరంలో యేదో నష్టం వచ్చినట్టు, కనీసం యీ పేపరన్నా యిస్తేగానీ లాభం లేదన్నట్టు మాట్లాడుతున్నాడతను.

కామేశ్వరమ్మ మాట్లాడక పోవటం చూసి—

'ఇంకేమన్నా పేపర్లున్నయ్యాండీ!... వారపత్రికలుగానీ, యింకేవన్నా పుస్తకాలుగానీ' అన్నాడు.

గోపీ నంబరు చూస్తున్న కామేశ్వరమ్మ యిలా అనుకుంది.

'నేను చెప్పినట్టు ఆయన ఆ చదువు మానేస్తే గోపీ నంబర్ని యీ స్థితిలో చూడవలసి వచ్చేదికాదు. ఇంతకీ వాడి భవిష్యత్తు యెట్లావుందో.'

* * *

గోపీ యెమ్మెస్సీ చివరి సంవత్సరంలోకి వచ్చాడు. ఆ సంవత్సరమే సూర్యనారాయణ ఆఫీసరు పరీక్షలకు వెళ్ళాడు. అప్పటినుంచే కామేశ్వరమ్మకు గోపీ చదువుగురించి దిగులు పట్టుకుంది. పరీక్షలు బాగా వ్రాశొచ్చానని సూర్యనారాయణ చెప్పిన దగ్గర్నుంచి ఆ దిగులు మరింత హెచ్చింది. గోపీ పరీక్షలు వ్రాసొచ్చి 'బాగారాశాను...' అని చెప్పినపుడుగానీ ఆమె ఆదుర్దా తగ్గలేదు.

గోపీ పరీక్షాఫలితాలొచ్చినయ్. గోపీ నంబరు ఫలితం తర్వాత ప్రకటించనున్నట్లు ప్రకటించారు. ఆఫీసరు పోస్టుకు సూర్యనారాయణను, సెలెక్టు చేసినట్లు అంతకు నాలుగ్రోజుల క్రిందట తెలిసింది. దానికీ, గోపీ పరీక్షా ఫలితాలకీ పూర్తిగా సంబంధం, వుందని కామేశ్వరమ్మ విశ్వాసం.

పరీక్షాఫలితాలు ప్రకటించిన వారం రోజులకు గోపీ యూనివర్సిటీకి వెళ్ళాడు. వెళ్ళేముందు కామేశ్వరమ్మతో అన్నాడు.

'నువ్వేం ఆందోళన పడకమ్మా!... ఏదో సర్టిఫికెట్టు సబ్మిట్ చెయ్య



లేదేమో...అది చేశాక ఫలితం ప్రకటిస్తారు. అంతే నే వెళ్ళి కనుక్కొస్తాను.'

అంతే అయ్యుంటుందా అని కామేశ్వరమ్మ అనుమానం...ఒకవేళ అంతే అయినా ఏక్లాసు వస్తుందో? కామేశ్వరమ్మకు ధైర్యం చాలటంలేదు.

* * *

'ఆ పేపరుకూడా యిచ్చెయ్యండమ్మగారూ !' అన్నాడు పేపరు కొనే అతను మళ్ళీ.

అతను తాను సంచిలో వేసుకుంటూ ండగా అయిన శబ్దంతో కామేశ్వరమ్మ యీ లోకంలో కొచ్చింది.

'ఈ పేపరు యివ్వనులే...యిది కావాలి' అంది.

పేపర్లతను డబ్బుయిచ్చి వెళ్ళిపోయాడు.

* * *

రెండు నెలల తర్వాత —

సూర్యనారాయణ తన ముఖ్య స్నేహితులను పదిమందిని పార్టీకి పిల్చాడు. తను ఆఫీసరయిన సందర్భాన్ని, గోపీకి అమెరికన్ యూనివర్సిటీలో పి. హెచ్. డి. చేసేందుకు స్కాలర్‌షిప్పు వచ్చిన సందర్భాన్ని పురస్కరించుకుని యేర్పాటు చేసిన పార్టీ అది. కాస్సేపు ఆ స్నేహితులు తండ్రిని, కొడుకునీ అభినందిస్తూ మాట్లాడారు. వాళ్ళకు ఫలహారాలు అందిస్తున్న కామేశ్వరమ్మకు వాళ్ళు చెప్పినవన్నీ సావధానంగా వినే అవకాశం లేకపోయింది.

కాఫీ కలిపియిచ్చిన తర్వాత తీరికగా

# స్వార్థంలో నిస్వార్థం

ప్రక్కగదిలో కూర్చుని వాళ్ళ సంభాషణ వినసాగింది ... స్నేహితులందరూ మాట్లాడిన తర్వాత సూర్యనారాయణ అన్నాడు —

'ఈ ఆఫీసరు పోస్టు నాకు రావటానికి కారణం మా కామేశ్వరి. అందుకని ఈ అభినందనలన్నీ నిజంగా ఆమెకే చెందాలి. కామేశ్వరి చేసిన పూజలవల్లే నేను ఈ వయస్సులో చదివి పరీక్షలు పేసవ్వగలిగాను ...'

ప్రక్కగదిలో కూర్చున్న కామేశ్వరమ్మకు ఆపై మాటలు వినబడలేదు. ఆమెలో అశాంతి చెలరేగింది.

'నేను నిజంగా వారి అభివృద్ధికోసం పూజలు చేశానా ? కనీసం మనసారా దేవుణ్ని ప్రార్థించానా?' అన్న ప్రశ్నలు వేసుకుని ఆమె నిలువెల్లా వణికిపోయింది.

ఏ భార్యఅయినా భర్త అభివృద్ధికోసం అలా చేస్తుంది. కానీ తను అలా ప్రవర్తించలేదు. పైగా భర్త తననిగురించి చాలా వున్నతంగా ఆలోచిస్తున్నాడు. తన భర్త అభివృద్ధిపట్ల తనకు ఆకాంక్ష లేదా ? కానీ ఆకాంక్షకన్నా బలమైనదేదో తనని యింకోవిధంగా ప్రవర్తించేట్లు చేసింది. అదే గోపీ ,చదువుగురించి ఆదుర్దా. తన అనుమానాల్లో అర్థం వుందో లేదో కామేశ్వరమ్మకు తెలియదు. అందుకే ఈ వాడు అనుకుంటోంది —

'ఆనాడు రంగమ్మ పిన్నిగారు ఆ మాటలు చెప్పివుండాల్సింది కాదు. అలా జరిగివుంటే ఈ నాడు వారు చెప్తున్నట్లు వారి అభివృద్ధికోసం మనసారా దైవాన్ని ప్రార్థించి వుండేదాన్ని. త్రాడే పాము అన్న అనుమానంతో ప్రవర్తించానేమో. అందుకే అంత జాగ్రత్త వహించాను. ఆ జాగ్రత్తలో వారు సాధించిన విజయాల్లో సంతోషంగా పాల్గొనలేక పోయాను.'

* * *

గోపీ యస్సెల్సీ పరీక్షల్లో మార్కులు ఫస్టొచ్చినట్టు తెలిసిన రోజది. ఆ సాయంత్రం రంగమ్మ పిన్నిగారొచ్చింది. ఆవిడ మనవడు మూడేళ్ళనుంచీ యస్సెల్సీ తప్పుతున్నాడు. అవీ యివీ మాట్లాడుతూ రంగమ్మగారంది.

'మీవాడు ఫస్టున పేసవకేమవుతాడమ్మా కామేశ్వరమ్మా! మీ మామగారి పోలికలే వచ్చినయ్. మీ అత్తవారివేపు వాళ్ళలో తాతగారి బుద్ధులు, ప్రజ్ఞ మనవడికి రావటం ఆనవాయితీ...మీ మామగారు జడ్జీ చేసిరి. మీ గోపీ కూడా జడ్జి అయి తీరుతాడు. మీ ఆయన మాత్రం ఆ బి. ఏ తప్పటం చేతకాక, తెలివి తక్కువయి తప్పాడేం? అదీ ఆనవాయితీ ప్రకారం వచ్చిందే...మీ మామగారు జడ్జీ అయినా ఆయన తండ్రికి చదువేం వంటపట్టలేదు. ఆయన పోలికే మీ ఆయనకొచ్చింది. లేకపోతే మీ ఆయనకి తెలివితేటలు లేకనా? ఆనవాయితీ అంతేనమ్మా! దాన్నిగురించి నాకు బాగా తెల్సు, ఇలా జరగటం మా వంశంలోనూ వుంది. ఇంకోటి కూడా వుంది దీంట్లో. ఈ ఆనవాయితీ ఒక తరం వాళ్ళకి తప్పిందా అంటే తర్వాత తరంవాళ్ళకి పట్టుకోక తప్పదు. మా మనవడు అందుకేగా తప్పుతోంది. మా వంశంలోనూ తాతగారి పోలికలు మనవడికి రావటం ఆనవాయితీ. తాతగారి పోలికవస్తే మా మనవడు ఇంజనీరు కావాలి. కానీ వాడింకా స్కూలు ఫైనలే గట్టెక్కటం లేదు. వాడుమాత్రం యేం చేస్తాడు? ఆనవాయితీ ప్రకారం వాళ్ళనాన్నకి చదువు రావాల్సింది కాదు. కానీ వాడు ఆఫీసరవ్వటంతో వాడికి రావాల్సిన వారసత్వం వీడికొచ్చింది. అంతే దీనికి మనమేం చెయ్యలేం. ఇప్పటివాళ్ళ






వీటిని తీసిపారేస్తారుగానీ యివి చాలా జాగ్రత్తగా సంక్రమిస్తూనే వుంటయ్'

ఈ ఆనవాయితీ 'థీసిస్' చెప్పటంలో రంగమ్మగారి ముఖ్యోద్దేశ్యం తన మనవడు యస్సెల్సీ తప్పటం తెలివి తేటలు లేక కాదని నమ్మించడానికే అయినా కామేశ్వరమ్మకీ మాటలమీద నమ్మకం యేర్పడింది. కాకతాళీయంగా జరిగిన కొన్ని సంఘటనలు ఆమె అనుమానాన్నే బలపర్చినయ్. అందుకే సూర్యనారాయణ చదువు విషయంలో మనస్ఫూర్తిగా యేకీభవించ లేకపోయింది. సూర్యనారాయణ చదువూ—గోపీ చదువూ—యీ రెండింటికీ పొసగదనే భావం బలంగా వ్రేళ్లు పాతుకు పోయింది.

* * *

పార్టీకి వచ్చిన స్నేహితులు వెళ్లిపోయారు. గోపీ కూడా ఎవరో స్నేహితుణ్ణి కల్సుకోవాలని బయటకు వెళ్లాడు. సూర్యనారాయణ లోపలికి వచ్చాడు. కామేశ్వరమ్మ కూర్చుని వున్న గదిలో చీకటిగా వుంది.

'లైటు వెయ్యలేదేం కామేశ్వరీ' అంటూ స్విచ్ వేశాడు సూర్యనారాయణ. నీళ్లు నిండిన కళ్లతో భర్తవంక చూసింది కామేశ్వరమ్మ.

'ఏమయింది కామేశ్వరీ!' అంటూ ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

'మీరిందాక మీ స్నేహితులతో నన్ను గురించి చాలా గొప్పగా చెప్పారు ఆ ప్రశంశకు నేను తగను. అనుమానాల్తో మీ అభివృద్ధి కోసం నేనేమీ చెయ్యలేదు. దౌర్భాగ్యురాల్ని' అంటూ తన అనుమానం గురించి అంతా చెప్పింది కామేశ్వరమ్మ.

అంతా విన్న సూర్యనారాయణ ఆశ్చర్యపోయాడు భార్య వంకే చూస్తూ నిలబడ్డాడు. అతని మనోఫలకంలో చిత్రించుకున్న కామేశ్వరమ్మ రూపం అవధులు లేకుండా పెరిగిపోతోంది.

'ఏమిటలా చూస్తున్నారు? నా అజ్ఞానానికి నేనంటే మీకు అసహ్యం కలగటం లేదూ?' అంది బాధగా కామేశ్వరమ్మ

కామేశ్వరమ్మను వారిస్తూ—

'లేదు కామేశ్వరీ! నిన్ను నేనిప్పుడు అమితంగా ప్రేమిస్తున్నాను. నువ్వంటే నాకిప్పుడు యెనలేని గౌరవం. స్త్రీ త్యాగానికి మారుపేరు. తనకు స్వతహాగా వివిధ రంగాల్లో రాణించగల శక్తి వున్నా వాటి నన్నిటినీ మరుగుపర్చుకుని యింటికే తన మనస్సుని కేంద్రీకరింపచేసి తనపై ఆధారపడినవాళ్ల—ముఖ్యంగా భర్తయొక్క అభివృద్ధికోసం పాటుపడుతుంది. అందుకే—ఈ ప్రపంచంలో వృద్ధిలోకి వచ్చిన ప్రతి పురుషుని వెనక స్త్రీ తప్పక వుంటుంది. కానీ భర్తకోసం చేసే త్యాగంలో కొంచెం స్వార్థం వుండొచ్చు...' అంటున్న సూర్యనారాయణతో అంది కామేశ్వరి.

'నేనిప్పుడు చేసిన దాంట్లో మాత్రం స్వార్థం లేదూ? నా కొడుకు భవిష్యత్తు గురించే తప్ప మిగతా విషయాల గురించి ఆలోచించనే లేదు'

'అది స్వార్థం కాదు కామేశ్వరీ! ఈ ప్రపంచంలో స్త్రీ తన స్వంతం అనుకోగల్గింది భర్తేగానీ మరెవ్వరూ కాదు. నడుస్తున్న చరిత్ర మనకీ సంగతే చెపుతుంది. అయినా నువ్వు నీ స్వార్థం చూసుకోకుండా వ్యవహరించావు. పైగా అదే స్వార్థం అనుకుంటున్నావు. అదే నీ నిస్వార్థబుద్ధికి తార్కాణం. ఈ విధమైన నిస్వార్థం ఒక్క తల్లిలోనే వుంటుంది. అందుకే మాతృమూర్తిగా స్త్రీకొక ప్రత్యేక స్థానం వుంది.'

'ఇక పోతే నువ్వు నా అభివృద్ధిని కాంక్షించకపోవటం నన్ను ప్రత్యేకదృష్టితో చూడటం వల్ల కాదు. నువ్వు చేసే త్యాగంలో నాకూ పాలుపంచాలని నా ఆశ. 'నువ్వూ—నేనూ' ఒక్కటే నన్న భావం నీలో వుండబట్టే అలా చెయ్యగలిగావ్... ఇంతకన్నా భార్యా భర్తల మధ్య కావాల్సిందేముంది?' అంటున్న భర్త పాదాలపై వ్రాలింది కామేశ్వరమ్మ.

'ఇంతటి త్యాగమయికా యింత కాలం మనశ్శాంతి లేకుండా చేశాను' అన్నభావం సూర్యనారాయణలో కదిలింది.

పాదాల చెంతనున్న భార్యను లేవదీసి హృదయానికి హత్తుకుంటూ అన్నాడు సూర్యనారాయణ:

'గోపీ డాక్టరేటు తీసుకుని వచ్చాకే నేను ఎం. ఏ. కు కడతాను కామేశ్వరీ! వాడే నాకు పాఠాలు చెపుతాడు కదూ ?'

కామేశ్వరమ్మ కళ్లల్లో వింత వెలుగు కనిపించింది. ఆమెలో అజ్ఞానముండొచ్చు. కాని ఆమె త్యాగానికి మారుపేరు నిస్వార్థానికి నిలయం. ఆమెలోని మాతృమూర్తికి జోహారు అర్పించాడు సూర్యనారాయణ ఎదురుగావున్న దేవుని పటం వైపు అరమోడ్చిన కనులతో చూస్తూ అనుకున్నాడు సూర్యనారాయణ:

'భగవాన్!...నీ సృష్టిలోకెల్లా అత్యున్నత మయింది మాతృహృదయం. అందుకేనేమో నీకింత గొప్పతనం. నీగొప్పతనాన్ని శాశ్వతంచేసే ఆ మాతృహృదయమే యీ ప్రపంచానికి శ్రీరామరక్ష.' ●




...వాళ్ళబ్బాయికి చేతులు కాలాయట - మావారికన్నా కాలాయండి మరి డాక్టర్ని పిల్చుకోండి అని చెప్పాను!


ఈ కుంభకర్ణుణ్ణి నిద్రలేపాలంటే ఇంతే!




హీరోగారు టపాకాయ చప్పుడు విని గుండెదడ పట్టుకుందట ఇవాళ యుద్ధం సీనులో నటించలేనన్నారు!


నువ్వు పోటీకి పంపించిన కథ లాగే ఇది కూడా తుస్సుమందిరా!












ఎలాగైనా సొంతగా చేసుకున్న టపాకాయలు బాగా కాల్తాయండి!





# పరివేష్టం

సీరియల్

శిఖా వెంకటరమణ




### జరిగిన కథ

జయ పిసమామ కొడుకు కాళిదాసు. చదువుల కోసం మద్రాసుకి వస్తారు. అక్కడ జయకి సాంబు కనిపిస్తాడు. సాంబు జయని గుర్తు పడతాడుగాని, జయ సాంబుని ఎరగనంటుంది. సాంబు కాళిదాసుతో తన కథ చెబుతాడు. జయ సాంబుని గుర్తుపట్టనట్టు చెబుతుంది. మార్గరెట్ సాంబుని ప్రేమించిన వ్యక్తి. కాళిదాసు భారతి భార్యాభర్తలవుతారు. జయ గర్భవతి అవుతుంది. కాళి సాంబుకోసం వెతుకుతాడు. అతను దొరకడు. జయ కాళిదాసు కొడుకునే తన స్వంతకొడుగ్గా పెంచుకుంటుంది. రఘురాం నిజంగా జయ కన్న కొడుకే అని తెలుసుకుని భారతి కుమిలిపోతుంది. రఘురాం ఇల్లు విడిచిపెట్టి కన్నతండ్రిని వెదకడానికి బయల్దేరుతాడు. మోహన్ ఉమని తన దానిగా చేసుకోవా లనుకుంటాడు. రఘురాం తనకు వచ్చినమ్మాయితోనే పెళ్లి జరిపించేసుకుంటాడు.

## 14

ఏడాది తరువాత తన ప్రేమనీ, అనురాగాన్నీ నరనరాల్లోనూ నింపి ముద్దులు మూటగట్టే పండంటి పిల్లవాడిని కని భర్త చేతికి అందించి కళ్ళు మూసింది. మార్గరెట్ సాంబశివం కొటిగట్టని ఆశలాంటి దీపం ఆరిపోయింది. అతని బ్రతుకులో ఆనాటినుంచీ కటిక చీకటి ఆవరించింది. పసిపిల్లడికి తల్లీ తండ్రీ తనే అయి గారాబంగా పెంచి పెద్దచేశాడు. మార్గరేట్ మమతల ఛాయలు అతన్ని విడువలేదు. వుద్యోగానికి రాజీనామా యిచ్చి వున్నది తింటూ చిన్న డిస్పెన్సరీ తెరిచి కొడుకుతో మార్గరేట్‌లోని చూసుకుంటూ చావలేక బ్రతుకుతూ, యేడవలేక నవ్వుతూ కాలం గడుపుతున్నాడు. జయమీది మమత అఖండజ్యోతి కాగా పిల్లడు జయరావ్ అయేడు.

అతని కళ్లముందు గతం కదులుతున్నప్పుడు పిచ్చివాడే అయిపోతాడు. శిథిలావస్థలోవున్న జీర్ణించిన కాగితంముక్క మీద ఆ చేవ్రాలు మరచిపోలేని స్థితిలో మార్గరెట్‌కి మాటయిచ్చిన కారణంగా త్రాగుడు ముట్టుకోడు. కానీ... క్లబ్బుకి వెళ్లి బాధ తీరేవరకూ పేకాటలో మునిగి పోతాడు.

'ఏ జయ శీలం ప్రపంచానికి వెళ్ళడైపోయింది. అంతా గుడ్డిగా [illegible] [illegible] వేయాలని చూస్తున్నారు కాబోలు. కాని ఆ జయ బీచ్‌రోడ్‌మీద పన్నెండు గంటల అర్ధరాత్రి వెళ్లేకారణం యెవరికీ కనిపించనే లేదంటావా సాంబశివం. నీ ప్రేమ ఆ పిల్లమీద పెంచుకున్నావు. కానీ... సీతమాలి రాఘవ్‌రావుగారి హాస్పటల్‌లో మగబిడ్డని ప్రసవించింది. ఆబిడ్డ పోయేడు కూడా. నా మాటే అబద్ధం అవుతే నువ్వు మరెవరినైనా వాకబుచేసి కనుక్కో;'

రాఘవరావుగారు వాళ్ళకెలా ఆశ్రయం యిచ్చేరో కాళిదాసు యేవిధంగా లోబరుచుకున్నాడో యిప్పటికీ అంతు చిక్కదు సాంబశివానికి.

'యేం డాడీ అలావున్నారు' అతన్ని కుదిపి లేపుతూ అడిగేడు జయరావ్.

'యేమీలేదు మనం గుంటూరు వెళ్ళాలి అక్కడ అక్కడే మనం వుండిపోవాలి'

*   *   *

సాంబశివం అన్నమాటలు ఆచరణలోకి వచ్చేందుకు నెల పట్టలేదు. తనలో కష్టం, సుఖం పంచుకుని జాతి, మత బేధాలేవీ లేవనీ మమత అందరిలోనూ వుంటుందని చాటి చెప్పిన అర్ధాంగిని





ఆ గడ్డమీదే వదిలేసి ఆ చిహ్నాన్ని తన వెంట తీసుకుని అతను యిండియాకి, ఆంధ్రదేశంలోవున్న గుంటూరుకి వచ్చేడు. తెల్లగా కావలసినంత ఠీవీ దర్పం వొలకపోస్తూ అడుగడుగునా తల్లినీ, తండ్రినీ గుర్తుకు చేస్తూంటాడు జయరామ్. అతనికి ప్రపంచంలో తండ్రి తప్ప 'నా' అనేవారే లేరు. అందరూ అపురూపంగా చిత్రించుకుని పూజించే కన్నతల్లి లేదు. ఆ ప్రేమానురాగాలూ, మమతానుబంధాలూ యెలాంటివో జయరామ్ యెరుగడు. 'మా మమ్మీ', అనుకునేందుకు యే ఆస్కారం లేదతనికి. అతను మగ నౌఖర్ల సంరక్షణలో పెరిగిన కారణంగా 'స్త్రీ' అంటేనే ఊహాతీతంగా వుంటుందా లేలేత హృదయంలో. యిరవై సంవత్సరాలు నిండిన అతడిని పసితనం విడవకుండా వెంటాడుతూనే వుంది.

ఊరు కొత్త, మనుషులు కొత్త, వాతావరణమే కొత్తగా వున్న ఆ ప్రదేశంలో కొత్తరకం జీవితంలోకి అడుగు పెట్టేడు జయరామ్.

సాంబశివం తల్లిపోయింది అప్పటికే. మేనమామలు వేర్లుపడి పొట్ట చేత్తో పట్టుకుని దేశాలుపట్టి పోయేరు. విదేశాల్లో యెవరినో పెళ్ళాడాడనీ, పిల్లడు కూడా పుట్టేడనీ ఆనోటా ఆనోటా విన్న జానకి బెంగతో, బ్రతుకు బరువుతో కళ్ళు మూసింది.

అప్పుడప్పుడు ఒంటరిగా గదిలో వున్నప్పుడు జయరామ్ ఆలోచనలు పరిపరి విధాలుగా పోయేవి. చిన్ననాటినుంచీ తండ్రి కళ్ళల్లో వొత్తులు వేసుకుని మరీ పెంచేడు అతన్ని. క్రమశిక్షణలో, పకడ్బందీగా పెరిగిన జయరామ్ యెన్నడూ క్లబ్బుమొహం చూడలేదు. తనొక క్రిస్టియన్‌కి పుట్టిన సంగతే అతను యించుమించు మరిచిపోయేడు. పురిట్లోనే సంధిగొట్టుకుని పోయిన తల్లి యెలా వుంటుందో అతనికి తెలియదు. కొంత వయసు వచ్చేక తమ యింటికి రమ్మనీ, తమతోనే వుండి



[illegible]
అమ్మమ్మలు తప్ప తమవాళ్లనే మనుష్యులు యెలావుంటారో అతను యెరుగడు. ఇంట్లో స్వచ్ఛమైన తెలుగు మాట్లాడటం, తండ్రియెదుట బుర్ర వొంచుకుని ఆయన చెప్పేది శ్రద్ధగా వినడం వరకే తెలుసును జయరావ్‌కి. అప్పుడప్పుడు అతని మనసు దిక్కుతెలియని బాటసారి మాదిరిగా శూన్యాకాశంలోకి గమ్యంకోసం వెతుక్కోవడంకూడా జరుగుతూ వుంటుంది. చాలాకాలంగా తండ్రిని అడగాలనుకున్న ప్రశ్నలు అతని గొంతుదాటి బయటికి రావు. ఆ రోజు తండ్రి గదిలోకి వచ్చి నెమ్మదిగా అడిగేడు. 'డాడీ నాకు వుద్యోగం యేదైనా చూడండి. యింట్లో వుంటూంటే బోర్ కొడుతోంది.'

సాంబశివం తలెత్తి కొడుకు మొహంలోకి చూశాడు. కాస్సేపాగి అన్నాడు: 'మనం మద్రాసు వెడదాం జయరావ్. అక్కడ యేదైనా చూసుకోవచ్చును.'

'మద్రాసా! యిప్పుడెందుకు డాడీ?'

'అక్కడ....అక్కడ...—యిప్పుడవన్నీ వొద్దు త్వరలోనే మద్రాసు వెడదాం,' సాంబశివం కళ్లు చెమ్మగిల్లేయి. జ్ఞాపకాలు అతన్ని నిలువునా చీల్చి తూర్పారబెడుతున్నాయి. 'మార్గరేట్ చెప్పినట్లు ఒకవేళ నేనే పొరబడలేదుకదా' అనుకుంటున్నాడు వుండి వుండి. జయరావ్

# పరిలిప్తం

వచ్చినపని వెంటనే అయిపోయింది. అలా అయిపోయేక అతను మరి క్షణం నిలబడి వుండలేదు. సాంబశివం గదిలో ఒంటరిగా మిగిలిపోయేడు. అతను వున్నగదికీ జయరావ్ గదికీ—మధ్య చిన్న కిటికీ యెప్పుడూ మూసివేయబడి వుంటుంది. ఆ గదిలో ఫాన్‌క్రింద పుస్తకాలతో కాలక్షేపం చేస్తూంటాడు జయరావ్.

'హలో! చాలాకాలం అయిందికదూ నిన్ను చూసి...ప్రత్యేకం నిన్ను చూడాలని వచ్చేను సాంబశివం. అంతా బావున్నారు కద. నువ్వు వచ్చిన సంగతి విన్ననే తెలిసింది. రాత్రిఅయిపోయింది కాంప్‌నించి వచ్చేసరికి, నిన్ను చూసేవరకూ వుండ బట్టలేక పోయేనంటే నమ్మ,' వొచ్చినతను గలగలా మాట్లాడేస్తూ యించుమించు అతన్ని కౌగలించుకుని మాటలు తడబడుతూంటే ఆగిపోయేడు.

'జ్ఞాపకం వున్నానా!' సాంబశివం తొట్రుపడకుండా జాగ్రత్తగా అడిగేడు. వాళ్లో అందరూ విదేశాలకి వెళ్లి మైలపడ్డానని చెప్పి రావడం మానేశారు. నీకైనా దయకలిగింది. స్నేహాలు దూరంగా వుంటేనే బలపడతాయిరా! మా యింటికి వచ్చి నువ్వుకూడా నలుగురిలో నగుబాట్లు కావడం ఛ! నాకేం బాగులేదురా రంగా,'

అతను పెద్దగా శబ్దం చేస్తూ నవ్వేడు. 'భలేవాడివి నువ్వు. మన స్నేహం యిప్పటిదిట్రా. మనుషులు యేర్పరచిన ఈ ఆచారాల్నీ, మూఢనమ్మకాల్నీ నేను నమ్మే వాడినే అనుకుంటున్నావా.'

'యెందుకు నమ్మకూడదూ? ఒకప్పుడు నేనూ నీలాగే వుండాలంటే భయపడి పోయేవాడిని. అప్పట్లో చాలా పట్టుదలగా వుండేవాడిని ఈ ఆచారాల విషయంలో. కాలం నన్ను బానిసని చేసుకుని ఆడించినట్లల్లా ఆడక తప్పిందికాదు. అంతే విదేశాల్లో పెళ్లిచేసుకోక తప్పింది కాదు. ఈ వూరు వచ్చేను. నన్ను అంటరాని వాడిగా, ముట్టుకుంటేనే పాపం చుట్టుకుంటుందేమోననే తీరుగా చూడడం ప్రారంభించేరు. నా జీవితం సగభాగం అయిపోయింది. కానీ వాడు...నా కొడుకు జయరావ్ యెంత అమాయకుడో భగవంతుడికి తెలుసును. వాడిముందు నేను వెళ్లిపోక తప్పదు. ఈ సమాజపు కబంధ హస్తాల్లో వాడు నలిగిపోయి...దేవుడెందుకో యింత నిర్దయగా వున్నాడు నాపట్ల.'

రంగారావు చుట్టూచూసి నెమ్మదిగా అడిగేడు. 'వూళ్లో అంతా ఘుప్పుమని చెప్పుకుంటున్నారురా సాంబశివం. నీ కొడుకు అచ్చంగా సీమదొరలా వుంటాడని. యింతవరకూ యే వొక్కరూ సరిగా చూడలేదుట. అదాటున చూసి వాళ్లు చేసుకున్న అంచనాయే అంత బాగున్నప్పుడు నీ కొడుకు బాగుండక పోతాడేమిట్రా, యేడీ వాడు.'

సాంబశివం పేలవంగా నవ్వేడు: 'అందం, ఐశ్వర్యంతో సమాజంలో గెలుపు పొందలేం. నేను తెలిసో, తెలియకో తప్పు చేశాను. వాళ్లమ్మ నన్ను గాఢంగా ప్రేమించింది. అందుకు పెళ్లి చేసుకున్నాను. దాని ముచ్చట మూడు రోజుల్లో అంతమైపోయింది. మేము పెద్దవాళ్లం యవ్వనంలో చేసిన తొందరపాటుకి బ్రతుకంతా వాడు బాధ్యుడై బాధని అనుభవించి తీరాల్సి వస్తోంది. ఈ సొసైటీ గురించీ, మనుష్యుల గురించీ వాడికేమీ తెలియవు. చేసిన మరో తెలివితక్కువపని వాడిని యిండియాకి తీసుకురావడం. ఒక్కోసారి



# మీకు ఏ కారణము వల్ల తల నొప్పి వచ్చినా అది ఒకే ఒక సారిడన్‌తో మటుమాయమై పోతుంది

ఒకే ఒక సారిడన్ నొప్పిని త్వరగా పోగొట్టుతుంది. ఇంతేగాక, అందులో వున్న ప్రత్యేక పదార్థముల వలన సారిడన్ తల నొప్పి, ఒంటి నొప్పి లేక పళ్ల నొప్పితో బాటు కలిగే భారమును పోగొట్టును మరియు మీకు హాయి నవోత్సాహమును కలిగించును. అదే సారిడన్ ప్రత్యేకత!

**సారిడన్**



ఈ దేశం వదిలేసి మళ్ళీ వెళ్ళిపోవాలని పిస్తూంటుంది.

\ 'ఛ!' రంగారావు ఆప్యాయంగా అన్నాడు. 'మెంచకుండా పంచేవన్నారు మన పెదలు. ఆ మాటకి వస్తే నువ్వు చేసినపనికి నేనెంతో గర్వపడుతున్నాను. లోకం లక్ష అంటుంది. కోడై కూస్తుంది. చదువుకున్నవాళ్ళం మనం సంకుచితంగా ఆలోచిస్తూంటే సమాజం యెప్పుడురా పురోగమించేది!'

'నీకు తెలీదు రంగా చెప్పేందుకూ, వినేందుకూ ఈ ధర్మపన్నాలు బాగానే వుంటాయి. ఆచరణలోకి వచ్చేసరికే కుతిక్కి అడ్డంపడి నిలువునా ప్రాణాలు తీస్తాయి. లోకానికి వెరిచి చేసే పనులకి యెప్పుడూ జయం లభిస్తుంది. సమాజంతో నాకేమిటి శిక్ష అనుకున్నప్పుడు తప్పనిసరిగా వొక ప్పుడు కాకపోతే మరొకప్పుడు విచారించవలసి వస్తుంది.'

'నా గురించి కాకపోయినా నా కొడుకు గురించిన బాధ రాత్రింబవళ్ళు నిద్ర లేకుండా నన్ను భయభీతుడిని చేస్తూంది. యేం చేయను? యేది దారి?...అడగడం మరిచిపోయేను. అంతా బావున్నారా! అమ్మ కులాసాయే కదు' అని కొంచెం నవ్వి 'పిల్లలు' అంటూ ఆగిపోయేడు.

# పరిలిప్తం

రంగారావు పెద్ద పెట్టున నవ్వేడు: 'ఆ అంతా బాగున్నారు. మా నాన్న తప్పి దారి రంగారావు అని పేరు పెట్టేడు. కుటుంబరావని పెట్టవలసింది. మొత్తం యెనిమిదిమంది. ఒక్కడే ఆఖరివాడు కొడుకు. తల కొరివిపెట్ట ఈడైనా లేదు వాడికి. నేను అదాటుగా పోయేనంటే మూడేళ్ళ వెధవ వాడేం చేయగలడు?'

'ఛ! అవేం మాటలు రా రంగా.'

'ఇంతకన్న యేం మాట్లాడగలను? అంతా తలరాత. పెద్దది స్కూలు ఫైనలు పాసైంది. నేను తెగించి వుద్యోగం చేయించాలనుకున్నాను. కానీ... వాళ్ళమ్మే నెత్తీ నోరూ బాదుకుంది.'

'అందుకని మానిపించేశావు అవునా!'

'మరేం చేయను?'

'నాకు యిన్ని నీతులు చెప్పి నువ్వు సాహసించలేకపోతున్నందుకు ఆశ్చర్యంగా వున్నది.'

రంగారావు కాస్సేపాగి అన్నాడు: 'నే నన్నది నువ్వర్థం చేసుకోలేకపోతున్నావు దాన్ని వుద్యోగంలో చేర్పిస్తాను. మళ్ళీ మాట్లాడితే నీ కొడుక్కి యిచ్చి పెళ్ళి చేస్తాను'




'వ్హాట్' అదిరిపడ్డాడు సాంబశివం. కుర్చీలోంచి లేచి అతన్ని కుదిపేస్తూ 'నువ్వేమిటిరా అంటున్నది మన సమాజంలో జయరామ్‌ని యెంత హీనంగా చూస్తారో తెలిసే అంటున్నావా ఈ మాటల్ని నువ్వు. నువ్వేదో వుద్రేకంలో అంటున్నావు. స్నేహితుడిని కదా అని కాస్సేపు మురిపించేందుకు వచ్చేవు. అంతేగానీ...ఆ సమయం వస్తే నువ్వా లోకి ముడుచుకుని పారిపోకుండా వుంటావా నా పిచ్చిగాని' అన్నాడు.

రంగారావు గంభీరంగా అన్నాడు: 'లోకం చాలా అంటుంది. సాంఘిక ఆచారాలకీ, సంప్రదాయాలకీ నేను భయపడను. సమయం రాలేదు యిన్నాళ్ళూ. నాలుగు గోడల మధ్యా బంధిస్తే పిల్లి పైతం పులిగా మారిపోతుంది. అయినా ఈ సమాజం పిరికిపంద అని శాసిస్తుంది. నన్నేం చేయగలదు... మాధవరావుని యెవరైనా యేమైనా అనగలిగేరా?'

సాంబశివం కనుబొమ్మలు చిట్లించి ప్రశ్నించేడు: 'మాధవరావా? ఎవరతను? ఎందుకూ? యేం చేశాడు'

'సమయం వచ్చింది కనుక నేనూ అనవలసి వచ్చింది. నాకేమీ అతనిమీద ఈసడింపు భావంలేదు. యెవడో అనాకాని వాడిని తీసుకువచ్చి ఆడంబరంగా కూతురికిచ్చి పెళ్ళిచేసి లా చదివించేడు. వాడీ వూళ్ళోనే వుండి చదువుకున్నాడు. పిల్లాడిని చూస్తే యెవరూ అలా తక్కువ అంచనా వేయరు. చెప్పడం మాత్రం మా తమ్ముడి కొడుకే అంటుందా యిల్లాలు'

'అంటే'

'అంటే లేదు... మరేమీలేదు. మొద్రాసులో కాళిదాసు...'

'ఆ. కాళిదాసు' వులిక్కిపడ్డాడు సాంబశివం: 'కాళిదాసుకి...యేమిటి సంబంధం'

'మొన్నమొన్నటిదాకా కాళిదాసు కొడుకుగానే చలామణీ అయేడు. కాళిదాసు రెండో కొడుకు లేవదీశాడు ఈ విప్లవం. వీడు పుట్టింది జయలక్ష్మికేనట' రంగారావు వాక్యం పూర్తి చేయలేదు ... 'యేవిటి... నువ్వేమిటి సాంబశివం అలా అయిపోతున్నావు...అరె...యెవరక్కడ' అప్పటివరకూ పరధ్యానంగా మధ్యమధ్య తండ్రిమాటల్ని వింటూ తన పెళ్ళిని ఆలోచిస్తూ వచ్చిన

జయరావ్ పరుగుపరుగున ఆ గదిలోకి వచ్చేసి తండ్రిని జాగ్రత్తగా రంగారావు సహాయంతో మంచంమీద పడుకోబెట్టేడు. మంచం మీద పడుకోబెట్టేక కళ్ళు పైకెత్తిన రంగారావు వులిక్కిపడ్డాడు: 'అందం కాదు యిది అఖండ జ్యోతి...' అనుకున్నాడు మనసులోనే.

తండ్రిని కొడుక్కి అప్పగించే విధానం ఒకవిధంగా బోధపడలేదు రంగారావుకి. విదేశాల్లో పుట్టి అక్కడే పెరిగిన అతడికి తెలుగు వచ్చునో రాదో కూడా తెలియదు. ఆ పిల్లాడి కళ్ళల్లో నీళ్ళు దోబూచులాడడం గమనించి అతని భుజం మీద చేయివేసి ఆప్యాయంగా అన్నాడు: 'బాధపడకు. మీ నాన్నకేమీ కాదు. నేనిప్పుడు డాక్టర్ని పిలుచుకు వస్తాను. జాగ్రత్తగా చూస్తూండు.'

అతను తల వూపాడు. రంగారావు గది గుమ్మందాటే వరకూ చూసి తండ్రి తల పక్కనే కూర్చుని నెమ్మదిగా నిమరడం ప్రారంభించేడు. గత యేడెనిమిదేళ్ళుగా అతను తండ్రి స్థితిని చూస్తూనే వున్నాడు. అప్పుడప్పుడు వుద్రేకంగా మాట్లాడడం వల్లనో హఠాత్తుగా యేదైనా విన్నప్పుడో యిలా పడిపోవడం జరుగుతునే వుంది. అతనికిదేమీ కొత్త కాదు. కానీ ఈ వూళ్ళో యెవరూ లేని ఈ మారుమూల ప్రదేశంలో తండ్రికి యేదైనా ప్రమాదం సంభవిస్తే యేం చేయాలి? కొత్తగా యీ భావం మెదిలేసరికి వుప్పెనలా దుఃఖం పొంగుకు వచ్చింది. అతను సర్వం మరిచిపోయి తండ్రి గుండెల మీద వాలిపోయి బావురుమన్నాడు. సాంబశివం కళ్ళు తెరిచి కొడుకు శిరస్సు మీద చేయి వేశాడు. అతని హృదయం తరుక్కుపోయింది.

'లేదురా జయా! నాకేమీ కాలేదు. నేనా నిన్ను విడిచిపెట్టి వెళ్ళిపోయేది. నువ్వు... దేవుడు చాలా మంచివాడు. నిన్నో పువ్వులా నాచేతిలో వుంచేడు. అది యెక్కడ పెట్టాలో తెలియకుండా వుంది. యింత మిథ్యావస్థలో నన్ను లాక్కెళ్ళి పోతాడనుకుంటున్నావా పిచ్చివాడా!'

యెక్కిళ్ళు వస్తుండగా జయరావ్ తండ్రి కళ్ళల్లోకి జాలిగా చూసి నిర్భయంగా ప్రశ్నవేశాడు: 'డాడీ మీకెవరూ లేరా? మిమ్మల్ని అడుకునే ఫ్రెండ్సులేరా? మీరూ నాలాగే ఒంటరివారా డాడీ?'

సాంబశివం పక్కమీదే వొత్తిగిలి అటు తిరిగి పడుకున్నాడు. అతని గొంతులో ప్రజ్వరిల్లే అగ్ని తాలూకు రవ్వలు చెదిరి వెచ్చగా పడుతున్నాయి జయరావ్ మీద.

'లేకేం జయరావ్. అందరూ వుండేవారు తల్లీ తండ్రీ స్నేహితులూ...ప్రాణానికి ప్రాణం యిచ్చిన చిన్ననాటి చెలిమికత్తె జయా... అందరూ వుండేవారు.' సాంబశివం హృదయం బద్దలౌతోంది. గత స్మృతులు అతన్ని కుదిపి కుదిపి కదిల్చి వేస్తున్నాయి.' నీకు చెప్పకూడదనుకున్నాను యిన్నాళ్ళూ. నేను యెంతమంది వున్నా యెవరికీ కానివాడినయ్యేను. ఆ మూగబాధ భరించే శక్తి నాకు వొక్కడికే యిచ్చేడు ఆ భగవంతుడు. నిన్ను కూడా ఈ బాధకి తెలిసి తెలిసి యెలా గురిచేయను. యేమైనా సరే యివాళ నీతో నా గత జీవితం గురించి చెప్పేస్తాను. ఇన్నేళ్ళు వచ్చేయి. నీ అంతటివాడివి నువ్వయేవు. బ్రతుకు చీకటి చాలా భయంకరమైనది. వీలు చూసుకుని అందులోకి జారబడి చుట్టూ వున్న భయంకర నిశీథిని చీల్చేందుకు ప్రయత్నం చేయాలి. యిందుకు తగిన సాధనం పిరికి తనం కాదు జయరావ్...ధైర్యం కావాలి. అర్భకంగా, అబల మనస్తత్వంతో సాధించగలిగేది యేమీ





లేదు. వింటున్నావా'

'చెప్పండి డాడీ'

'ఇన్నాళ్లూ నిన్ను పసివాడిగా చూసిందే కాకుండా, విన్నారిథంగా మానసికంగా పెరగనీయకుండా చేశాను. యిరవైయేళ్లు నిండిన నువ్వు పసిపిల్లడివంటే నవ్వుతుంది ప్రపంచం. యిక నాగురించి ... జయా నేమా చిన్ననాటి స్నేహితులం. పరిస్థితులకి విధిగా తలవొంచి పదేళ్ల వయసులో విడిపోయేం. విదేశాలకి వెళ్లిన నేను మీ అమ్మ స్నేహాన్ని పెంచుకున్నాను. మీ అమ్మ కోరినట్లు చేయలేక, సంఘం ముందు పిరికితనమే కాకుండా జయమీద అమరాగంతో మెడ్రాసు చేరుకున్నాను'

దైవికంగా జయని కలుసుకున్నాను. యింతలోనే కథ అడ్డం తిరిగింది. మా నాన్న చావు బ్రతుకుల మీద వున్నాడని యిక్కడికి వచ్చేను. జయని వాళ్ల బావ కాళిదాసు తీసుకు వెళ్లిపోయేడు. పూర్వో పుకార్లు విధిగా నమా మ్మల్సి వచ్చింది నేను. తిన్నగా లండను వెళ్లాను. అక్కడ చదువులో పడి అయినా మనశ్శాంతి తెచ్చుకోవాలనుకున్నాను. చదువు పూర్తి అయినా నేను వెతుక్కుంటూ, కావాలని కోరుకుంటూ వెళ్లిన శాంతి నాకు దూరం అయిపోంది. ఏకాకిగా ప్రపంచంలో మిగిలిపోతాననే భయంకర సత్యం నన్ను పీడించి పిప్పి చేయ సాగింది. జయ నన్ను నమ్మించి నీతిమాలి, కొడుకుని కన్నది. అదైనా నేను ఆశ్రయం పొంది పైకి వచ్చిన రాఘవరావుగారి దగ్గరే. సంగతి తెలిసీ జయ మోహం చూసేంత హృదయ వైశాల్యం లేక పోయింది నాకు. మీ అమ్మని చేసుకోవడం, నువ్వు పుట్టడం అంతా కలమాదిరి జరిగిపోయింది ... చచ్చిపోయే సమయంలోనైనా జయని నాకెందుకు చేశావీ ద్రోహం అని అడగాలనిపించింది. ఇండియా వచ్చేను.'

'పోతే ఈ ప్రశ్న అడిగిందుకు మెడ్రాసు వెళ్లాలనుకున్నాను. కానీ అవసరం లేకుండానే కళ్లముందు ప్రత్యక్ష సాక్ష్యం దొరికింది. ఆ పిల్లాడు ...జయ కన్నవాడు యిక్కడే వున్నాడు. వాడికి తెలియకపోదు తండ్రి యెవరో...తల్లి యేం చేస్తున్నదీ చెప్పేస్తాడు', సాంబశివం ఆయాసంతో, ఉద్రేకంతో రొప్పుతూండిపోయేడు చాలాసేపు.

జయరావ్ సాంతం విన్నాడు. సహనంగా తండ్రిచుట్టూ చేతులు వేసి ఆప్యాయంగా తనవైపుకి తిప్పుకున్నాడు. అతని కళ్లు యేడ్చిన కారణంగా వుబికి యెర్రబడి పోయేయి. ఆతని మొహంలోకి జాలిగా చూస్తూ అన్నాడు: 'వొద్దు డాడీ. అలా అడిగినందువల్ల మీ కేం ప్రయోజనం చెప్పండి. యెక్కడో ఆవిడ పెళ్లై పిల్లా పాపాతో సుఖంగా భర్త సమక్షంలో కాపురం చేస్తూ వుండివుంటుంది. మీరు ప్రశాంతంగా సాగిపోయే ఆవిడ జీవితంలో కల్లోలం రేపి అన్యాయం చేయకండి. ఆవిడకి నచ్చిన మార్గంలో వెళ్లడంలో తప్పేం చేసింది.'

సాంబశివం యెదురు రొమ్ములో బాకు గుచ్చినట్లయింది. తలెత్తి ప్రయాసగా కొడుకు మొహంలోకి చూశాడు. పాశ్చాత్య రక్తాన్ని పంచుకుపుట్టిన అతనిలో ఈ భావం కదలడంలో అర్థం యెంతైనా వున్నదనిపించింది. స్త్రీ తప్పు చేస్తే తిరిగి పెళ్లి చేసుకుంటే సమర్థించేంతటి శక్తి యెవరికుంటుంది ? తన కొడుకు జయరావ్ ... సాంబశివం వెర్రిగా చూస్తూండి పోయేడు.

'నాకు తెలుసుకోవాలనుంది, యిప్పుడు, ఆవిడ యెక్కడుంది డాడీ'

'మెడ్రాసులో'

'డాడీ!', జయరావ్ కంఠం జాలిగా ధ్వనించింది.

'యేమిటీ?' సాంబశివం ప్రశ్నించేడు.

'ఒక్కసారి మనం ఆవిడని దూరం నుంచి చూసివద్దాం. నేను మి మ్మల్ని యెప్పుడూ యేదీకూడా అడిగి యెరగను', జయరావ్ ఆలోచనలు సుమారు యిరవై సంవత్సరాల ప్రాయం దాటుతూండగా తన పేరుమీద విరిచిపోయేయి. తండ్రికి జయ మీద వున్న అనురాగం యెటువంటిదీ ఆ క్షణంలో అతను స్వానుభవమూ, బ్రతుకు పాఠాలూ యిలాంటివి యేమీ అవసరం లేకుండానే అర్థం చేసుకోగలిగేడు.

సాంబశివం నెమ్మదిగా జవాబు చెప్పేడు. 'టైమువస్తుంది దానికికూడా. వెడదాం: యింతదూరం వచ్చినవాళ్లం. ఈ కొంచెం దూరం ప్రయాణం చేయలేక పోతామా'

* * *

ఆనాడు జడ్జీగారింటినుంచి పారిపోయిన మోహన్ అనేక ప్రాంతాలు తిరిగేడు. యెన్నో ప్రదేశాలు చూశాడు. కాశీలో గంగవొడ్డున స్నానం చేశాడు. కన్యాకుమారి వరకూ విరామంగా యాత్ర చేశాడు. యెన్ని చేసినా అతని అంతరాత్మ అతన్ని నిలదీసి ప్రశ్న వేయక పోలేదు: 'ఏం పనిచేశావ్ పచ్చని సంసారంలో చిచ్చు రేపావు. కన్నకడుపులో సీసం కుమ్మరించేవు. పెంచుకున్న ప్రేమ లతమీద గొడ్డలిపెట్టు వేశావు. యిప్పుడు నువ్వు అనుభవించే సుఖం యెలా వుందో చూడు' మోహన్ కంట తడిపెట్టని క్షణం, పశ్చాత్తాపంతో దగ్ధం అయిపోయే నిమిషం లేనే లేవు. చివరకి తెగించిన వాడిలా రైలెక్కి ప్రయాణం అయేడు.

వీధిలో ముగ్గులు వేసేవేళకి మోహన్ యిల్లు చేరుకున్నాడు. తన యింటిని చిన్నప్పటి నుంచి అల్లారుముద్దుగా, కాలు క్రింద మోపుతేనే కందిపోయే విధంగా చూసిన ఆ యింటిని చూస్తూ అలాగే నిలబడి పోయేడు. ఒకప్పుడు నిత్యకళ్యాణం పచ్చతోరణంగా వున్న ఆ భవంతి నేడు కళావిహీనంగా కనిపిస్తోంది. చిరిగిన బట్టలు, మాసిన గడ్డంతో మోహన్‌ని చూస్తే ఆ క్షణంలో యెవరూకూడా గుర్తుపట్టలేరు. మేడమీదనుంచి తన గదికిటికీ వూసన్ని ఆధారంగా చేసుకుని నిలుచున్న జయ వాకిట్లో నిలబడి తమ భవంతినే పరికించిచూసే ఆ కుర్రడిని కళ్లువెడల్పు చేసుకుని మరీ చూసింది. సందేహం లేదు వాడు...వాడు మోహనే.

'బావా !', జయ కేకవేసింది. క్రింది హాల్లో పుస్తక పఠనంలో నిమగ్నుడైపోయిన కాళిదాసు తలపైకెత్తి మెట్లమీద నిలుచున్న జయవైపు చూశాడు.

'భారతీ యిలారా. త్వరగా రావాలి', అంటూనే మెట్లుదిగింది. వంటగదిలోంచి వచ్చిన భారతీ, హాల్లో వున్న కాళిదాసు అర్థంకాని వాళ్లలా చూస్తున్నారు జయవైపు.

యేళ్లు మీదపడగా, వెతలతోటీ, మరపురాని తీయని స్మృతులతోటీ నలిగిపోయిన జయని శరీరం యేమాత్రం కృంగదీయ

లేదు. లావుగా పొట్టిగా కనిపిస్తున్నది యిప్పుడు. చెంపల ప్రక్కగా వెంట్రుకలు నెరిసిపోయి సంభ్రమ పడిన జయని అంతకుమించిన యేళ్లు వున్నదాని మాదిరిగా కల్పింప జేస్తున్నాయి.

భారతి జయనెనుకే వెళ్లింది. చిక్కి శల్యం అయిపోయిన భారతికి యిరవై యేళ్లు పెంచిన కొడుకు తనకొడుకు కాదనే బాధ మరీ పీడించసాగింది. కంఠాన్ని కొంచెం పెద్దగిచేసి 'యేమిటి జయా యెందుకు పిలిచేవు?' అని అడిగింది.

'మరేమీలేదు భారతీ వీధిలో మన మోహనుడు నిలిచి వున్నాడు. వాడు వచ్చేందుకు తటపటా యిస్తున్నాడు బావా వాడిని యేమీ అనవద్దు అంటే నామీద ఒట్టు'

కాళిదాసు అప్రతిభుడై పోయేడు. భారతి నివ్వెరపోయి చూడసాగింది. జయ బయటికివెళ్లి 'రా లోపలికి' అన్నది మోహన్ కళ్లల్లో పశ్చాత్తాపం, భయం ఒక దానివెంట ఒకటి క్షణకాలం నృత్యం చేయసాగాయి.

'నిన్నెవరూ యేమీ అనరు. నేనున్నాను. రా నాయనా అన్నది జయ అతనికి దగ్గరగా వెళ్లి భుజంమీద చేయి వేస్తూ. మోహన్ గొంతు పెగలించుకుని అన్నాడు: 'నన్ను క్షమించు పిన్నీ. తెలియక చేశాను. చివరకి కుక్కలపాట్లు అనుభవించేను. అన్నయ్యకీ, అమ్మకీ మనశ్శాంతి లేకుండా చేశాను. నాన్నగారి బ్రతుకు బజారుపాలు చేశాను. నిన్ను...నిన్ను సంఘానికి ప్రత్యక్షంగా చూపించేను. యిన్ని చేసి చివరకి అనుభవించేను. నా తప్పులు క్షమించే వుదార స్వభావం మీకు వున్నదనే ధైర్యంతో నే ఈ యింటికి వచ్చేను. మీరు క్షమించక పోతే మళ్లీ దిక్కులేక బికారినై వీధులు పట్టుకు పోవాలి'

'అవన్నీ మరచిపో మోహన్. తప్పులు మనుషులు కాకపోతే మానులు చేస్తాయా. యింట్లోకి రా. ఈ యిల్లు నీది. వాళ్లు నీ తల్లితండ్రులు. నీ గురించి అహర్నిశమూ అన్నపానీయాలు మానేసి చిక్కి శల్యం అయి పోయేరు...నాకు యెక్కువగా మాట్లాడే అలవాటుకూడా లేదు...' అన్నది జయ లోపలికి తీసుకునస్తూ.

భారతి చెంపలమీదుగా అశ్రుధార స్రవిస్తున్నది. యిన్నేళ్లు మాయం అయిపోయి అస్థిపంజరాన్ని తలపింపజేసే కొడుకుని చూడగానే గుండెలుపిండే ఆవేదన ననుభవించ సాగింది.

కాళిదాసు మాట్లాడలేదు. భారతి యెదురువెళ్లి కొడుకుని గుండెల్లోకి చేర్చుకుని అతని శిరస్సుమీద చేయివేసి అత్యంత ఆశతో, ఆబగా, ప్రేమతో నిమరసాగింది.

# పరిలిప్తం

కాళిదాసు తలవాల్చి సోఫాలో చేరగిలబడిపోయి పేపరు తిరగేస్తూండి పోయేడు. అతని చూపులు పేపరుమీద కొన్ని ప్రకటనలు చూస్తూ మరోచోట ఆగిపోయింది.

దృక్కులు చలనరహితంగా మారిపోయేయి. అతను హడావడిగా లేచి పిలుచాడు. 'జయా కారు సిద్ధం చేయించు. ఈ క్షణం నేను గుంటూరు వెళ్ళాలి'

'గుంటూరా!'

'అవునమ్మా సాంబశివం అక్కడే వున్నాడు. యిదిచూడు.'

జయ విరక్తిగానవ్వి: 'బాగున్నది బావా ప్రపంచంలో యెన్నో వేల సంఖ్యలో ఆ పేర్లుగల వ్యక్తులున్నారు. ఈ సాంబశివం మన సాంబశివం అయివుంటాడని నమ్మకం ఖేమిటి' అన్నది.

'వీళ్ళేదు అతను మరో సాంబశివం అయేందుకు [illegible] ఆ సాంబశివం... కరెక్టు ఎఫ్. [illegible] సి. యస్. చదివిన డాక్టరు అతనే.'

జయ వింటున్నచోటే, కుప్పలా కూలిపోయింది. నిరాశలో వున్న ఆనందం ఆశలో కనిపించదు పోకపట్టాన. బ్రతుకంతా సాంబశివంకోసం కాపు కాచిన నిరీక్షణలో హాయిగా చీకూ చింతా లేనిదానిమాదిరిగా కాలం వెళ్ళదీస్తున్నది. వున్నట్టుండి సాంబశివం ప్రత్యక్షం ఆయేడనే వార్తని ఆ హృదయం భరించలేక పోయింది. రేపటి మీద ఆశ మనిషికి యిచ్చినంత పుష్టిని వర్తమానం యివ్వలేకపోయింది. 'కాదు బావా! సాంబశివం యిప్పుడెందుకు వస్తాడు. వచ్చినా...నీ మాటల్ని నమ్మతానంటావా. అసలతను నామీద మమతని తెంపుకున్న కారణం అదేకద. యిప్పుడు బాబాయికూడా లేరు నిజం చెప్పేందుకు. వెళ్ళి నువ్వు యేం సాధిస్తావు. నవ్వుల పాలైపోతే నేనెలా భరించగలను? నీ బ్రతుకంతా నాకోసం పాడుచేసుకుంటున్నావు' అన్నది నీరసంగా.

కాళిదాసు కళ్ళు నిప్పులు కురిపిస్తున్నాయి. జీవితంలో ఆ విధంగా అతడే వాడూ లేడు. కష్టాల్ని దిగమింగేసి సుఖాల్ని కొద్దికొద్దిగా పుచ్చుకునే అలవాటు అతనికి భగవంతుడు పుట్టుకతోటే యిచ్చివున్నాడు. 'యిన్నాళ్ళూ చేతకానివాడినై చేతులు ముడుచుకుని కూర్చొని పతితనీ, కళంకినినీ కాళిదాసు [illegible] పోషిస్తున్నాడోయ్ అంటూంటే గత్యంతరంలేక ఆ అవాకులూ, చవాకులూ తీయగా భరించేను. యింకా వీటిని నిర్లక్ష్యం చేసే అవసరంలేదు తల్లీ నాకు యింత. చదువు చదివీ, సంస్కారం, పరువూ—ప్రతిష్ఠలూగల కుటుంబంలో పుట్టి చివరికి కానీకి కొరగానివాడు సైతం నిన్ను నానా కూతలూ కూస్తూంటే నానోరు యెందుకు పడిపోయిందంటావు?

'ఆ దౌర్భాగ్యుడు యెక్కడున్నాడో తెలియకా, తెలిసినా పిలుగాక మధ్యస్థంగా కొట్టుకు పోయేను ఇరవై యేళ్ళు గుండెల్లో దాచుకున్న రహస్యం బద్దలై నలుగురుకీ తెలిసిపోగానే తల భూమిలో కంటా వొంచేసుకుని దోషిగా నిలబడిపోయేను. ఆ దౌర్భాగ్యుడు విదేశాలకి వెళ్ళాడు చదువులు వెలగబెట్టాడు. యింకా పవిత్రంగానే వున్నాడంటావా. స్కాండల్ యివాళ నా చేతుల్లో చిక్కుకున్నాడు. వాడి అంతు తేలుస్తాను. నాకెవరూ యెదురు నిలుచోలేరు ఆ బ్రూట్‌కి జీవితంలో వాస్తవాన్ని, కలల్లో యధార్థాన్నీ విప్పి చెప్పాలి. ఆడదంటే మజాక్ కాదనీ, తను శిథిలం అయిపోయినా శీలం కోసం ప్రాణం విడుస్తుందనీ, కాని పక్షంలో వోడిపోయి శిక్షని అనుభవిస్తుందనీ బుజావు చేయ్యాలి. జయ బ్రతుకు నీవల్లే తెల్లవారిపోయిందిరా యిడియట్ అని చెప్పాలి' కాళిదాసు కొంచెం ఆగాడు. ఆయాసంతో రొప్పుతున్నాడు. యెక్కువగా మాట్లాడినందువల్ల చమటలు పుష్కలంగా పోసి అతన్ని తడిపేస్తున్నాయి.

జయ అతనికి దగ్గరగా లేచి వెళ్ళి భుజం మీద చేయి వేసింది: 'నాకోసం మీ భార్యాభర్తలు యెన్నో నిందల్ని సంతోషంగా భరించేరు. అందరూ వుండి లేనిదాన్నయ్యేను. పతిత కొడుకునవే అవమాన భారంతో పరోక్షంగా మొహం మీద కళ్ళాపు చల్లిన కొడుకు దూరం అయిపోయినపుడు నేను యేమీ కాలేదు. నా మనసు నమ్ముకున్న సిద్ధాంతాన్ని సంతోషంగా భరించేను. నా భర్త యెక్కడో పదిలంగానే వున్నాడనీ, కొడుకు ప్రయోజ[illegible] బ్రతుకుతున్నాడనీ లోలోపల సంతృప్తి పోయేను. పాపపుణ్యాల నిర్ణేత నా మొహాన యేం రాశాడో అర్థంకాదు కానీ బావా నేను చెడిపోయేనని అందరూ అన్నప్పుడు ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాను. నాలాంటి వాళ్ళకి అదో పెద్దసమస్య కాదు. యే ఆర్సెనిక్ యింజక్షనో, సైనైడో తీసుకుని గుక్కెడు ప్రాణం తీసుకోలేక పోను కానీ ... సమాజం నా మొహం మీద మూడు పంక్తులా విధించిన అన్యాయపు శిక్షని మరింత పటిష్ఠం చేసినదాన్నే అవుతానని భయపడిపోయేను.'

'చావంటే నాకెప్పుడూ భయంలేదు బావా! నా మొహాన విధించిన ఆ కళంకం నేను బ్రతికి వుండగానే నలుగురికీ వెల్లడి చేయ్యాలి. అప్పటికి గానీ నా అంతరాత్మ క్షోభ తీరదు. కానీ యిప్పుడు భయంగా వుంది'

కాళిదాసు భుజం మీదుగా తల పక్కకి తిప్పి చూశాడు. జీవితంలో మొదటిసారి చాలా నూట్లాడుతూ జయ యేడుస్తోంది: 'నీది పగబట్టిన ప్రతీకారం. నీ ఆవేశం చూస్తూంటే యేదైనా చేసేందుకు సంసిద్ధుడివే అనిపిస్తోంది. నీకు తెలుసు నా గురించిన సర్వం. అతన్ని చంపి సాధించేది యేమీ లేదు. యెక్కడో వున్నాడన్న తృప్తిలో బ్రతికే నాకు ఆ ఆశని కూడా తెంపేయకు. నాకు మాటయివ్వాలి. నామీద వొట్టేసి యిక్కడినుంచి కదులు. నువ్వు గుంటూరు వెళ్ళి యేమీ చేయననీ, వొట్టిగా అడిగి వస్తాననీ మాటివ్వు.'

కాళిదాసు జయవైపు తిరిగి 'అలాగే' అన్నాడు.

'పేరుకి ప్రేమించి పెళ్ళిచేసుకున్నారు. నావల్ల మీ యిద్దరి జీవితాల్లో సుఖం లేకుండా పోయింది. భారతిని యింకా కష్టపెట్టకు బావా! నీకెందుకీ చిక్కు సమస్యలన్నీ'

భారతి జోక్యం చేసుకుంది: 'వొద్దు అంటే పోయేందుకు యివి యేమైనా చిన్న విషయాలా జయా. తాడో పేడో తేల్చుకు రానీ.'

మోహన్ తేరపారి చూడసాగాడు. 'పిన్ని బ్రతుకు యెంత చిత్రంగా వుందీ' అనుకున్నాడు మనసులోనే.

ఆరోజే బయలుదేరి గుంటూరు వెళ్ళాడు కాళిదాసు.

(ఇంకా ఉంది)




వైద్యులిచ్చే వైద్యుల్ని మూడు తెగలుగా చెప్పవచ్చును. సాధారణ వైద్యుడు మొదటి తెగకు చెందినవాడు. రోగికి మందివ్వడంతోనే అతని బాధ్యత తీరిపోతుంది. దాన్ని రోగి తీసుకున్నా, తీసుకోక పోయినా— దానితో నిమిత్తంలేదు. రోగం కుదరక పోతే 'నేనేం జేస్తాను? నేనిచ్చిన మందు రోగి తీసుకుంటేనా? మందు తీసుకునే అక్కర తనకు లేనప్పుడు వైద్యుడేమీ చెయ్యలేడు' అని సమాధానం చెప్తాడు.

రెండోరకం వైద్యుడు రోగిని పరీక్షించి మందు యివ్వడమే కాకుండా, ఆ రోగి హితాన్నికోరి మందు పనిచేసే విధానాన్ని గురించీ, అనుపానాదులను గురించి రోగి మనస్సుకు నచ్చే విధంగా చెప్పి, మందు తీసుకునేటట్లు చేస్తాడు. మొదటి వైద్యుడికంటె ఈ వైద్యుడు మేలుకదా!

ఎంత నచ్చచెప్పినా, కొందరు రోగులు మందు తీసుకోడానికి వెనకాడతారు. వైద్యుడి హితోక్తులకు తలవూచి, ఆయన కనుమరుగు - కాగానే ఔషధ సేవనలో అశ్రద్ధ చూపవచ్చు. అట్టిరోగులకున్నా గుణం కనబడడం కష్టం, అందువల్ల మూడోరకం వైద్యుడు అవసర మవుతాడు. అతడు రోగికి మందివ్వడంతోనూ, హితాన్ని ఉపదేశించడంతోనూ తృప్తిపడడు. రోగి మనస్తత్వాన్ని బాగా కనిపెడతాడు. రోగి, తాను చెప్పినట్లు చెయ్యడనే సందేహం తోచినా ఊరుకోడు, బలవంతంగా నయినా మందు నోట్లోపోసి మింగిస్తాడు, రోగి రోగం తప్పకుండా కుదురుతుంది.

ఈ వైద్యుల విధంగానే ధర్మప్రబోధం చేసే గురువులు కూడా మూడురకాలుగా ఉన్నారు. మొదటి తరగతికి చెందినవారు కేవలం ధర్మోపన్యాసాలను ఇచ్చి తృప్తి పడతారు. తాము చెప్పినదాన్ని జనం శ్రద్ధతో విన్నారా? లేదా? తమ హితాన్ని ఆచరణలో పెడతారా? లేదా? అనే ఆలోచన వారికి అక్కరలేదు. ఇట్టివారు మొదటిరకం వైద్యుల వంటివారు. వీరి ధర్మ ప్రచారంవల్ల ప్రయోజనం కానరాదు.

రెండవ తరగతికి చెందినవారు ఉపన్యాసాలతో తృప్తిపడరు. తమ ఉపదేశాన్ని శ్రద్ధగా విననివారికీ, దాన్ని ఆచరణలో పెట్టనివారికీ చక్కగా నచ్చజెప్పి, ధర్మాచరణలో ఉత్సాహాన్ని కలిగిస్తారు. వీరు హితైషులయిన వైద్యుల వంటివారు.

ఎంత చెప్పినా, ఎంత హితాన్ని బోధించినా ధర్మాచరణ విషయంలో శ్రద్ధ చూపని మొండిఘటాలు ఉండకపోరు, అట్టి వారిని కూడా దారికి తెచ్చేవారే మూడోరకం ధర్మోపదేశకులు, ఉత్తమబోధకులు. వీరు ఉత్తమ వైద్యుల కోవకు చెందినవారు. ఉత్తమవైద్యుడు రోగినోటిలో బలవంతంగా అయినా మందుపోసి మింగేటట్లు చేసిన మాదిరిగా ఈ ఉత్తమ గురువు మిక్కిలి శ్రద్ధ వహిస్తాడు. తాను ఉపదేశించిన ధర్మాన్ని ప్రజలు అనుసరించక పోయి గట్లయితే—దివ్యమైన తన శక్తిని ఉపయోగించి అయినా వారు సద్ధర్మాన్ని ఆచరించేటట్లు చేస్తాడు.

అట్టి ఉత్తమ గురువులను సంపాదించుటకే సర్వదా ప్రయత్నింపవలెను. వారివలన కలుగు ప్రయోజనము ఇంత—అంత అని చెప్పనలవి కానిది. ●




"ఇండియాని ముస్లిమ్ దేశంగా ఎందుకు ప్రకటించకూడదు, అందువల్ల భవిష్యత్‌లో జరిగే ముస్లిమ్ సమావేశాలలో మనని బహిష్కరించడం జరగదుకదా!"



# కోరిక

పత్రి రామసీత







బొమ్మ: శ్రీబాపు

'ఎందాకా నేమిటి ప్రయాణం?' ప్రయాణ సన్నాహంలో వున్న రావుగారిని అడిగింది మిసెస్ సుశీలారావుగారు.

'ఇక్కడికే గుంటూరు!' ముక్తసరిగా సమాధానం చెప్పారు రావుగారు.

'అహా! రిటైరయింతర్వాత ప్రయాణాలసరదా ఎక్కువైనట్టుందే. అంత కొంపలు మునిగే రాచకార్యం ఏముందక్కడ' అడిగింది ఆవిడ.

'అబ్బే మరేంలేదు. పెన్షన్ తాలుకు కాగితాలు కొన్ని కావాల్సి వచ్చింది అందుకని...'

ఈ సమాధానం ఆవిడకు తృప్తి కలిగించినట్లుంది. అందుచేత రావుగారి మాట పూర్తికాకుండానే 'ఎప్పుడొస్తారేం' అన్నది.

'ఒకటి రెండురోజుల్లో వచ్చేస్తా' అన్నారాయన.

సాధారణంగా రావుగారు ఏ పనిమీదనైనా సరే ఇంటోంచి వెళ్ళాల్సి వచ్చినప్పుడు



# బహుమతి రు. 2,300 పొందిన కథ



ముందుగా ఆవిడకు తెలియజెయ్యాలి. ఉద్యోగ విరమణ చేసేటంతవరకూ ఈ నియమాన్ని ఆయన ఎన్నడూ ఉల్లంఘించేవారు కాదు. ఆ విధంగా చెప్పక పోవటం వల్ల రాగల పరిణామాలు ఆయనకు బాగా తెలుసు. కాని ఈ ప్రయాణం మిగిలిన వాటిలాంటిదికాదు. ఈ ప్రయాణం కోసరం ఆయన ఇంకో ఏడాదికి రిటైరు అవుతారనగా సన్నాహాలు చేయ సాగారు. తను సర్వీసులో వుండగానే ఏదో పని కల్పించుకొని గుంటూరు వెళ్దామని అనుకొన్నారాయన. కాని అది సంభవించ లేదు. ఆయనకు గుంటూర్లో చేయగల రాచ కార్యాలు ఏమీ లేవని ఆవిడకు బాగా తెలుసు. కనీసం ఆ ప్రాంతాలలో ఆయనకు సన్నిహితులైన బంధువులెవరూ లేరు. ఒకవేళ వున్నా ఆయన ఒక్కరూ వాళ్లింటికి వెళ్లటానికి వీలులేదు. ఆవిడ కూడా వుండాల్సిందే.

అయితే ఇప్పుడు మంచి అవకాశం లభించింది. 'పెన్షన్‌కు సంబంధించిన కాగితాలు' ఆయన చాలా జాగ్రత్తగా ఆలోచించి ఆడిన అబద్ధం. ఆయన రిటైరై కనీసం నెలైనా కాలేదు. అప్పుడే పెన్షన్ సంగతి ఎవరు పట్టించుకొంటారు. ఇంకో ఏడాదిలోపల తన చేతికి పెన్షన్ వస్తుందన్న ఆశ ఆయనకు లేదు.

తనతో కూడ ఆవిడ ప్రయాణమవుతుందేమోనని రావుగారు ఎంతో భయపడ్డారు. ఎందుకంటే ఆయన వుద్యోగం చేసే రోజుల్లో కాంపుకు కూడ ఆవిడ తనతో రావాల్సిందే. ఇప్పుడు తనకు ప్రభుత్వం వారు టి. ఎ. డబ్బులు ఇవ్వటం లేదు. కాబట్టి ఆవిడ రాకపోవచ్చు అనే ఆశ ఆయనకు మిగిలింది.

ఆవిడ నిజంగా రావటం లేదని తెలిసిన తర్వాత రావుగారి ఆనందానికి అవధులు లేకపోయినాయి. ఆయనకు ప్రపంచం అంతా ఆహ్లాదకరంగా కనిపించింది. ఆయనకు నిజంగా స్వతంత్రం వచ్చినట్లుగ భావించారు.

రైలెక్కుతూనే కిటికీదగ్గర స్థలం ఎన్నుకొని మరీ కూచున్నారు. ఆ తర్వాత తీరిగ్గా రైలు ప్లాట్‌ఫారంమీది అందచందాలను తిలకించేటంతలో దగ్గర్లో వేరుశెనక్కాయలు అమ్మేవాడొకడు కనపడ్డాడు. వేరుశెనక్కాయలంటే ఆయనకు చాల ఇష్టం. అయితే వాళ్ల నాన్నగారికి అవంటే పరమ అసహ్యం. అంచేత అవి ఆయనకు అందని మ్రానిపళ్లే అయ్యాయి. చిన్నప్పుడొకసారి ఆయన వాళ్లమ్మ ఇచ్చిన కానీతో వేరుశెనక్కాయలు కొనుక్కోబోయారు. ఆ విషయం వాళ్ల నాన్నగారికి ఎలా తెలిసిందోగాని ఆయన 'ఇంకోసారి వేరుశెనక్కాయలు కొన్నట్లు తెలిస్తే డొక్క చీరేస్తాను వెధవా' అన్నారు. ఆయన అన్నంతపని చేయగలడు కూడాను. ఆయన ఛండశాసనుడు. ఆయన మాటకు ఇంట్లోకాని ఆయన పనిచేసిన స్కూల్లోగాని తిరుగుండేది కాదు.

వేరుశెనక్కాయలు అమ్మేవాడు దగ్గరకి రాగానే ఓ పావలా వేరుశెనక్కాయలు కొన్నారు. వాడా కాయల్ని పొడుగాటి పొట్లంలో కట్టి ఇచ్చాడు. కాయలు తిందామనుకొని కంపార్టుమెంటు లోపలివైపుకు తిరిగారు. ఇప్పటివరకు ఆయన గమనించ లేదు గాని కంపార్టుమెంటులో ఆయన కాక ఇంకా ఇద్దరు ప్రయాణీకులున్నారు. వాళ్లిద్దరూ కుతూహలంగా రావుగారి కేసి చూస్తున్నారు. కాయ వలిచి గింజ నోట్లో వేసుకుందామనుకున్న రావుగారు ఒక్కక్షణం ఆగారు. వాళ్లిద్దరూ ఎందుకట్లా చూస్తారు. ఒకవేళ ఫస్టుక్లాసు కంపార్టుమెంటులో వేరుశెనక్కాయలు తినటం గౌరవ భంగమా! వాళ్లేమన్నా అనుకుంటారేమో! రిటైరై పోయిన వ్యక్తి చిన్న పిల్లాడిలా వేరుశెనక్కాయలు తినటం అసహ్యంగా వుంటుంది కాబోలు. వాళ్లకేసి సూటిగా చూడటానికి ధైర్యం చాల లేదు. తినబోతున్నవాడల్లా ఆగిపోయి పొట్లాన్ని పక్కనున్న సంచిలో పెట్టేశారు. 'ఈ వేరుశెనక్కాయలు, ఆయన వెళ్లేచోట ఒక అబ్బాయికి ఇవ్వటానికని తీసుకు వెళ్తున్నాడు' అని ఆ ఇద్దరూ అనుకోవాలని ఆయన వుద్దేశం.

రావుగారు తిరిగి కిటికీలోంచి బైటకు చూస్తూ కూచున్నారు. అప్పటికి రైలు వేగం పుంజుకుంది.

వేరుశెనక్కాయలు తినటానికి వీలులేక పోయిందే అని ఆయన మనసు పీకుతూనే వుంది. విహారానికి తను చేద్దామనుకున్న



ఏ పని సవ్యంగా జరిగింది [illegible] తలిస్తే దేముడుకాక పోవచ్చుగాని తండ్రి, భార్యమాత్రం వేరొకటి తలచేవారు. అస లాయన బి. ఎ. ప్యాసవగానే 'లా' చదువుదామనుకున్నారు. ఆ రోజుల్లో ప్లీడర్లకు మంచి గౌరవం, హోదా వుండేవి. కాని రావుగారి భవిష్యత్తుగురించి వాళ్ల నాన్నగారు అంతకు ముందే ఒక పథకంవేసి స్థిరపరిచారు.

ఆ పథకం ప్రకారం రావుగారు సబ్‌కలెక్టరుగారి ఏకైక పుత్రికని పెళ్లిచేసుకోవాలి. మామగారు అల్లుడికి రెవిన్యూ డిపార్టుమెంటు వుద్యోగం ఇప్పించాలి. రావుగారి ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండానే ఆ పథకం అమలు జరిగిపోయింది. తండ్రిగారి శిక్షణలో తనకేం కావాల్సిందీ తనకన్నా తలిదండ్రులకే ఎక్కువ తెలుసుననే విషయాన్ని బాగా ఆకళింపు చేసుకున్నారు. అయినా ఈ వివాహానికి తద్వారా రాబోయే రెవిన్యూ డిపార్టుమెంటు వుద్యోగానికి తన అయిష్టాన్ని సూచనప్రాయంగా వ్యక్తం చేసారు రావుగారు. వాళ్ల నాన్నగారు గయ్యిమన్నారు. 'బోడితెలివితేటలూ నువ్వూ. నీకు వుద్యోగాలగురించి ఏం తెలుసంట అసలు? నోరు మూసుకుని చెప్పినట్టు విను' అన్నారాయన.

# కోరిక

వివాహమయిన మరుక్షణమే రావుగార్ని సబ్‌కలెక్టరుగారు పిలిచి 'చూడు నాయనా నాకు ఒక్కగా నొక్కపిల్ల. దాని ఇష్టానికి వ్యతిరేకంగా మా ఇంట్లో ఏపని జరగదు. దానిమనసు ఏ మాత్రం కష్టపడినట్లనిపించినా మేమెవరము సహించలేము. ఎట్లా చూసుకుంటావో మరి' అన్నారు.

రైలు రాజమండ్రిలో ఆగింది. 'వీళ్లిద్దరూ ఇక్కడ దిగిపోతే బాగుండును వేరుశెనక్కాయలు తినవచ్చు' అనుకున్నారు రావుగారు. వాళ్లు దిగలేదు సరికదా ఇంకో మనిషి వచ్చి ఎక్కాడు. ఆ వచ్చినాయన రావుగారిని పలకరించాడు 'ఎందాకానేవిటి' అంటూ.

'ఇక్కడికే గుంటూరు, మీరో' అన్నారు రావుగారు మర్యాదకు. 'హైదరాబాదు' అన్నాడాయన.

కంపార్టుమెంటులోవున్న ఇద్దరూ తనకు తెలిసినవాళ్లు కాదు. వాళ్లేమనుకుంటే తనకేం వేరుశెనక్కాయలు తినేద్దాం అనుకున్నారు ఇప్పటివరకు రావుగారు. కాని మూడోమనిషి కొంచెం ముఖపరిచయం గలవాడవటంచేత ఆపని చేయటానికి సాహసించలేక పోయారు.

ఈరకమైన ఆటంకాలు, ఆశాభంగాలు ఆయనకు కొత్త కాదు. వివాహమైన కొత్తలో సినిమాకు వెళ్లటం విషయంలో పేచీవచ్చింది ఇద్దరికీ. భర్తగా తన అధికృత నిరూపిద్దామని ఏమైనాసరే 'మాలపిల్ల' చూడటానికి వీలులేదు 'కృష్ణరాయబారం' నాటకం చూద్దాం అన్నారాయన.

అంతే, ఆతర్వాత పరిస్థితులు చాలా తీవ్రంగా పరిణమించాయి. సన్నిహితులందరిచేత చివాట్లు తిన్నారాయన. అప్పట్నుంచి మామగారింట్లో రావుగారికి గల స్థానము, గౌరవమూ క్రమక్రమంగా దిగజారుతూ వచ్చాయి. ఆరోజునుంచి ఆయన ఏనాడూ భార్యమాటకు ఎదురు చెప్పలేదు. మొదట్లో తండ్రికట్టడినుంచి దూరంగా వెళుతున్నామగదా అని సంతోషించారాయన. ఆయన ఎన్నో పథకాలు వేసుకున్నారు. తన వ్యక్తిత్వాన్ని తీర్చి దిద్దుకునే అవకాశం లభించిందనుకున్నారు. కాని తండ్రి కట్టడిలోనైనా కనిపించే ఆప్యాయత, ప్రేమ మామగారింట్లో ఛాయామాత్రంగానైన గోచరించలేదాయనకు. ఆ ఇంట్లో ఆయనొక ఆటవస్తువు. చెప్పినది తు. చ. తప్పకుండ మాత్రమే చేయటం చేతనయిన బొమ్మ.

కాని...ఎడారి అయిపోయిన ఆయన జీవితంలో ఒకే ఒక ఒయాసిస్సు. కలలాగ గడిచిపోయిన రోజులవి. గుంటూర్లో గడిపిన ఏడాదిన్నర ఆయన హృదయాంతరాళాల్లో పదిలంగా భద్రపరచుకున్న జ్ఞాపకాలు. ఆ జ్ఞాపకాల పుటలను ఎప్పుడూ తిరగేస్తూనే వుంటారు. అంతకు మించి ఆయన చేయగలిగిందేమీ లేదు.

రెవిన్యూ ఇనస్పెక్టరుగా ఆయన్ను గుంటూరు ట్రాన్స్‌ఫర్ చేసారని తెలియగానే 'నేనా దరిద్రపు వూరికి రాను' అన్నది ఆయన భార్య.

గుంటూర్లో రావుగారు మర్చిపోలేని స్థలాలు గాంధిపార్కు, అరండల్‌పేట, బాంబే టాకీసు, రత్నహాలు, కొత్తపేటలో రాజమ్మ భోజనహోటలు. ఆఫీసు లేనప్పుడు, ఏమీ తోచనప్పుడు, ఎక్కడైన తిరుగుతూనో ఏదైన సినిమాగాని, నాటకంగాని చూస్తూనో లేకపోతే గాంధిపార్కులో గోళ్లు గిల్లుకుంటూ కూర్చోటమో చేస్తూ

నిన్ను చూస్తుంటే కొంత మనశ్శాంతిగా ఉంది
గంగాళం. నిన్ను చూస్తున్నంతసేపూ చావంటే
భయంలేకుండా హాయిగా ఉంది ప్రాణం



వుండేవారు. రాత్రి ఏ ఎనిమిది గంటలకో రాజమ్మ హోటల్లో భోంచేసి గదికి చేరు కునేవారు.

రైలు ఏలూర్లో ఆగింది. ఫ్లాట్‌ఫారం నిండా జనం చాలామంది వున్నారు. రావు గారి దృష్టి ఒక నల్లటి అమ్మాయిమీద పడింది. ఆ అమ్మాయి తన పక్క కంపార్టుమెంటులో ఎక్కడానికి ప్రయత్ని స్తోంది. ఆ అమ్మాయిని చూడగానే రాజమ్మ జ్ఞాపకం వచ్చింది.

ఆ రోజుల్లో రాజమ్మ కూడ ఇట్లాగే వుండేది. ఇప్పుడెట్లా వుందో. ఆవిడ భర్త కొంచెం వెర్రిబాగులవాడు. అంచేత ఆవిడే మొగపని ఆడపని చేసుకోవలసి వచ్చేది. అతనుమాత్రం హోటలు అరుగుమీద వచ్చే పోయే వాళ్లని చూస్తూ కూచునేవాడు.

రాజమ్మ తనంటె మొదటినుంచీ ఎంతో అభిమానం చూపించేది. గుంటూరు కారం తను తినలేక పోయేవాడు. అందుకని కారం తక్కువ వేసిన పదార్థాలు తనకోసం తీసి వేరే పెట్టేది. తను ఎంత ఆలస్యంగా భోజనానికి వచ్చినా విసుక్కోకుండా అన్నం పెట్టేది.

ఈ అభిమానాన్ని పురస్కరించుకొని

# కోరిక

తనే తొందర పడ్డాడో లేకపోతే ఆవిడే తనని ప్రోత్సహించిందో తన కిప్పుడైతే జ్ఞాపకం లేదుగాని ఆవిడ తన కక్కడ భార్యలేని లోటు తీర్చింది.

ఈ విషయం స్ఫురణకు రాగానే రావు గారికి కొంచెం సిగ్గు వేసింది. చిరునవ్వు నవ్వారు. ఇప్పుడెట్లా వుందో! తనని గుర్తు పట్టుతుందో లేదో! అదేం ఆలోచన? ఎలా మర్చిపోగలదు?

తొందరలోనే తనను తిరిగి కాకినాడ ట్రాన్స్ఫర్ చేసారు. తర్వాత ఆయ నెప్పుడూ గుంటూరు వెళ్లలేదు.

తనతోపాటు రాజమ్మ హోటల్లో భోం చేసిన తోటి గుమాస్తా ఒకాయన ఉత్తరం రాస్తూ రాజమ్మకు మొగపిల్లవాడు పుట్టి నట్లుగా తెలియ చేసాడు. ఆయన చాలా సంతోషించాడు. అయితే ఆ వుత్సాహాన్ని ఆయన మనసులోనే అట్టే పెట్టుకోవాల్సి వచ్చింది.

తనకిప్పుడు మొగపిల్లలు లేరు. ఉన్న ఇద్దరూ ఆడపిల్లలే. మనవడి కోసం కలవ రించి మామగారు ఆ కోరిక తీరకుండానే కాలం చేసారు.




గుంటూరు చేరేవరకు ఆయన మనస్సులో రకరకాల వూహాలు మెదలసాగాయి. రాజమ్మ ప్రస్తుతం ఏవిధంగా వుంటుందో వూహించేరు. ఆమెతో సంభాషణ ఎట్లా మొదలు పెట్టాలో మిగిలిన విషయాలు ఎల్లా మాట్లాడాలో రకరకాల సంభాషణలను వూహించి అందులో తను బాగా వుందను కున్న సంభాషణను రెండుమూడుసార్లు మననం చేసుకున్నారు.

అయితే తను కుర్రవాణ్ణి ఎట్లా పలక రించాలో ఆయనకు తెలియలేదు. తను తీసుకు వచ్చిన రెండువేల రూపాయలు తీసు కునేందుకు ఆవిడ అంగీకరిస్తుందో లేదో! అప్పుడావిడను ఏవిధంగా ఒప్పించాలి అన్న విషయాలు ఆయనకు తీరని సమస్యగానే మిగిలిపోయాయి.

ఈ రెండువేల రూపాయలు ఆయన ఒక్క ఏడాదిగా పోగుచేసిన డబ్బు. ఈ విషయం తన భార్యకు కూడా తెలియకుండ జాగ్రత్త పడ్డారాయన. తన అభిమానాన్ని వ్యక్తం చేసేందుకు ఇంతకంటే మరో మార్గం కనపడ లేదు. ఇంతకన్న ఎక్కువగా గాని, మరోవిధంగా గాని తన అభిమానాన్ని ప్రేమను వ్యక్తం చేయటం చేతకాని వ్యక్తి తను. అట్లాగని ఏమీ చేయకుండా వూరుకునేందు కాయన మనసు అంగీకరించ లేదు. అందుకనే ఈ ప్రయాణం.

ఆయనకు తెలిసిన గుంటూరుకు ఇప్పుడు చూస్తున్న గుంటూరుకు గల తేడా ఆయన్ను ఆశ్చర్యంలో ముంచి వేసింది. రాజమ్మకూడా ఇట్లాగే మారిపోయిందా ఏం! అనుకున్నారాయన.

హోటల్లో సామాను పెట్టి తనకు తెలిసిన దార్లను గుర్తు చేసుకుంటూ కొత్త పేటకు నడిచి వెళ్లారు.

అదివరకటి రాజమ్మ హోటలు స్థానే ఒకపెద్ద భవనం వున్నది అక్కడ హోటలు వున్న గుర్తులేం లేవు. ఒకవేళ రాజమ్మ ఇక్కణ్నుంచి వెళ్లిపోయిందేమో నన్న ఆలోచన ఆయనకు మొదటిసారిగా స్ఫురిం చింది.

దగ్గర్లోవున్న ఒక కిళ్లీకొట్టువాణ్ణి అడిగారు, రాజమ్మ హోటలు గురించి.

'ఆ ఇల్లేనండి, ఆవిడ హోటలు ఎత్తేసి చాలా రోజులయింది. ఇప్పుడావిడ కొడుకు పుగాకు వ్యాపారం చేస్తున్నాడుగా'

అన్నాడు కిళ్లీకొట్టు ఆసామీ.

రావుగారిలో ఏదో తెలియని భయం ఆవేశించింది. ఒక క్షణం తటపటాయించారు. అయినా ధైర్యం కూడగట్టుకుని ఆ ఇంటికి వెళ్లి తలుపు తట్టారు.

ఒక కుర్రవాడు తలుపు తీసి లోపలికి వచ్చి కూర్చోమన్నాడు. లోపలికి వెళ్లి ఒక సోఫాలో కూర్చున్నారు రావుగారు. ఆ గది అంతా ఖరీదైన సామాన్లతో చాలా ఆధునికంగా అలంకరించబడి వుంది. ఆ వాతావరణం పరిశీలించిన మీదట ఆయనలో ఆవేశించిన భయం ఎక్కువైంది.

రాజమ్మ మనుమలు కాబోలు ఇద్దరు పిల్లలు వచ్చి ఆయనకేసి తదేక దీక్షగా చూస్తున్నారు. రావుగారు నవ్వటానికి ప్రయత్నించారు. వాళ్లను దగ్గరకు రమ్మని పిలిచారు. వాళ్లు ఏమీ మాట్లాడకుండా అట్లాగే చూస్తూ నిలుచుండిపోయారు.

'ఎవరు కావాలండీ' అన్న పిలుపు ఆయన్ను ఈ లోకంలోకి తీసుకు వచ్చింది. గుమాస్తానేమో అనుకుని రాజమ్మ నిలుచుని వున్నది.

రావుగారికి సమాధానం ఏమి చెప్పాలో తోచలేదు. పైగా ఆయన వూహించని ప్రశ్న ఇది. తనకు అఖండమైన స్వాగతం లభిస్తుందని, తనను చూడగానే రాజమ్మ 'మీరా! రండి, రండి' అని ఆశ్చర్యంతో ఆహ్వానిస్తుందని ఊహించారేగాని, ఇటువంటి ప్రశ్నకు సమాధానం చెప్పవలసి వస్తుందని అనుకోలేదు.

ఎదురుగుండా సాక్షాత్తూ రాజమ్మ నుంచుని వుంది. తను ఊహించిన రాజమ్మకు ఈవిడకు చాలా తేడా వుంది. నెరుస్తున్న జుట్టు, తెల్లటి చీర, వంటి నిండా నగలతో వున్న ఆవిడను చూసి రావుగారికి నోటమాట రాలేదు.

'ఎవరు కావాలండీ' అని ఆవిడే మళ్లా అడిగింది.

'అబ్బే, ఏం లేదు, మాది కాకినాడ, నేను ఇదివరలో ఇక్కడ పనిచేసిన రోజుల్లో మీ హోటల్లో భోంచేసేవాడిని, పనిమీద ఈ వూరొచ్చాను, వూరికే చూసి పోదామని...అంతే' అన్నారాయన.

'అట్లాగా, సంతోషమండి. ఏదో బోటి వారి దయవల్ల ఈ వాడిట్లా వున్నాం' అన్నది ఆవిడ.

తరువాత ఏం మాట్లాడాలో రావుగారికి తోచలేదు. ఆయన వూహించుకున్న సంభాషణ మర్చిపోయారు. ఆవిడ తనను గుర్తించిందో లేదో తెలియదు. గుర్తించి కూడా పాత జ్ఞాపకాలను గుర్తు చేసుకోకుండా వుండాలని ప్రయత్నిస్తోందా; అనేది అర్థం కాలేదు. జీవితంలో చివరిసారి తన ఓటమిని అంగీకరించక తప్పలేదు రావుగారికి.

రెండు నిమిషాలు భారంగా గడిచిపోయాయి.

'వస్తానండి' అని లేచారు.

వీధిలోకి వచ్చి నాలుగడుగులు వేసాక తను ఆ ఇంట్లో హాండుబాగ్ మర్చిపోయినట్లు గుర్తుకు వచ్చి వెనక్కు వెళ్లారు.

తను ఇందాక చూసిన ఇద్దరు పిల్లలూ తన సంచీలోని వేరుశెనక్కాయల పొట్లం తీసుకుని కాయలు పంచుకుంటున్నారు. ●



# వారఫలం

## 7-11-1969 శుక్రవారం మొదలు 13-11-1969 గురువారం వరకు

**మేషం :** అన్ని వ్యవహారాల్లోను మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వారం ఆఖరులో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**వృషభం :** ప్రతి వ్యవహారంలోను మీకు యేదో ఒక సందేహం కలుగుతుంది. వృత్తిలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. వారం ఆఖరులో రావలసిన డబ్బు సమయానికి అందగలదు. పాటివారితో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. పాటివారితో వాదప్రతివాదాలు తగవు.

**మిధునం :** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో యితరుల నిమిత్తం మీరు శ్రమకు గురి కాగలరు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

స్త్రీలకు:— సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**కర్కాటకం** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన కృషి చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు. వారం ఆఖరులో వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి ప్రోత్సాహకరంగా ఉంటుంది.

స్త్రీలకు:— బంధువులకు సహాయం చేస్తారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. అనుకూల వార్తలను వింటారు. వారం ఆఖరులో స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. ఇతరుల మీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు.

స్త్రీలకు:— దైవకార్యాలు నెరవేరుతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య :** మీ మంచితనమే కొన్ని వ్యవహారాల్లో అనుకూలతను సాధించ గలదు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం ఆఖరులో సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో సాటిలేని పోటీని యెదుర్కొని అభివృద్ధిని సాధించ గలరు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల :** అన్ని వ్యవహారాల్లోను అనుకూలమైన మార్పులు వస్తాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. వారం ఆఖరులో రావలసిన డబ్బు సమయానికి అందగలదు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విలాస వస్తువులు కొంటారు.

**వృశ్చికం:** కొన్ని వ్యవహారాల్లో మీరు శ్రమపడినా, ప్రయోజనం ఉండదు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. అధిక వ్యయం జరుగుతుంది. వారం ఆఖరులో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**ధనుస్సు** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు:— నూతన విషయాలను తెల్సుకొంటారు. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది.

**మకరం** వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుప గలరు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. పాటివారితో గౌరవం బాగా ఉంటుంది. వారం ఆఖరులో సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించ గలవు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు:— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. దైవకార్యాలు నెరవేరుతాయి.

**కుంభం :** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. అధికారుల వలన జరగ వలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది.

స్త్రీలకు:— నూతన విషయాలను తెల్సుకొంటారు. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**మీనం :** నమ్మినవారివల్ల ఇబ్బందులకు గురి కాగలరు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఆందోళన కలుగుతుంది. వారం ఆఖరులో వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. అలంకార వస్తువులు కొంటారు.

—మహేష్

# ఒకే ట్యూబుతో ఐదు రకాల ఫినిష్‌లు!

- వివిధోపయుక్తమైనది— ఒక ట్యూబును వివిధ అప్‌కొలైట్ బేస్ పెయింట్లతో వాడవచ్చును. వెంటనే మీకు వచ్చిన ఫినిష్‌లు— అద్దము వంటి మెరుగు, మందమైన మెరుగు, మేట్ (తళతళలాడని) మెరుగు, హేమర్, మెటాలిక్ వంటి ఫినిష్‌లు— వస్తాయి.
- వీటికి అప్‌కొలైట్ బేస్ పెయింట్లను ఎంచుకోండి: సింథెటిక్ ఎనామిల్, ఆక్రిలిక్ ఎమల్షన్, డెకోప్లాస్ట్ వాల్ ఫినిష్, సింథెటిక్ మేట్, హేమర్ మరియు మెటాలిక్ మరియు ఆక్రిలిక్ వాషెబిల్ డిస్టెంపర్.
- కావలసిన రంగు తక్షణమే తెచ్చేది మేజిక్‌టచ్.

## మేజిక్‌టచ్

కావలసిన రంగును తక్షణమే తెచ్చేది




ఎక్కడ రంగు కావాలెనో
అక్కడ
ఏషియన్ పెయింట్స్



**ఏషియన్ పెయింట్స్**

APE-AIYARS. A 19JA TEL




వెనకటికో అల్లుడు పోస్టులో వచ్చిన కార్డు చూసుకుని 'అయ్యో అంతమా ఇంతా యినా' అంటూ దుఃఖించాడట. అతగాడు దిద్దుకునేటప్పుడు 'మ' అక్షరం పలకంతా ఉండేది పాపం. పెద్దవాడయ్యాక చదువు సంధ్యలు వంటపట్టని ఆ అల్లుడు చిన్నప్పుడు దిద్దిన అక్షరం మాత్రం గుర్తు పెట్టగలిగాడు. అదికూడా అంత చిన్నది అయిపోవడం చూచి విచారించాడు. ఇంతకీ ఈ సంగతి ముందే చెప్పలేదట. కార్డు చూసి ఒకటే దుఃఖిస్తూంటే, ఏం దుర్వార్త ఉందో మనం ఏడవకపోతే బాగుండదని ఇంటిల్లిపాదీ ఏడుపు ప్రారంభించడంతో పొరుగింటాయన ఓదార్చడానికి వచ్చి 'ఏం నాయనా పెద్దవాడివి. అలా పసివాడిలా దుఃఖపడితే ఎలా? ఇంతకీ ఏమైంది?' అని అడగడంతో, 'అంత 'మా' యింతైందండీ' అని బాధపడ్డాట్ట.

చెప్పొచ్చేదేమిటంటే ఉత్తరాలు చదివే పద్ధతిలో చాలా రకాలుంటాయి. ఎప్పుడు మావారి దగ్గరనుంచి ఉత్తరం వచ్చినా మా అత్తయ్య 'ఏం రాశాడే' అంటూ ఎంతో ఉత్సాహంగా అడిగేది. రెండు ముక్కల్లో అక్కడంతా కులాసాట. ఇక్కడంతా ఎలా ఉన్నారని రాశారత్తయ్యా' అని క్లుప్తంగా బదులు చెప్పేదాన్ని. 'ఏం చోద్యమే, ఐదుపేజీల ఉత్తరంలో ఈ రెండుముక్కలూ రాశాడా ?' అని బుగ్గలు నొక్కుకునేది! ప్రేమలేఖలో ఏముంటాయో ఆవిడ కెలా చెప్పడం? ఇంపోసిబుల్. ఉత్తరాలు చదువుకోలేని వారికి, ఎదుటివారు ఎంత చదివి చెప్పినా తృప్తి ఉండదు— ఇంకా ఏదో అక్కడ రాసి ఉన్నది. చదివి వినిపించలేదన్న ఫీలింగు ఉండిపోతుంది. ఉత్తరం అందుకుని అటూ యిటూ తిరగేసి చూసి సంతోషిస్తారు. పడని అత్తా కోడళ్ళున్న కొంప అయితే కోడలి ఉత్తరాలన్నీ ఏ ఆడబడుచు చేతనో సెన్సారు చేయిస్తూనే ఉంటుంది అత్త!

ఉత్తరాలు అందుకునేవారి కెంత ఉత్సాహంగా ఉంటుందో కొందరు రాసేవారి కంత అశ్రద్ధ. పోనీ రాసినా ఏదో రెండు లైన్లు గీకి పడేసి దానికి ఓ పెద్ద సమాధానం వస్తుందని ఎంతో ఆత్రంతో ఎదురు చూస్తారు. ఉత్తరాలు మనం రాస్తూ ఉంటేనే మనకి వస్తూ ఉంటాయన్న చిన్న సత్యాన్ని గ్రహించలేరు వాళ్ళు. ప్రపంచ ప్రసిద్ధికెక్కిన లేఖా సాహిత్యం చదువుతూంటే—ఈ ఉత్తర




ప్రత్యుత్తరాలు ఎంత జాగ్రత్తగా సాగించవలసిన వ్యవహారమో అర్థం అవుతుంది.

సాహిత్యాని కెక్కగల ఉత్తరాలు కాకపోయినా సంసారపక్షంగా రాసుకొనే ఉత్తరాలకుకూడా ఒక స్థాయి ఉండాలి. అందుకొనేవారికి అవి ఎంతో ఆనందం కల్గించాలి. రాసినవారిని చూసినంత సంతోషం కల్గాలి. అంతేగాని నేఫా బోర్డరులో ఉంటూ 'వాకీవాళ బాగా జలుబుచేసింది' అని రాస్తే ఏం ప్రయోజనం ? ... ఆ ఉత్తరం రాసినవారికి అందే లోగానే ఆ జలుబు కాస్తా పోయి ఉంటుంది! కొందరు యావత్తు బాధలన్నీ ఏకరువు పెడతారు. కొందరేం రాస్తారో వారికే తెలియదు. 'అన్నట్టు' అంటూ ముఖ్యంగా తెలుపవలసిన విషయాన్ని చివర ఓ ముక్కలో కొట్టి పారేస్తారు!



ఉత్తరాలు వార్తాహారులు! వాటికోసం ఎదురుచూసే ప్రాణాల ఆత్రుత అనుభవించాలేగాని అర్థం చేసుకోలేం. వాళ్లాంటి రిప్లయి రాయని బద్ధకిస్టుకింకా ఉత్తరాలు రాసే స్నేహితులున్నారంటే వారి సహృదయత కది చిహ్నమేగాని మరేం కాదు (ఏమంటావు శ్యామలారాణీ ?) ఉత్తరాలు చిన్నవైనా పెద్దవైనా చదవడానికి ఉత్సాహంగా ఉండడం ప్రధానం. సంసారంలో సభ్యులు రాసుకునేవాటిలో సంగతులు తెల్పడం ప్రధానం కనుక అవి క్లియర్‌గా




తెల్పడం ప్రధానం. స్నేహితులు అభిప్రాయాలూ, ఆదర్శాలూ పంచుకుంటూ గాసిప్ రాసుకుంటారు కనుక ఛీకీగా రసవత్తరంగా ఉండాలి. అందుకే ఎప్పుడేనా నాకు ఉత్తరం వచ్చిందంటే అత్తయ్య 'దానికి ఉత్తరం వచ్చిందండోయ్' అంటూ మామయ్యదగ్గిర దండోరా వేస్తుంది — ఏమిటే విశేషాలు అంటూ వాలుకుర్చీలో వాలి చుట్ట ముట్టిస్తాడు మామయ్య. ఆ ఉత్తరం చదవడం ఓ గంట కాలక్షేపం అని తెలుసు మామయ్యకి! ●



ఉన్నవ విజయలక్ష్మి

**జరిగిన కథ:**

ముకుందం, సుందరం, ప్రకాశం, శకుంతల, శశి సుభద్రమ్మగారి సంతానం. పొలంమీద వచ్చే ఆదాయమూ, ముకుందం తెచ్చే కొద్దిపాటి జీతమూ వాళ్ళకి జీవనాధారం. జగన్నాథం ఆ కుటుంబానికి ఆప్తుడు. ముకుందానికి పెళ్ళి అవుతుంది. జగన్నాథం చనిపోవడంతో ఆయన కొడుకులు అప్పు తీర్చమని తొందరపెడతారు. సుందరానికి గొప్పింటి సంబంధం కలిసివస్తుంది. అతనికి రమణితో అట్టహాసంగా పెళ్ళవుతుంది. ప్రకాశాన్ని సుందరం దగ్గరుంచి మెడిసిన్ చదివించాలని యింట్లోవాళ్ళ అభిలాష. శకుంతల భర్త మోహన్ వుద్యోగం పోతుంది. ముకుందం అతనికి డబ్బు పంపిస్తాడు. ప్రకాశం కళ్యాణితో పరిచయం పెంచుకుంటాడు. శశి సారథితో తిరుగుతున్నదని ముకుందానికి తెలుస్తుంది. శశికీ సారథికీ అన్నివైపుల అంగీకారంతోనూ వివాహమైపోతుంది.

## 13

రెండునెలలు గడిచి పోయాయి —

ప్రకాశం పెళ్ళికి ముహూర్తం కుదిరింది ... రైలుఖర్చులు కాస్త ఎక్కువే అయినా హైదరాబాదు ప్రయాణం అందరికీ సరదాగానే వుంది— ఆ హడావిడి తనే ఎలాగో వీలుచేసుకుని చార్మినారూ, గోల్కొండ గండిపేట అన్నీ చూసేశారు— పెళ్ళి నిరాడంబరంగా క్లుప్తంగా జరిగినా ఆడపెళ్ళివారి అభిమానం మంచితనం చూస్తూంటేనే మొగపెళ్ళివారి మనస్సులు సంతోషంతో తృప్తితో నిండిపోయాయి—

మొగరాయుడులా కోడలు వుద్యోగం చెయ్యటం ఏమిటీ అని అంతక్రితం దాకా సుభద్రమ్మగారి మనసులో కాస్త గుబులులాంటిది వుండేది కాని ఆ అమ్మాయిని చూశాకమాత్రం అదంతా అడుగున పడిపోయి ఆ పిల్ల మంచితనంపట్లా వినయ విధేయతలపట్లా సదభిప్రాయమే కలిగింది ఆవిడకి—కొడుకు మనసుపడి చేసుకున్న ఆ అమ్మాయంటే ఆవిడకీ గారమే ఇప్పుడు—

గృహప్రవేశానికి వచ్చిన పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు మిగతా బంధువులూ అంతా వెళ్ళిపోయారు ...

ముకుందం కుటుంబం, సుభద్రమ్మగారు మాత్రం మిగిలిపోయిన ఆ ఇల్లు ఏమిటో వెలితిగా, బావురు మంటున్నట్లు అనిపించినా అందరి మనస్సులూ మాత్రం ఎంతో నిండుగా వున్నాయి.

'ఇంక నాకు ఏ చింతా లేదమ్మా — తమ్ముళ్ళూ చెల్లెళ్ళూ అంతా సుఖంగా వాళ్ళ బ్రతుకులు వాళ్ళు బ్రతుకుతున్నారు — ఇందులో నా ప్రయోజకత్వం ఏమి లేకపోయినా నా చేతులతో నేను వాళ్ళ అదృష్టాలని తీర్చిదిద్దినంత సంతోషంగా వుంది...' చెప్తూంటేనే ముకుందం కళ్ళు చెమర్చాయి ఆనందాతిరేకంతో.

'నయమే — నువ్వు చెయ్యక పోవటం ఏమిటి-నువ్వు పూనుకుని అన్నివిషయాలు చూడలేదా... ఇరవైఏళ్ళయినా నిండకుండా వుద్యోగంలోచేరి ఆ నాటినుంచీ ఈ సంసార భారం నెత్తిన వేసుకుని కష్టాలూ నిష్ఠూరాలూ భరించలేదా. ఇవాళ వాళ్ళంతా పెద్ద పెద వుద్యోగాలలో వున్నారంటేనూ అమ్మాయిలు అయినింటి కోడళ్ళు అవ్వారంటేనూ దానికి నువ్వుపడిన శ్రమకారణం కాదా.' సుభద్రమ్మగారి కళ్ళల్లో వాత్సల్యమూ గర్వం తొణికిసలాడాయి.

'లేదమ్మా నాదేంలేదు...అదంతా వాళ్ళ అదృష్టం — వాళ్ళ ప్రయత్నాలకి భగవంతుడు సహకరించాడు — వాళ్ళంతా పైకి వచ్చారు' అన్నాడు ముకుందం పైకి; కాని లోలోపల అతనికికూడ చెప్పుకోలేనంత గర్వంగానూ, సంతృప్తిగానూ వుంది.

* * *

మరికొద్ది రోజులు గడిచిపోయాయి — వైశాఖంలోనే ఎండలు పేల్చేయటం మొదలుపెట్టాయి — వాటి ప్రతాపానికి తట్టుకోలేనట్లుగా జ్వరంవచ్చి మంచం ఎక్కింది సుభద్రమ్మగారు—రెండుమూడు రోజులు గడిచిపోయాయి — టెంపరేచరు దిగజారలేదు — మందులు మార్చి మరింత శ్రద్ధగా చూడటం మొదలుపెట్టాడు. డాక్టరు—మరో రెండురోజులుకూడ గడిచాయి —

ఆఫీసుకి వెళ్ళబోతున్న కొడుకుని పిలిచి దగ్గర కూర్చోపెట్టుకుంది.

'ఇవాళ డాక్టరింకా రాలేదు—డిస్పెన్సరీలో పని ఎక్కువగా వుందేమో — నేను వెళ్ళేటప్పుడు మరోసారి చెప్పి వెళ్తాను—నేనూ త్వరగానే వచేస్తాను' అన్నాడు తల్లిచెయ్యి పట్టుకుని వేడిచూస్తూ.



'డాక్టరుసంగతి కాదులే — అరగంట పోయి. కాకపోతే మరోగంట పోయాక వస్తాడు—తొందరేం లేదు...కాని...ఏమిటో ఈ జ్వరం తగ్గి నేను మళ్లీ మామూలుగా తిరుగుతాను అన్న నమ్మకంలేదురా నాకు' దీనంగా తపనగా తనకళ్లల్లోకి చూస్తున్న తల్లిమొహం చూస్తూంటే ముకుందం కళ్లల్లో నీళ్లు తిరిగాయి—ఛ నేనుకూడ ఇలా అయిపోతున్నానేమిటి అనుకుంటూ, 'ఏమిటమ్మా ఈ వెర్రి — నాలుగురోజుల జ్వరానికే ఇలా బెంగపెట్టుకుంటారా ఎక్కడైనా' అంటూ తల్లికి ధైర్యంచెప్పాడు.

'నాకు బెంగేమీలేదు-పిల్లలంతా వృద్ధిలోకి వచ్చి సుఖంగావున్నారు-ఇలాంటప్పుడు సంతోషంగా వెళ్లిపోవటంకంటె నేను కోరుకునేదిమాత్రం ఏముంటుంది.'

'బాగుంది వేదాంతం—ఇంకా హైదరాబాదూ బొంబాయి వెళ్లి తమ్ముళ్ల సంసారాలుకూడ చూసిరావాలి — శశికీ, కళ్యాణికీ పుట్టిన పిల్లలని ఎత్తుకుని ఆడించాలి—అవన్నీ తీరకుండానే పరలోక చింతన పెట్టుకుంటే ఎలా' హాస్యధోరణిలో మందలించబోయాడు.

'హాస్యాలకేంగాని, ఏమిటో అందర్నీ ఓసారి చూడాలని వుంది—ఇవాళ నలుగురికీ నాలుగు కార్డులూ వ్రాసిపడేయి. అందుకే పిల్చాను.'

'ఉత్తరాలకేం భాగ్యం—ఓ అరగంటలో పోస్టు డబ్బాలో పడేయిస్తాను — నాలుగు రోజుల్లో అందరూ వస్తారు — అప్పటికి నువ్వు పథ్యం తిని కులాసాగా వుంటావు. మరేమీ ఆలోచించకు...ఏదీ పాపా—ఇలారా — అమ్మ పనిఅయి వచ్చేదాకా నువ్వు మామ్మదగ్గర కూర్చో అమ్మా — నీకు వచ్చిన కధలూ అవీ చెప్పు' అని తల్లికీ, కూతురికీ చెప్పి వెళ్లిపోయాడు.

మరో నాలుగురోజులు గడిచాయి. జ్వరం తగ్గలేదు సరికదా టైఫాయిడ్ అని తేల్చాడు డాక్టరు. ముకుందం వ్రాసిన వుత్తరం అందుకుని అవాళ వుదయమే వచ్చింది శకుంతల, అందరిలోకీ దగ్గరగా వుందికనక—మిగిలిన వాళ్లుకూడ ఒకటి రెండు రోజులలో వస్తారని అనుకుంటు న్నారు—అప్పటికీ రాకపోతే టెలిగ్రాములు ఇయ్యి అని చెప్పింది సుభద్రమ్మగారు—



ఆవిడ చాలా అధైర్యపడి పోతోంది—

ఆ అవసరం లేకుండానే మరో రెండు రోజులు గడిచేసరికి అందరూ వచ్చారు.

ఉదయం కాఫీలు అయి అంతా స్నానాలు అవీ చేసే హడావిడిలో వున్నారు—యశోద అప్పటికే స్నానం అదీ ముగించుకుని వంటపనిలో జొరబడి పోయింది — ఇంతమందికీ వంటా వార్పూ తన ఒక్కదానిమీదే పడింది - శకుంతలా శశీ అత్తవారిళ్లనుంచి వచ్చారు. తల్లిదగ్గర కూర్చుని ఖబుర్లుచెప్పటం ఆవిడకి మందులూ పళ్లరసాలూ ఇవ్వటానికి తప్పితే ఇంటిపని అప్పజెప్పితే బాగుండదు— రమణికీ కళ్యాణికీ అంతా కొత్త — కళ్యాణి అయినా కాస్త కల్పించుకుని అదీ ఇదీ చేస్తుంది కాని రమణి బొత్తిగా అంటీ ముట్టనట్లే వుంటుంది—పైగా చంటిపిల్ల చెయ్యి దిగదు కొత్తచోటు కావటం వల్ల ...

సుభద్రమ్మగారు కొడుకులనీ కూతుళ్లనీ పిలిచి దగ్గర కూర్చోపెట్టుకుంది—తమకేదో చెప్పాలని ఆవిడ తహతహ లాడుతోందని అందరూ గ్రహించుకున్నారు — అదేమిటయి వుంటుందా అన్నట్లు ఒకరి మొహాలు ఒకరు చూసుకుని చివరికి అందరూ ఆసక్తిగా తల్లిమొహంలోకి చూపులు నిలిపారు.

చూడండి—నేను పెద్దదాన్ని — మీ

# ఆశలూ—అనుభవాలూ

అందరి మంచి కోరేదాన్ని—నాకు న్యాయం అని తోచిన ఓ మాట చెప్పదలచుకున్నాను —అది మీకు ఇష్టం అయినా కాకపోయినా ఒకరిమీద ఒకరు ఎలాంటి కోపతాపాలు పెట్టుకోకుండా అంతా సఖ్యతగావుండాలి—నేను చెప్పింది ఆచరణలో పెట్టటమా మానటమా అన్నది మీరే ఆలోచించుకోండి—మీరయినా చిన్నవాళ్లేం కాదు.' బలహీనంగావున్నా సుభద్రమ్మగారి గొంతు స్థిరంగా, స్పష్టంగా వుంది... ఆ వుపోద్ఘాతం అంతా దేనికో ఎవరికీ అంతు చిక్కలేదు.

'చెప్పమ్మా — నీ మాట ఎప్పుడు కాదన్నాం — నువ్వు ఎలాంటి సంకోచము పెట్టుకోవద్దు — నువ్వు కోరిన విధంగానే నడుచుకుంటాం మేము—అయినా నీ కిప్పుడేమయిందని ... ఈ ఆప్పగింత లన్నీ ఎందుకు.' అన్నాడు ముకుందం తల్లి మంచానికి మరింతదగ్గరగా కుర్చీ జరుపుకుంటూ — సుందరం ప్రకాశం కూడ 'చెప్పమ్మా' అన్నారు — మంచంమీదనే తల్లికి చెరోప్రక్కా కూర్చున్న శకుంతలా శశీ గుడ్లంట నీరు కుక్కుకుంటూ 'ఏమిటమ్మా ఇది—నువ్వలా మాట్లాడుతూంటే మాకు భయం వేస్తుంది.' అన్నారు—ఇద్దరినీ చెరో చేతోను మృదువుగా నిమురుతూ అంది 'ఛ — భయం ఎందుకూ—అయినా మనం భయపడతామని బెంగపెట్టుకుంటామనీ, జరగవలసింది జరగక మానుతుందా—ఇంక—నేను చెప్పేదేమిటంటే, భగవంతుడి దయవల్ల మీ కెవ్వరికీ ఏ లోటూ లేదు, మిమ్మల్ని గురించిన ఎలాంటి బెంగా నాకులేదు—నాకు దిగులు అనేది ఏమయినావుంటే అదిఒక్క పెద్దన్నయ్యని గురించే — వాడివుద్యోగం అంతంత మాత్రందే — ఇంక పైకివచ్చే అవకాశాలయినా ఆట్టే లేవు— తక్కువ జీతానికైనా ఒప్పుకుని, ఇంటిపట్టునే వుండిపోయి ఈ సంసారం అంతా ఈదుకు వచ్చాడు— తను ఇబ్బందులు పడి అయినా మిమ్మల్ని సుఖపెట్టటానికి ప్రయత్నించాడు...'

'ఇప్పుడదంతా ఎందుకమ్మా' అన్నాడు ముకుందం, మిగిలినవాళ్ల ముఖకవళికలలో వస్తున్న మార్పు కనిపెట్టి...కాకపోయినా తను చేసిందేమిటో వాళ్లకి తెలియదా. ఇలా అందర్నీ కూర్చోపెట్టి మళ్లీ అదంతా చెప్పటం ఎందుకు అనిపించింది.

'కాదు చెప్పనీ — ఈ మాత్రం ఓపిక వుండగానే మనస్సులో మాట చెప్పుకోకపోతే ఆ తరువాత అసలు అవకాశం రాకపోవచ్చు—సరే వినండి—ఈ ఇంటి ఖర్చుల కోసం వాడు ఆఫీసులో అప్పు తీసుకోవలసి వచ్చింది — ఎలాగో తంటాలుపడి అప్పు తీర్చుకుంటాడు అనుకునేందుకు పెద్ద జీతంకాదు వాడిది...నేను ఒక్కటే అనుకుంటున్నాను—ఈ ఇల్లు పూర్తిగా వాడి పేర వ్రాయించేస్తే బాగుంటుంది—'

అందరూ తెల్లబోయారు ఒక్కసారి — వాళ్లు నలుగురూ మొహ మొహాలు చూసుకుంటూంటే ముకుందం తప్పు చేసిన వాడిలా తలవంచుకున్నాడు ... మే మెవరం లేనప్పుడు మెల్లిగా అమ్మకి నూరిపోసి ఇప్పుడు ఏమీ తెలియనట్లు ఆవిడ చేత చెప్పిస్తున్నాడా అని వాళ్లంతా అనుకుంటున్నారేమో అన్న భావం స్ఫురించి మరీ సిగ్గుపడి పోయాడు ... అమ్మ కిలాంటి అభిప్రాయం వున్నట్లు సూచనగా అయినా తనకి తెలియదనీ, వాళ్లతోపాటు తను కూడ ఇప్పుడే కొత్తగా ఈ మాట వింటున్నాననీ వాళ్లకి చెప్పాలనిపించింది ...

'ఇంటికి పెద్దవాడు — ఇన్నాళ్లూ



## ఆశలూ అనుభవాలూ

కష్టానికి నిష్ఠూరానికి మిమ్మల్ని కడుపులో పెట్టుకున్నవాడు—వాడికి ఆమాత్రం అయినా చెయ్యటం మీ విధి.' అంది మిగిలిన నలుగురినీ వుద్దేశించి.

'వాళ్ళు తీసుకోమన్నా నాకు ఇష్టం లేదమ్మా — నాన్నగారు ఇచ్చిపోయింది నిలుపుకోలేక అయినకాడికి పొలంఅంతా అమ్మేసుకున్నాం — ఇంక మిగిలిన ఈ ఇల్లు ఒక్కటీ వాళ్ళెవరికీ లేకుండా నేను ఒక్కణ్ణీ అనుభవించటం నావల్లకాదు' అన్నాడు ముకుందం తల్లి వంకే చూపులు నిలిపి—తల తిప్పి వాళ్ళవేపు చూడాలంటేనే అతని కెలాగో వుంది—'చాల్లే నాటకం—చేసిందంతా చేసి ఇప్పుడు ఏమీ తెలియనట్లు ఖబుర్లు చెప్తున్నావు.' అంటూ వాళ్ళంతా ఏవగింపుగా తనవంక చూస్తున్నట్లు ఆ చూపులు తనని నాలుగు వేపులనుంచి తాకి సూదుల్లా గుచ్చుకుంటున్నట్లు అనిపించింది.

ఎవ్వరూ మాట్లాడకుండా మళ్ళీ సుభద్రమ్మగారే అంది. 'నాకు తోచింది, నేను న్యాయం అనుకున్నదీ నేను చెప్పాను—మీరుకూడ ఆలోచించుకోండి—ఇప్పుడే ఈ క్షణంలోనే మీ సమాధానం కావాలని నే ననటంలేదు—'

ఇంతలో వీధి వరండాలో డాక్టరుగారి మాట వినిపించింది — ఆయన లోపలికి వస్తూంటే అంతా లేచి కాస్త దూరంగా నిలబడ్డారు—

కాస్పేపటిలో ఆయన ఎక్కడికో వెళ్ళాల్సివుందిట అందుచేత ఆవాళ బాగా త్వరగ వచ్చాడు—

ముకుందం టెంపరేచరు నోట్‌చేసిన కాగితం ఇస్తూంటే అందుకుని చూసి 'పరవాలేదు ఇలాగే వుంటుంది మరి' అన్నట్లు తల పంకించి, సుభద్రమ్మగారిని ఓసారి పరీక్షచేసి వెళ్ళిపోయారాయన...

ఆ తరువాత వాళ్ళ సంభాషణ మరి కొనసాగలేదు— ఆవిడకి మందు ఇచ్చి, దుప్పటి సరిగ్గా కప్పి ఎవరిపనిమీద వాళ్ళు వెళ్ళిపోయారు...

'ఏం చేయాలనుకుంటున్నారు—నేను చెప్పిన విషయం ఏమాలోచించారు' అని మళ్ళీ వాళ్ళని అడిగే అవకాశంకూడ ఆవిడకిరాలేదు—మర్నాటికే కాస్త తీవ్రంగా పరిణమించిన పరిస్థితి మూడోనాటికి పూర్తిగా చెయ్యిదాటి పోయింది...

సుందరం అయిదువందల రూపాయిలకి చెక్కు సంతకం పెట్టి అన్నగారి దగ్గిరికి తీసుకువెళ్ళాడు — తమ్ముడి కళ్ళల్లోకి ఆర్ద్రంగా చూశాడు ముకుందం 'వీడు వచ్చిన దగ్గిరనుంచీ మందులకీ పళ్ళకీ వేటికీ నేను తడుముకో అక్కర్లేకుండా అన్నీ తనే చూసుకుంటూ న్నాడు—ఇప్పుడుకూడ ఇంకేం ఫరవాలేదు అనుకుంటూ చెక్కు అందుకున్నాడు.

మాతృకార్యం జాగానే జరిపించారు.

* * *

'మీతో ఓ సంగతి మాట్లాడాలి' అన్నాడు ముకుందం. ఎవరిమట్టుకు వాళ్ళే ప్రయాణం అయి ఒకటి రెండు రోజులలో వెళ్ళిపోటానికి సిద్ధపడుతున్న తమ్ముళ్ళనీ, చెల్లెళ్ళనీ వుద్దేశించి—

రెండురోజుల క్రిందటే మోహన్ సారథీ వెళ్ళిపోయారు శలవలేదని—రమణి పుట్టింటికి వెళ్ళింది—తల్లి ఆరోగ్యం సరిగ్గా లేదని ఇంట్లో కాస్త సాయంగా వుండటానికి కళ్యాణి కూడ వెళ్ళిపోయింది. వచ్చిన చుట్టాలూ వెళ్ళిపోయారు...

'ఏమిటది?' అన్నట్లు చూశారు అంతా ఖబుర్లు మాని.

'షాపులో అప్పు తీసుకున్న విషయం అమ్మ మీకు చెప్పింది కదా—ఆట్టేరోజులు ఆగటానికి వీల్లేదని విశ్వనాథంగారు అప్పుడే చెప్పారు—అయినా ఇంతవరకూ ఏ ఏర్పాటు చెయ్యలేకపోయాను — అది త్వరగా తీర్చే మార్గం ఏదో ఆలోచించాలి.'

కొద్ది క్షణాలు ఎవ్వరూ మాట్లాడలేదు—ఆ తరువాత మొదట ప్రకాశమే అన్నాడు. 'ఆ రీసెర్చి స్కాలర్‌షిప్పు ఎంత వస్తుందో మీకు తెలిసిందే—నా దగ్గిర డబ్బు ఏమీలేదు—మీరే ఏదైనా ఆలోచించండి.'

వెంటనే సుందరం అందుకున్నాడు. 'నాకు పెద్ద వుద్యోగం వున్నమాట నిజమే—కాని, వచ్చిందానికి రెట్టింపు ఖర్చులు కూడ వున్నాయి—నే నెవరితో చెప్పుకుంటాను నా ఘోష...ఎలాగో క్రిందా మీదా పడి బ్యాంకిలో వెయ్యి రూపాయిలు జమ చేశాం. ఓ అప్పు తీరుద్దామనుకుంటూంటే

ఈ ప్రయాణం వచ్చింది—అంతా ఖర్చయి పోయింది. నువ్వే ఏదైనా ఆలోచించు.'

'బాగుంది—ఎవరిమట్టుకువాళ్లు అలా అంటే ఎలా—కనీసం సలహా అయినా చెప్పండి' అన్నాడు ముకుందం.

ప్రకాశం ఏమీ పట్టించుకోనివాడిలా విటో చూస్తూ కూర్చుండిపోయాడు—సుందరం ముఖం ముటముట లాడించు కున్నాడు ఒక్క క్షణం — ఆ తరువాత ఆవేశం తగ్గించుకుని సౌమ్యంగానే అన్నాడు 'నేనో సంగతి అడుగుతాను అన్నయ్యా. నువ్వేం కోపం తెచ్చుకోకు — నాన్నగారు పోయిన తరువాత, ఆ పదిహేను సంవత్సరాలలో పది ఎకరాల పొలమూ అమ్మేశావు—ఇంకా అప్పు మిగిలిపోయింది అంటున్నావు—ఇంత ఖర్చు ఎలా అయింది?'

'ఆ — అదే—ఉన్నమాట అడిగావు' అన్నట్లు వున్నాయి మిగిలినవాళ్లచూపులు—తన చెవులనే నమ్మలేకపోతున్నట్లు చూసింది యశోద.

కొద్దిక్షణాలు భ్రాంతిలోంచి తేరుకోలేనివాడిలా వింటూ కూర్చుండిపోయాడు ముకుందం—ఆ తరువాత 'చివరికి ఇదా మీరు నన్నడిగేది? ఏం ఖర్చులు వచ్చాయో నిజంగా మీకు తెలియనే తెలియదా—నేను దుబారా చేసి ఆస్తి పాడుచేశా ననుకుంటున్నారా లేకపోతే చాటుగా ఏమైనా దాచుకున్నానని అనుమానిస్తున్నారా ఏమిటి మీ వుద్దేశ్యం.' అని అడిగేయాలనిపించింది—కాని ఒక్కమాటా అతని గొంతు పెగలి రాలేదు—అయోమయంగా అందరి మొహాల లోకి చూస్తూండిపోయాడు.

సుందరమే అన్నాడు మళ్లీ: 'నా చదువయిపోయి ఎనిమిదేళ్లు అయింది—ఆ రోజు నుంచి నేను ఒక్క కానీ కూడ ఈ ఇంటి నుంచి తీసుకు వెళ్లలేదు...కాగా నాచేత వయిన సాయమేదో నేనే చేశాను.'

'నువ్వు చెప్పింది అంతా నిజమే సుందరం—ఈ పదిహేను సంవత్సరాలనుంచీ నేను జమా ఖర్చులు వ్రాసివుంచకపోవటం నా తప్పే—లేకపోతే ఇప్పుడు తడుముకోకుండా మీకు సమాధానం చెప్పగలిగివుండే వాడిని—అయినా ఇందులో ఎవరికీతెలియని ఖర్చులు మాత్రం ఏమున్నాయనే ధోరణిలో లెఖ్ఖలు వ్రాయటం అశ్రద్ధ చేశాను-చాలా పొరపాటే అయిపోయింది.' అన్నాడు అతని కళ్లల్లో నీరుజీరలు పేరుకుంటున్నాయి—తనకన్న చిన్నవాళ్లు తను పెంచి పెద్ద చేసినవాళ్లు తనని యిలా నిలదీసి అడుగుతారని ఇంత నిరభిమానంగా మాట్లాడగలరని అతను ఎప్పుడూ అనుకోలేదు—ఒక్క రక్తం పంచుకు పుట్టిన అయిదుగురూ కష్టం సుఖం మాట్లాడుకోవచ్చుననీ వ్యవహారం పరిష్కరించుకోవచ్చుననీ అతనీ ప్రస్తావన తీసుకువచ్చాడు—కాని వాళ్ల ధోరణి మాత్రం ఎంతో చిత్రంగానూ పాత పగ ఏదో తీర్చుకుంటున్నట్లుగానూ అనిపించిందతనికి — ఇంకా ఏదో అనబోతూంటే చటుక్కున ఓ విషయం స్ఫురించింది.

'అనాళ అమ్మ యింటి విషయం కదిపినప్పటినుంచి వీళ్లు లదోలా కాస్త ముభావంగానే వుంటున్నారు—ఆ వెంటనే ఆవిడ పోవటం ఆ గొడవలతో వీళ్ల వైఖరి అంతగా పట్టించుకోలేకపోయాను—హు—నిజంగా ఇల్లంతా తీసేసుకుంటానని నేను పేచీ పెడతాననే వీళ్లు అనుకుంటున్నారా—అందుకేనా నా మీద ఈ అక్కసు? ఒకవేళ వీళ్లు సంతోషంగా ఇస్తేనన్నా నాకు అఖ్ఖర్లేదు. పిత్రార్జితంగా వచ్చిన డబ్బు అంతా తలో కాస్త తీసుకోవాలి కాని నేను ఒక్కడ్నే అనుభవించాలనే ఆశ నాకెప్పుడూ లేదు......'

ఆ మాట పైకి చెప్దామనుకుని, మళ్లీ ఎవరి మనస్సులూ నొచ్చుకోకుండా ఎలా మాటలలో పెట్టాలా అని ఆలోచిస్తూంటే శకుంతల గబుక్కున అంది.

'వాళ్లకి చదువులు చెప్పించావు. మీకు పెళ్లిళ్లు చేశాను అంటావు—అంతేగా — ఉన్న పొలంలో మా వాటాకి రెండేసి ఎకరాలు వస్తాయి—అవి అమ్మగా వచ్చిన డబ్బుకంటె ఎక్కువ ఖర్చు పెట్టేశావా మాకోసం...'

ముకుందం వెన్నుమీద కొరడాతో ఛళ్లున్న చరిచినట్లయింది — ఆబాధ లోంచి అణచుకోలేని ఆవేశమూ వచ్చింది. ఇన్నాళ్లనుంచీ తనని అంటిపెట్టుకుంటూ వచ్చిన ఓర్పు శాంతమూ అన్నీ మాయం అయిపోయాయి—

'నిజమే—నువ్వుచెప్పింది నూటికి నూరుపాళ్లూ నిజమే — ఆ లెక్కని నాకూ ఓ రెండెకరాలు రావాలిగా—ఊ—సరే...ఇక నాకు జ్ఞాపకం వున్నంతవరకు ఖర్చులు చెప్తాను వినండి—నాన్నగారు పోయేసరికే అయిదువందల రూపాయిల అప్పు వుంది. ఆయన పోయాక మరో అయిదువందలు తీసుకుని ఆఖర్చు వెళ్లదీశాం—ఆ తరువాత చేతిలో డబ్బా అయిపోయింది. అప్పటికి నాకు వుద్యోగమూ లేదు అందుకే మరో అయిదువందలు అప్పుచెయ్యాల్సి వచ్చింది. సరే రెండేళ్లలో అది తీర్చాను—ఇంతలో సుందరం మద్రాసు చదువు వచ్చింది, నిజానికి వాడిని ప్రోత్సహించి పంపించింది నేనే—పొలంమీద ఏదోవస్తోంది, నాకూ వుద్యోగం వుంది ఫరవాలేదు అనుకున్నాను కాని వాటితో సరిపెట్టుకోటానికి వీలుకాలేదు—యాభయ్యి వందా, జగన్నాథంగారి దగ్గర తెచ్చేవాడిని—ఇంతలో శకు పెళ్లివచ్చింది



వుండండి; నేను చెప్పేది పూర్తికానివ్వండి మధ్యలో ఎవరూ మాట్లాడవద్దు...సరే రెండెకరాలు అమ్మేశాను. అయినా చాలలేదు మళ్ళీ జగన్నాథంగారి దగ్గరికే అప్పుకోసం బయలుదేరాల్సి వచ్చింది — ఆ తరువాత సంవత్సరం పొలం బాగుచేయించాల్సి వచ్చింది.

సుందరం చదువు పూర్తికాలేదు చేతిలో డబ్బులేదు—అయినా పొలం ఎందుకూ పనికి రాకుండా పోతుందని అప్పుచేసి ఆ ఎరువులూ అవీ ఏవో వేయించాను — ఇలా ఎప్పటికప్పుడు ఏవో ఖర్చులువచ్చి మీద పడుతూంటే ఏరోజు కారోజు అన్ని విషయాలూ అమ్మకి చెప్తూండే వాడిని — ఆవిడ సలహామేరకు నడుచుకోటమే కాని నేను స్వతంత్రించి ఎప్పుడూ ఏపనీ చెయ్యలేదు—చివరికి అదంతా తడిసి మోపెడవటం, జగన్నాథంగారు పోవటంతో ఆ డబ్బు వెంటనే కావాలని కొడుకులు కబురంపటం గత్యంతరంలేక మరో రెండెకరాలు అమ్మటం—సుందరం, నీక్కూడతెలును—ఆ తరువాత నీకు వుద్యోగం అయింది, కొన్నాళ్ళు ఇంటికి డబ్బుకూడ పంపించావు — తరువాత నీకూ ఖర్చులు పెరిగి ఏమీ పంపించలేక పోయావు—నీ పెళ్ళికి చేసిన ఎనిమిదివందల రూపాయల అప్పు మాత్రం నేను తీర్చాల్సి వచ్చింది—అంటే నా చేతిపామ్మేం పెట్టలేదనుకో... ఇంతలో గాలివాన రావటం పంట పూర్తిగా నష్టం

# ఆశలూ — అనుభవాలూ

కావటం ఇల్లు కూలిపోయే పరిస్థితిలోకి రావటం అందరికీ తెలిసిందే — అప్పటికే సగంపొలం హరించి పోవటంవల్ల రాబడి తగ్గిపోయినా తిండిగింజలకి లోపం వుండేది కాదు—ఆ ఏడు అవికూడ కొనాల్సివచ్చింది. ఎలాగో కిందా మీదా పడి ఇల్లూ బాగు చేయించాల్సి వచ్చింది—మరి ఆ డబ్బంతా ఎక్కడనుంచి వచ్చిందనుకున్నారు—అంతకు ముందే బావ వుద్యోగం మానేయడం, నేను డబ్బు పంపించటం మీకూ తెలుసు — ఆ నాలుగేళ్ళల్లోనూ వాళ్ళకి వెయ్యిరూపాయిలపైనే పంపించివుంటాను...ఇంకశకుంతల పురిటికి వచ్చిందంటే మనతోపాటు కలోగంజో పెట్టి, కలిగినంతలో పసుపూ కుంకం ఇచ్చి పంపించటంకాదు. యధావిధిగా వేడుకలూ అవీ కావాలి. శకుంతలకీ పిల్లలకీ ఓ సంవత్సరానికి సరిపడే బట్టలయినా కొని యివ్వాలి......'

'ఇప్పుడివన్నీ ఎందుకులెండి' అంది యశోద చటుక్కున కలుగజేసుకుని—'తల్లి చచ్చిపోయి నెలయినా కాకుండా అన్నదమ్ములూ అక్కచెల్లెళ్ళు ఇలా మాటలు పెంచుకుని గొడవలు చేసుకోటం ఎంత సిగ్గుచేటు. ఎవరైనావింటే అప్రతిష్ఠ కూడ' అనిపించింది.

'నువ్వూరుకో—నేనుమాత్రం ఏమంటున్నాను అడిగినమాటకి సమాధానం చెప్తున్నానంతే' అన్నాడు ముకుందం చిరాగ్గా.

'చెప్పనీ వదినా—మాకోసం అయినఖర్చు వివరాలు చెప్తున్నాడు అంతేగా— నాకు తెలుసు ఈ అయిదుగురు ఈ వూర్లోనే పుట్టారు. అదేగా నువ్వు చెప్పబోయేది.'

'చూడు వినూ నీ పిల్లలనీ చూసి నేనేం అసూయపడటం లేదు—మాట చెప్తున్నాను—నేను ఎన్నిసార్లో అమ్మతోకూడ చెప్పాను. మనం ఈ పద్ధతులను మార్చుకోవాలమ్మా మనం అప్పుల్లో మునిగి పోతూ వాళ్ళ అవసరాలూ, ముద్దుముచ్చట్లూ ఎంతకని తీర్చగలం అని — ఈసారికిలా జరిగిపోనీ అంటూ ఎప్పటికప్పుడే వాయిదా వేస్తూండేది—ఈ విషయాన్నీ మీరు కొంచెం అయినా అర్థం చేసుకున్నారా — ప్రకాశం చదువు మానేసి ఓ సంవత్సరం వుద్యోగంచేసి నాకు ఆసరాగా వున్నమాట నిజమే, ఆ తరువాతయినా వాడిచదువుకి నేను కానీ ఖర్చుపెట్టని మాట నిజమే—అయితే పెళ్ళికి ఏం జరిగింది—కట్నం పుచ్చుకోలేదుసరే నగలూ నాణాలూ పెట్టనూలేదు—ఎంతయినా కొన్ని ఖర్చులయినా వుంటాయిగా—ఎంత తక్కువలో కానిద్దాం అన్నా వెయ్యి రూపాయిలపైనే ఖర్చయింది—ఏం చేస్తాం శశి పెళ్ళికి అయిన అప్పుతోపాటే అదీ అనుకున్నాం మరి...సరే శశి విషయం...మనకి తగిన వాడినెవడినో చూసి ముడిబెట్టక ఇంత పెద్ద పరుగుపెట్టావెందుకు అని సుందరం ఆనాడే అడిగాడు. దానికి సమాధానం ఇప్పుడు చెప్తున్నాను ... కలక్టరుగారితో సంబంధం చెయ్యాలనీ హోదాగలవాళ్ళతో బంధుత్వం కలుపుకోవాలనీ ఆ సంబంధం చెయ్యలేదు—పరిస్థితులు అలా వచ్చాయి. కాత్యాయని కూడా వేవున్నా శశీ సారధి కలిసి తిరగటం చాలామంది కళ్ళపడింది. అక్కడా అక్కడా గుసగుసలు బయలుదేరాయి. వయస్సులోవున్న ఆడపిల్లని అదుపు ఆజ్ఞలలో పెట్టకుండా అలా వదిలేస్తే మన పరువు మర్యాదలేమయినా నిలుస్తాయా అని ఒకరిద్దరు నా మొహంమీదే అన్నారు—వాళ్ళందరికీ సమాధానాలు చెప్పుకోలేక నా తల్ప్రాణం తోకకి వచ్చేది. వాళ్ళన్న దాంట్లో తప్పులేదు—అమ్మ ఇంట్లో వుండికూడ అలాంటి పరిస్థితి వచ్చింది మరి......కనకరాజుగారి ధనదాహం తెలిశాక



# కేమెల్ సిరా దివ్యముగా ఉంటుంది! వీటిలో దేనినైనా ఎంచుకోండి




## కేమెల్ "స్పెషల్" సిరా

అడ్డు లేకుండా జారే యీ సిరా సరసమైన ధరకు లభిస్తోంది. ప్రతి రోజు వాడుకకు అది దివ్యముగా ఉంటుంది. అది త్వరగా ఆరిపోతుంది. పెన్ను మధ్యలో రాయడము ఆగిపోదు. మీ పెన్నులో కేమెల్ స్పెషల్ సిరా పోస్తే, రాస్తున్నప్పుడు పెన్నును విదిలించనక్కర లేదు. ఇంత మంచి సిరా అయినా దాని ధర సరసముగా ఉండడమే కేమెల్ "స్పెషల్" సిరా ప్రత్యేకత.




## కేమెల్ "డీ-లక్స్" సిరా

ఇది మా క్రొత్త తయారు. మీది ఖరీదైన పెన్ను అయితే, దానికి బాగుగా తగిన సిరా యిదే. ఈ సిరా అడ్డు లేకుండా జారుతుంది, త్వరగా ఆరిపోతుంది మరియు అది రాస్తూనే మీ పెన్నును శుభ్రపరుస్తుంది. అంతే కాదు, "డీలక్స్" మీ పెన్నుకు సంపూర్ణ రక్షణ నిస్తుంది. దానిని వాడితే పెన్ను చిన్న ముక్కలుగా ఊడదు. మీ టేబుల్ మీద కేమెల్ "డీలక్స్" సిరా బుడ్డిని పెట్టుకొనుట మీకు గర్వ కారణముగా ఉంటుంది. అది మీ టేబులుకు అకర్షణ నిస్తుంది. అది ఎంత సొగసుగా ఉంటుందో అంత నాణ్యమైనది కూడాను.

Vision 606 Tel.

ఇక శశికి ఇష్టం వున్నా లేకపోయినా ఎవడినో ఒకడిని తెచ్చి ముడిపెట్టేద్దాము అనిపించేది నాకూ అమ్మకీ — అయినా డబ్బుకి వెనక్కితీసి దాని గొంతు కోయటం మా వల్లకాలేదు—కారణం ఏమిటీ అంటే, ఏనాడయినా అతని చెవిని ఈ వూళ్లో వాళ్ల గుసగుసలు పడొచ్చు. నిజానిజాలు ఆలోచించకుండా అతను శశిని శంకించ వచ్చు—విడిచిపెట్టటందాకా రాకపోయినా దానిని హింసించి బాధపెట్టవచ్చు - ఇన్ని ఆలోచనలు వచ్చేవి. అందుకే సాహసించి ఆ సంబంధానికి వప్పేసుకున్నాం—మిగిలిన పొలం అంతా అమ్మేసినా పాత అప్పులు వడ్డీతోసహా తీర్చాక పెళ్లికి సరిపడే డబ్బు లేకపోయింది — అప్పటికప్పుడు విశ్వనాథంగారిని అడిగి తీసుకువచ్చాను ... ఇప్పుడు చెప్పండి — ఇందులో ఏ ఖర్చు నేను అనవసరంగా పెట్టాను ఎందులో దుబారాచేశాను.' నిలదీసి అడుగుతున్నట్లు గానే వుంది ముకుందంగొంతు.

'అంతడబ్బు ఏంచేశావు' అని వాళ్ల అడిగిన ప్రశ్నే అయినా దానికి అతను అంత విపులంగా నిర్మొహమాటంగా సమాధానం చెప్పేసరికి వినటానికి కటువుగానే వుంది. అందరూ మొహాలు గంటుపెట్టుకునే కూర్చున్నారు.

'నా పెళ్లిగురించి అంత పురాణం చెప్పావు—ఒక్కయ్య పెళ్లికీ బోలెడు ఖర్చు చేసి ఆ తరువాత దానికి పెట్టిందంతా కలుపుకుంటే నాకు ఇచ్చింది తక్కువే — సరే అయిందేదో అయిపోయింది - ఇంక మీ దగ్గరనుంచి ఒక్క కానీకూడ నాకు

# ఆశలూ అనుభవాలూ

అక్కర్లేదు — నాకు కావలసింది భగవంతుడే ఇచ్చాడు' అంది శశి ఉక్రోషంగా ముక్కు ఎగపీల్చుకుంటూ.

'నిజమే అది—పెళ్లిచేసి పంపించేశాక ఆడపిల్లలకి చీరా సారే పెట్టటం అన్నదమ్ములకి ఎంత కంటకింపుగా వుంటుందో ఇప్పుడే అన్నయ్య స్పష్టంగా చెప్పవే చెప్పాడు—ఇన్నాళ్లూ ఏదో అయిపోయింది — ఇంక. నేను ఒక్కదమ్మిడీ అయినా తీసుకోను' అంది శకుంతల కళ్లొత్తుడుచుకుంటూ.

ముకుందం ఆవేశం దిగజారి పోయింది. 'ఛ ఏమిటిది. నేను చేసిందేమిటి—నాన్నగారు లేకపోయినా మీకేం లోటురాగూ — మిమ్మల్ని నా కంటిపాపలలా నా ప్రాణంతో సమానంగా చూసుకుంటాను అని ఓదార్చిన నేను ఇవాళ ఎంతెంత మాటలని మీళ్ల మనస్సు గాయపరిచాను— నా బుద్ధి, వివేకం అన్నీ ఏమయి పోయాయి — ఈ ఆవేశాన్ని అదుపులోకి తెచ్చుకోకపోతే మనిషి బొత్తిగా రాక్షసుడులాగే ప్రవర్తిస్తాడు' అని లోలోపలే సిగ్గుపడుతూ.

'ఏదో అనేశాను. అదేం మనస్సులో పెట్టుకోకండి ... మరో విషయం—ఇంటి మాటేదో చెప్పింది అమ్మ—కాని నాకు ఒక్కనాటికి అలా జరగటం ఇష్టంలేదు—ఇది మనం అయిదుగురం తీసుకుందాం' అన్నాడు. వింటూన్న అందరి మొహాలలో మబ్బులుదిగి కళకళ లాడాయి—కాని అది పైకి కనిపించనీయకుండా ఎవరికివారే జాగ్రత్తపడ్డారు.

'మాకెందుకులే — ఇప్పటికే బోలెడు ఖర్చుఅయింది మాకోసం' అంది శకుంతల.

'నాన్నగారేవుంటే మీకింతకన్నా బాగనే జరిగేది...నా స్థానంలో మరొకరెవరైనా వుంటే సంసారం ఇంతకన్నా తెలివిగా చక్కదిద్దుకుని ఇంకా వృద్ధిలోకి తెచ్చేవారేమో. సరే అదంతా ఎందుకు మళ్లీ...మీ ఇద్దరికీ పసుపుకుంకాలకి ఇది నాన్నగారి ఆస్తిగా దే ఇస్తున్నాం...ఏం సుందరం—ఏమంటారు మీరిద్దరూ' అన్నాడు ముకుందం తమ్ముళ్ల నుద్దేశించి.

'అలాగే చేద్దాం—మాకు అభ్యంతరం ఎందుకుంటుంది' అన్నారు వాళ్లు.

'సరే ఇప్పుడు చెప్పండి—ఆ అప్పు ఎలా తీర్చటం' అన్నాడు ముకుందం మళ్లీ మొదటికొస్తూ.

కాస్సేపు తర్జనభర్జనలు జరిగినమీదట ఇల్లు అమ్మేయటానికి వచ్చిన డబ్బులో అప్పు తీర్చేసి మిగిలింది అయిదుగురూ తీసుకోటానికి నిర్ణయం జరిగింది—

ఆ తరువాత రెండుమూడు రోజులలో వాళ్లంతా వెళ్లిపోయారు.

ఇల్లు అమ్మాలని అనుకున్నదగ్గరనుంచీ యశోద మనస్సు ఎలాగో అయిపోయింది—చివరికి వుండబట్టలేక ఓ రోజు అంది: 'ఏమండీ, ఒక్కమాట చెప్తాను — ఏమీ అనుకోకండి—చివరికి నిలవ నీడకూడ లేకుండా చేసుకుంటున్నాం అనుకుంటుంటే నాకెంత బాధగావుందో చెప్పలేకపోతున్నాను ...వాళ్లు చెప్పినట్లు ఈ ఇల్లు మనం తీసేసుకుని ఎలాగోచూసి వాళ్లకి డబ్బు ఇచ్చేద్దాం...పిల్లలు గలవాళ్లం — ఈ ఆధారంకూడ లేకుండా చేసుకుంటే...'

భార్య గొంతు వింటూంటే ముకుందం కళ్లలో నీళ్లు తిరిగాయి. జాలిగ అభిమానంగా చూస్తూ అన్నాడు:

'పిచ్చిదానా—నాకు మాత్రం సంతోషంగా వుందనుకుంటున్నావా—కాని ఏం చెయ్యగలం —విశ్వనాథంగారి సంగతి అలావుంచి మన వాళ్లంతా సాధ్యమైనంత తొందరగా డబ్బు కావాలి అన్నట్లు మాట్లాడరు కదా—ఎక్కడ్నుంచి తెస్తాం — అప్పుచేసి తీర్చటం అన్న ఆలోచనే నేను రానివ్వటం లేదు—ఆ పేరు చెప్తేనే నా గుండెలు అదిరిపోతున్నాయి — ఇప్పుడయితే వాళ్లతో పాటు మనకీ అంతో ఇంతో డబ్బు చేతికి వస్తుంది. ఇల్లు కావాలి అని కూర్చుంటే



చివరికి అప్పులలో మునిగిపోయి ఈ డబ్బూ, ఇల్లూ రెండూ నిలుపుకోలేని వాళ్లం అవుతాం—మంచికో చెడ్డకో ఒక నిర్ణయానికి వచ్చాం—ఇది అలా జరిగిపోనీ.'

'స్వంత ఇల్లు ఎవరికో ధారపోసి అద్దె ఇళ్లల్లో అగచాట్లు పడాల్సిన స్థితి పట్టిందన్నమాట.' కొంగుతో కళ్లు వత్తుకుంది యశోద.

'ఈ ఇంటితో నాకంటె తనకే ఎక్కువ అనుబంధంవుంది.' అనుకున్నాడు ముకుందం—ఉదయం తొమ్మిదిగంటలకి వెళ్తే మళ్లీ రాత్రి దీపాలు పెట్టాకే తను యింటిముఖం చూడటం—రాత్రి భోజనంచెయ్యటం పడుకోటం, తెల్లవారి లేచిన దగ్గరనుంచి ఆఫీసుకి వెళ్ళే హడావిడిలో కాలకృత్యాలు తీర్చుకోటంతోనే సరిపోతుంది— యశోదకి అలాకాదు—పెళ్లి అయివచ్చిన దగ్గరనుండీ పుట్టింటికి వెళ్లివున్నదికూడ తక్కువే—అత్తవారింటికి కొత్తచోటుకు వచ్చాను అన్న భావం పెళ్లిఅయిన కొత్తలోకూడ కలగలేదు తనకి — ఎన్నాళ్లనుంచో పరిచయం వున్నదానిలా ఈ ఇంటికి ఈ పరిసరాలకి మాలిమి అయిపోయింది — పనిలేని సమయంలో ఒక్క క్షణం అయినా వూరికే కూర్చోకుండా ఎప్పుడూ ఇంటిని తీర్చిదిద్దుతూనే వుంటుంది—పండగలూ పర్వదినాలూ వస్తే వాకిలినిండా రంగవల్లులు తీర్చి దిద్దుతుంది — ఉన్న కాస్త పెరడులోనూ సపోటా, జామ, నిమ్మచెట్లు నాటింది — కూరపాదులు పెడుతుంది — ఇరుగు పొరుగులకి కూరలు పళ్లు పంచిపెడుతుంది— ఇన్ని చేసి ఇవాళ ఆ ఇల్లు శాశ్వతంగా వదిలి వెళ్లిపోవాలంటే ఎంత బాధగా వుంటుందో తను వూహించుకోగలడు—తనకిమాత్రం లేదూ—పైకి అలా ఏమీ పట్టించుకోనివాడిలా కనిపిస్తున్నాడు కాని లోపల గుండెలు పగిలిపోతున్నాయి... కాని ఏంచేస్తాడు... ఇటు చూడు, మనుష్యులే శాశ్వతం కానప్పుడు ఇంక ఈ నిర్జీవమైన ఇంటిమీద ఇంత మమకారం ఎందుకు నీకు' అన్నాడు అనునయంగా భార్య తల నిమురుతూ.

తరువాత కొద్దిరోజులలోనే యింటికి బేరం కుదిరింది—పద్దెనిమిదివేలకి — ఓ రోజు అందరూ వచ్చి ఆ రిజిస్ట్రేషన్ తతంగం పూర్తిచేసి అప్పు తీర్చేసి మిగిలింది తలో మూడువేలూ తీసుకుని వెళ్లిపోయారు.

(ఇంకా వుంది)

## రంగులరాట్నం




ఎలుగుబంటి అనగానే నల్లని భయంకరాకారం గల జంతువు మనకు గుర్తుకొస్తుంది. నిజానికి ఎలుగుబంట్లు అన్నీ నల్లగా ఉండవు. వూదారంగువి, స్వచ్ఛమైన మంచు వర్ణం కలవి కూడా ఉంటాయి.

ఎలుగుబంటి మాంసాహార వర్గానికి చెందినదే. కుక్కకు దగ్గిర బంధువే అయినప్పటికి ఇది రెండు వెనక కాళ్లమీద సులభంగా నిలబడగల్గుతుంది. మోకాలు నిర్మాణం, పాదం అంతా నేలకు ఆనడం మనలాగే ఉంటుంది. ఎలుగుబంటి అన్ని రకాల ఆహారం, ఆకులు, చెట్లువేళ్లు, పళ్లు, కాయలు గింజలు, పురుగులు, చీమలు, చెదపురుగులు చేపలు, కప్పలు, పక్షులు సీలుచేపలు, కొన్ని సందర్భాలలో మనుషులను కూడా తినగలిగేవిగా ఉన్నాయి. ఇవి ప్రపంచంలో చాలా ప్రాంతాల వ్యాపించి ఉన్నాయి. కాని ఆస్ట్రేలియా, న్యూజిలాండు, ఆఫ్రికాలలోమాత్రం లేవు. దక్షిణ అమెరికాలో ఉండే ఒక్కజాతి తప్పిస్తే అన్ని ఉత్తరార్ధగోళంలోనే ఉంటాయి [భూమధ్య రేఖకు పైన].

ఎలుగుబంట్లు ఆహారం సమృద్ధిగా లభించే కాలంలో సుష్టుగా తిని బాగా క్రొవ్వుతో బలిసి పోతాయి. చలికాలం ప్రవేశించినప్పుడు గుహలోనో గోయిలోనో దాగుండిపోతాయి. ఒకవిధంగా ఇది సమాధి. ఇలా ఆరునెలలపాటు ఉండిపోతాయి. ఈ కాలంలో ఆహారం సంపాదించకుండా శరీరంలో నిలవ ఉన్న కొవ్వుమీదనే జీవిస్తాయి. మళ్లీ ఎండాకాలం ప్రవేశించేనాటికి వీరసంగా బయట పడతాయి. ఇలా రావడానికే సుమారు 2 నెలలముందే పిల్లలు పెడుతుంది. (సుమారు రెండు) నిద్రపోతున్న తల్లిని అంటిపెట్టుకొని $1\frac{1}{2}$ నెలలు పాలు తాగుతూనే ఉండిపోతాయి. బొత్తిగా నిస్సహాయ స్థితిలో ఉన్న వీటికి శరీరం మీద వెంట్రుకలే ఉండవు. కళ్లు మూతలు పడిపోతాయి. ఎండాకాలం ప్రవేశంతో తల్లితో బాటు బయటకు వస్తాయి.

మనదేశంలో ఉండే ఎలుగు నల్లనిది. ఎక్కువగా చెట్లు ఎక్కగల్గుతుంది పుట్టతేనె, చెదపురుగులు దీని ఇష్టాహారం.

ఉత్తర ధృవ ప్రాంతాల్లో ఉండేఎలుగు స్వచ్ఛమైన మంచు వర్ణం కలిగి శత్రువుల కంటికి సులభంగా కనబడకుండా ఉంటుంది. చేపలను నీళ్లల్లో ఈది సులభంగా పట్టుకొంటుంది. అంతేకాక సీలు జంతువుల్నీ, ఇంకా అక్కడి నక్కలని కూడా తినివేస్తుంది. పూర్తిగా మాంసాహారి అయినా, ఎండాకాలంలో మిగతా ఆహారం లభ్యం కానప్పుడు గడ్డి కూడా తింటుంది. అడవి ఎలుగులకు చెట్లు ఎక్కడం ఎంత సునాయాసమో దీనికి నీటిలో ఈదడం అంత సులభం.

ఎలుగుబంట్లు భయంకరమైనవి. బలమైనవి. కాని అవాంతర, అనివార్య పరిస్థితులలో తప్ప మనిషి మీద పడదు. దాని నఖాలు చాల వాడి. కోరదంతాలు పెద్దవి. కూసుగా ఉంటాయి. పులి కూడా ఎలుగును చూసి భయపడి పారి పోతుంది. జాంబవంతుడు సింహాన్ని సంహరించడం మనకు తెలుసు కదా.

—జమ్మి కోనేటిరావు.

1969 దీపావళి కథల పోటీలో మూడవ బహుమతి రు. 550 పొందిన కథ

# కీలుబొమ్మలు

రంగధామ్

రామారావ్

ప్లాటుఫారమంతా తిరిగి తిరిగి చివరికి ఒక సిమెంటు బల్లమీద కూలబడ్డాను. రైలు రావడానికి ఇంకా ఒక గంటకుపైగా వ్యవధి వుందని తెలిసింది.

రైలు రానంతసేపూ రైలు ఎప్పుడొస్తుందాః అని ఆరటపడడం మనిషి స్వభావానికి ఒక నిదర్శనం.

మన జీవిత సమస్యల సారాంశమంతా ఆ రైలు రావడంమీదే ఆధారపడి వున్నట్లు కొట్టుకుపోతాం. జీవితంలో ప్రతి జరుగబోయే పని గురించి అలాగే ఆతృత ననుభవిస్తాం.





కాని తీరా అది జరిగాక మనకు కొత్తగా ఒరిగినదేముంటుంది? రైలువచ్చాక మనం థర్డుక్లాసు ప్రయాణీకులమని మరోసారి స్పష్టమైనట్లు, మన యథార్థ స్థితిని గుర్తుకు తెస్తుంది.

రెండు నెలల్రికితం సోమనాథం కలెక్టరుగా వస్తున్నాడని తెలిసినప్పుడు ఎంత సంబరపడిపోయాను! అదంతా తల్చుకుంటే నా మనసు అదోకలాగయి పోతుంది. ఆ చీకటి ఆవరించిన ప్లాటుఫారం బల్లమీద కూర్చుని, రైలుకోసం ఎదురు చూస్తూ గత రెండు నెలలుగా నాలో చెల రేగిన భావాలు నెమరువేసుకోసాగాను.

నా చిన్ననాటి స్నేహితుడూ, పైగా మా యింట్లోవుండి వారాలు చేసుకుని చదువుకున్నవాడూ, నాకు పై అధికారిగా వస్తున్నాడంటే నాకు ఎంత గర్వంగా వుంది! తాసిల్దారునీ, హెడ్‌ఎక్కౌంటెంటునీ, మనసులోనే ఉద్దేశించి, 'ఇహ చూసుకోండి మీ పని; మునపటిలా రోజూ నన్ను చీవాట్లు పెట్టగలరేమో చూద్దాం. కలక్టరు నావాడు. మీరే నా చుట్టూ 'రికమెండేషన్' కోసం తిరుగుతారు' అనుకున్నాను. నన్ను విమర్శించి, వెటకారం చేసి రోజూ అవమానించే కొందరు తోటి గుమాస్తాలకు ఈ సంగతి తెలియాలి. అప్పుడు వాళ్ల ఆట కట్టుతుంది.

నిజం చెప్పాలంటే, ఒక కొత్త ఆట వస్తువు కొనుక్కున్న కుర్రాడు తన తోటి పిల్లలముందు దానిని ఎంతగొప్పగా ప్రదర్శించి, ఘనతనూ, ప్రత్యేకతనూ పొందాలని ఎలా తహతహ పడిపోతాడో, అందరి ముందూ అలా గొప్పతనం సంపాదించాలనుకున్నాను.

అసలు ఈ సంగతి తెలిసిన దగ్గర్నుంచీ నా జాతకమే మారిందనుకున్నాను. ఈ పదేళ్ల సర్వీసులోనూ, ఎన్ని కష్టాలూ, అవమానాలూ ఎదుర్కొన్నాను! అందరికీ నన్ను చూస్తే లోకువే! నేనూ వాళ్లలాగ నా క్రిందవాళ్లమీద ధాం ధూం లాడుతూ పై వాళ్లని వంకర దండాలతో పలకరిస్తూ, నా గురించి నేను వున్నవీ లేనివీ డబులు చెప్పుకుంటూ, పనిచేసేది గోరంతైతే కొండంత ఆర్భాటం చేస్తూవుంటే సమర్థుడిక్రింద చెలామణీ అయ్యేవాణ్ణేమో. కాని తలవంచుకుని, నాపని నేను చేసుకుంటూ, ఎవరైనా పలకరిస్తే మర్యాదగా సమాధానమిస్తూ, ఆఫీసరు ఎన్ని మాటలన్నా, నా తప్పుకూ ఇంకొకళ్ల తప్పుకూ కూడా నన్నే తిట్టినా, తలవంచుకుని మౌనంగా వూరుకుంటూంటే నన్ను వట్టి అసమర్థుడిగా జమకట్టారు. అధికారుల తిట్లకూ, ఇంట్లోనూ బయటా అందరూ అనే నిష్ఠూరపు మాటలకూ ఏం జవాబు చెప్పాలో చాతకాక నోరుమూసుకు బ్రతుకుతున్నాను.

ఒకసారి ఆఫీసరుగారు నన్ను అన్న మాటలు విని ప్యూను గంగయ్య నాతో 'అలా ఊరుకుంటూ వచ్చేస్తారేమిటి సార్? గట్టిగా జవాబివ్వక, ఒకసారి గట్టిగా జవాబివ్వండి, రెండోసారి మీ జోలికిరాడు' అన్నాడు.

ఆరోజు ఆఫీసరుగారు గంగయ్యని పిల్చి 'ఏయ్! ఈ టేబిలు క్లీనుగా వుంచాలని తెలియదూ?' అని కేకలేసారు. దానికి గంగయ్య 'ఏయ్ అంటారేమిటిసార్! మేమూ మీలాటి మనుషులమే మాకు మానాభిమానాలున్నాయి ప్యూను ఉద్యోగానికి వచ్చామని అంత నిరసన పనికిరాదండీ. ఇలాంటి ఆఫీసర్ల నెంతమందినో చూసాను. ఏయ్‌గీయ్ అంటే పడేది లేదు' అన్నాడు. అతనలా ఎదురు తిరిగేసరికి ఆఫీసరుగారికే ఆశ్చర్యం కలిగింది. తను అన్నమాటలలోని తప్పు పట్టుకుని డబాయించేసరికి ఆయన నిరుత్తరుడయ్యాడు. కానీ ఎలాగైనా తనది పైచెయ్యి అనిపించుకోవాలని 'అంతవరకూ వచ్చిందీ?' అన్నారు కోపంతో.

దానికి గంగయ్య, 'మీ రనవసరంగా మాటలంటే పడాల్సిన కర్మ మాకేమొచ్చిందండీ సరిగ్గా చెప్పి పని చేయించుకోండి' అన్నాడు. ఆఫీసరుగారు మనసులో కుతకుత ఉడికిపోయినా, పైకి ఏమీ అనలేక వూరుకున్నాడు. అప్పటినుండీ ఆయన గంగయ్యకు మర్యాదగా పని చెప్పి చేయించుకోసాగాడు.

నేను అలా ప్రవర్తించలేను. అసలు ఎలాగ, ఎదురుజవాబు చెప్పడంతో అవతలివాడి మాటల్లోని తప్పును పట్టుకుని దులిపేసి, వాడిని నోరెత్తకుండా చెయ్యాలో నాకు స్ఫురించదు. ఎవరైనా నన్ను కేకలేస్తే, ముందర నాకు గొంతుక పెగల్దు; బుర్ర హఠాత్తుగా పని చెయ్యడం మానేస్తుంది; ఏం చెయ్యాలో, ఏమనాలో తెలియదు; వాళ్లన్నమాటలన్నీ నిజాల్లా కనిపిస్తాయి. నిజంగా నేనాక ఘోరమైన అపరాధం చేసినట్లు భావిస్తాను. అవతలి వ్యక్తితో 'బాబ్బాబూ! పొరపాటయిపోయింది. ఇంకెప్పుడూ ఇలా చెయ్యను' అనాలనిపిస్తుంది. కాని నోట్లో తడి ఆరిపోయి ఆమాటలుకూడా బయటికి రావు. అలాటిస్థితిలో ఏం జవాబివ్వగలను! అందుకే ఎవరేమన్నా మౌనంగా భరించడం అలవాటయి పోయింది.

అసలు ఎదురు జవాబిచ్చే ప్రయత్నాని నా మనసు తోడ్పడదు. ఈ లోపం ఎక్కడుందో నాకు తెలుసు. దానిగురించే రోజా నేను బాధపడుతూ వుంటాను. ఆ ఆలోచనే అహరహం నన్ను దహించివేస్తుంది.

తల్లిదండ్రులకు పిల్లలమీద ప్రేమ వుండడం సహజం. అందులోనూ ఒక్కగానొక్క కొడుకైతే మరీ గారాబంగా పెంచడం లోకసహజం; కాని ఆ గారాబమే మొతాదు ఎక్కువై కాబోలు, నన్ను వట్టి చాతకానివాడిక్రింద తయారుచేసింది.

ఇప్పటికి ముప్ఫై అయిదేళ్ల వయసు దాటినా బజారునుంచి సరుకులు సరిగా బేరంచేసి తేవడం నాచాతకాదు. నేను బజారుచేసిననాడు, ఇంటికి రాగానే మా శ్రీమతిచేత నానామాటలూ పడవలసి వచ్చేది. ధర ఎక్కువ పెట్టాననో, సరుకులు మంచివి తేలేదనో సాధిస్తుంది. కొందరు బలేగా బజారు చేస్తారు. కొట్టువాడు మనల్ని చూడగానే 'రండి రండి మీకు ప్రత్యేకంగా తాజాకూరలు చవకగా ఇస్తాను' అంటాడు. అలా అనగానే నేను నిజమనుకుని తిన్నగా వాడిదగ్గరకువెళ్లి,



వాడు చెప్పిన ధరకూ ఇచ్చిన కూరలు కొనుక్కుని చక్కావస్తాను.

వాడు అంత నమ్మకంగా మనమీద అభిమానం చూపించి పిలుస్తూంటే, అందులో మోసంవుందని ఎలాగనుకుంటాం! కాని ఒకసారి నా తోటిగుమస్తా భూతలింగం అలాంటి మాటలకే కరుకుగా జవాబివ్వడం చూసాను. అతను కొట్టువాడితో, 'తెలుస్తోందిలే ఆ కూరలమొహం చూస్తూంటేనే, అవి మూడురోజుల నాటివనీ, పుచ్చువనీ కనిపిస్తూనే వుంది. అలాటివి మాకంటగట్టితేనే మీరు బాగుపడతారయ్యా.' అని విస్మారమాడి, కొట్టువాణ్ణి నోరెత్తనియ్యకుండా చేశాడు.

కొట్టువాడు పెద్దమనిషి కాబోలు; అతని మనస్సు నొప్పించకూడదు అనుకునే తత్వంగల నాకు భూతలింగం అన్నమాటలు ఆశ్చర్యం కల్పించినా అందులో నిజం లేకపోలేదు అనిపించింది. తరువాత భూతలింగం నాతో, 'మీరు వాళ్ళమాటలు నమ్మకండి. వాళ్ళు వట్టి దొంగలు. మనకి టోపీవేసి, మోసంచేసి దోచుకోకపోతే అంతంత లాభాలెలా గడిస్తారు? వాళ్ళమేడలూ, ఇళ్ళూ, షోకులూ చూశారా? అవన్నీ మనడబ్బుతో వచ్చినవే.' అన్నాడు. నేను అలా ఆలోచించలేదు. నాకు ప్రపంచజ్ఞానం లేదనుకుంటాను.

అలా ప్రపంచజ్ఞానం లేకుండా నన్ను

# కీలుబొమ్మలు

పెంచిన మావాళ్ళమీద నాకు అప్పుడు కోపం వచ్చేసింది. నన్ను నలుగురిలోనూ సరిగ్గా తిరగనివ్వలేదు; ఢక్కా మొక్కీలు తిననివ్వలేదు; నా అంతట నేను స్వతంత్రంగా ఆలోచించుకునే అవకాశం ఇవ్వలేదు. నాకు బాగా గుర్తుంది. నాకు పెళ్ళయ్యేదాకా రోజూ మా అమ్మే నాకు తల దువ్వేది. నేను ఏ బట్టలు తొడుక్కోవాలో ఆవిడే నిర్ణయించేది. నన్నొక బొమ్మలా చూచుకుని, అన్నిసంరక్షణలూ నాకు తనే చేసేది. నిజానికి ఆవిడ ఋణం జన్మ జన్మాలకు తీర్చుకోలేదు.

కాని దాని ఫలితం ఏమిటి?

నేను బ్రతుకుతెరువుకోసం పాటుపడడం ప్రారంభించేసరికి, నాకు ప్రపంచం అంటే ఏమిటో తెలియదని స్పష్టపడింది. ఒకవేళ అప్పుడు తెలుసుకుని సరిదిద్దుకుందామన్నా అప్పటికే నాలో ఎన్నో పనికిమాలిన గుణాలు పేరుకుపోవడంవలన, అదికూడా అంత సులభం కాదనిపిస్తుంది. జీవన సంగ్రామంలో బలమున్నవాడిదే పైచెయ్యి; బలహీనుడు పైకి లేవలేడు. చిన్నప్పటి నుంచీ నేను ఏదికావాలంటే అది తెచ్చిపెట్టడం. ఎక్కడ ఏమైపోతానో అని నాతోటి కుర్రవాళ్ళతో కూడా ఆడుకోనియ్యకుండా బడి నుంచి తిన్నగా ఇంటికి రావాలని ఆదేశించటం; మంచిబుద్ధులూ మంచి మంచి అలవాట్లూ అవాలని నాలో కరుకుదనాన్ని బొత్తిగా మొలకెత్తనియ్యకుండా మావాళ్ళు వుంచడంతో, ఆఖరికి ఆఫీసులో ప్యూనుతో కూడా గట్టిగా మాట్లాడలేను, నేను.

కొందరుతోటి వుద్యోగులు నాకు పన్లు చెప్పేవారు. 'ఇదిగో ఈ కాగితం కొంచెం రాసిపెట్టు. నేను అలావెళ్ళి కొంచెం మావాళ్ళతో మాట్లాడివస్తాను.' అని నాకు వాళ్ళపన్లు అంటగట్టేవారు. నేను చెయ్యనని చెప్పడం చాతకాక సరేనని తలూపేవాణ్ణి. దానివలన నేను చెయ్యవలసిన పన్లు దెబ్బతిని, పై అధికార్లచేత మాట పడవలసి వచ్చేది. పై అధికార్లను మంచిచేసుకోవడం కొందరికి పుట్టుకతో అబ్బిన విద్య. అది నాకు చాతకాలేదు. నేనెప్పుడూ నా పని ద్వారానే, పై అధికార్లను మెప్పించాలని తాపత్రయ పడేవాణ్ణి, కాని అధికారికి కావలసింది ఆఫీసు పని కాదు. స్వంతపని, ఆయన పిల్లలకు ట్యూషన్ చెప్పడం, ఆయన ఇంటికి బజారు సరుకులు తెచ్చిపెట్టడంలాంటి పనులు చేసిపెట్టే వాళ్ళే ఆయన దృష్టిలో బాగా కష్టపడి పనిచేసేవాళ్ళు; తక్కినవాళ్ళు పనికిమాలిన వాళ్ళు.

ఆయన మెప్పు పొందడంకోసం, అలాటి పనులను చెయ్యాలని వుండేదిగాని దానికి ఎలా కల్పించుకోవాలో తెలియక ఊరుకునేవాణ్ణి. అందువలన ఆఫీసులోని పనంతా నా నెత్తిమీద పడుతూండేది ఒకొక్కప్పుడు. అంత చేస్తున్నా అనవసరంగా చీవాట్లు తినడమూ నావంతు అవుతూండేది.

ఈ కష్టాల బరువుతో క్రుంగిపోతున్న నాకు, అంధకారంలో ఆశాకిరణంలా, సోమనాథం కలెక్టరుగా వస్తున్నాడనే వార్త తెలిసింది. ఇంక భయం లేదనిపించింది.

నా పన్నెండో ఏడునుండి, నా పదెనిమిదో ఏడువరకూ నేనూ సోమనాథం, కలిసి చదువుకున్నాం. అతను చాలా బీద కుటుంబంనుంచి వచ్చాడు. వాళ్ళది ఏలూరుకి దగ్గరలోనున్న వట్లూరు అనే పల్లెటూరు. అతను చదువుకోసం ఏలూరు వచ్చి, హైస్కూలులో ఫస్టుఫారంలో చేరాడు. అందరి ఇళ్ళల్లోనూ వారాలు



C I B A Cosmetics






# రయ్‌మని వస్తున్నాయి బినాకా రాకెట్లు

పళ్లను తెల్లగా మెరిసేలా చేస్తాయి...

బినాకా జూనియర్ డీలక్స్ టూత్ బ్రష్షులను చూస్తే మీ పిల్లలు ఎగిరి గంతులువేస్తారు. అవి క్రొత్త రాకెట్ ప్యాకులో వస్తున్నాయి. అవి మూడేళ్ల పైబడిన పిల్లలకై ప్రత్యేకముగా తయారుచేయబడినవి. వాటి గుండ్రని నైలాన్ కుచ్చులు పిల్లల నాజూకైన యిగుళ్లకు హానిచేయవు.

బినాకా టూత్ బ్రష్షులు అన్ని వయస్సులవారికి తగినవి మరియు అందరికీ నచ్చుతాయి.

పెద్ద స్టాండర్డ్, డీలక్స్ మరియు షార్ట్ హెడ్, జూనియర్ స్టాండర్డ్ మరియు డీలక్స్, బేబీ స్టాండర్డ్ మరియు డీలక్స్.



బినాకా టూత్ బ్రష్షుల నైలాన్ కుచ్చుల చివర్లు గుండ్రముగా ఉంటాయి కనుక అవి యిగుళ్లను కోసివేయవు.

ULKA-CTB-61 TL

# కీలుబొమ్మలు

కుదుర్చుకుని భోజనం చేసేవాడు. అతని తండ్రి తను చదువు చెప్పించలేననీ, ఎక్కడైనా పాలంపని నేర్చుకోమనీ అంటే, సోమనాథం పట్టుదలగా చదువుకుంటానని చెప్పి, ఏలూరు వచ్చి, తనంతట తను కాస్త ఉపకారస్థులని పేరుబడ్డ పెద్ద వాళ్ల ఇళ్లకు వెళ్లి వాళ్లసహాయం అర్థించి, స్కూలుఫీజూ, పుస్తకాలూ, బట్టలూ మొదలైనవాటిని సమకూర్చుకుని చదువుకోసాగాడు. అతను వుండడానికి మాయింట్లో వసతి కల్పించాం.

క్లాసులో ఎప్పుడూ ఫస్టు వచ్చేవాడు సోమనాథం. ఇంటర్మీడియట్‌దాకా ఇద్దరం కలిసే చదువుకున్నాం. తరువాత, ఆనర్సు చదవడానికి వాడు విశాఖపట్నం వెళ్లిపోయాడు. ఆ తరువాత మేము కలుసుకోలేదు. ఆనర్సులో యూనివర్సిటీ కంతటికీ ఫస్టుగా పాసయ్యాడనీ ఏదో కాలేజీలో ట్యూటరుగా చేరాడనీ, తరువాత ఐ. ఏ. యస్ లో సెలక్టయ్యాడనీ విన్నాను.

అలా వాడు కలెక్టరయ్యాడు. నేను బి. ఏ. పాసయి ఎక్కడా వుద్యోగం దొరక్క చివరికి తాలూకాఫీసులో గుమస్తాగా చేరాను.

మా యిద్దరి జీవన స్రవంతులూ కొన్నాళ్లు కలిసి ప్రవహించినా, తరువాత వాడి జీవితం, పచ్చని చేల మధ్య ప్రవహించే పంటకాలువలాగ ప్రకాశిస్తే, నా జీవితం ఇసుక పర్రలో ఇంకిపోయిన బురదకాలువలా ఎందుకూ పనికిరానిదై పోయింది. వాడు కలెక్టరుగా సుమారు పదేళ్లు ఏవేవో వూళ్లుతిరిగాడు. అప్పటికి తాలూకాఫీసు గుమస్తాగా నా సర్వీసు పదేళ్లుదాటింది. నాకు నలుగురు పిల్లలు పుట్టారు. సంసార నిర్వహణకూడా చాలా కష్టంగా వుంది.

నేను చాలాసార్లు జాతకం చూపించుకున్నాను. నా జాతకం చూడగానే నాకు శనిమహాదశ నడుస్తూ వుందనీ అందువలన కష్టాలనుభవిస్తున్నాననీ చెప్తారు. మరొక రెండేళ్లలో గొప్ప దశ ఎత్తుకుంటుందని చెప్తారు. ఈ మాటలు ఎన్నో ఏళ్లుగా వింటున్నాను. భాగ్య రాజ్యాధిపతులు ఎంతో శ్రమపడి నన్ను మహారాజుని చెయ్యాలని చూస్తున్నా ఆ శనిగాడు మాత్రం అటువంటిదేదీ జరుగకుండా అడ్డుపడుతున్నట్లు కన్పిస్తోంది. ఈ జీవితానికి ఏ విధమైన అభివృద్ధి! ఎదుగూ, బొదుగూ, వున్నట్లు లేదు.

నన్ను ఎప్పుడూ పలకరించి ఓదార్చేవి, నా ప్రియతమమైనవి ఆఫీసుఫైళ్లే. నా దైనందిన కష్టాలు మర్చిపోవడానికి ఆ ఫైళ్లలో తలదూర్చి పొద్దున్న పదినుంచి సాయంకాలం ఏడు గంటలదాకా గడిపేసేవాణ్ని. జీవంలేని ఆ కాగితాలు, జీవంవున్న మనుషులలా కరుకుమాటలాడి మనసుని నొప్పించలేవు. ఇంట్లో ఎన్ని చికాకులు వున్నా ఆ ఫైళ్లముందు కూచుని అన్నీ మర్చిపోయేవాణ్ని. మనుషులు నాయెడల నిర్దయగావున్నా అవిమాత్రం నన్నునిరాదరించవు. నా తలిదండ్రులు గారాబం పేరుతో నన్ను వట్టి చాతకాని వాణ్ని చేశారు. నాభార్య నన్నొక అసమర్థుడి క్రింద జమకట్టి ఎప్పుడూ సాధిస్తుంది. ఆఫీసులో అధికారులచేత రోజూ చీవాట్లు పడడమే నా బ్రతుకయి పోయింది. ఆఖరికి భగవంతుడు కూడా నన్ను నిర్దయగా వదిలిపెట్టేశాడు. ఎన్నివిధాల అతని అనుగ్రహం కోసం ప్రాకులాడినా అది అందని ద్రాక్షపండే అయింది.

ఇంత నిస్సారమైన జీవితాన్ని అనుక్షణం ఎదుర్కొంటూ, దానిని సవ్యంగా ఎదుర్కొనే సమర్థత లేకపోవడం వలన కలిగేబాధ ననుభవిస్తూ, ఇక బలవంతంగానైనా ఈ జీవితాన్ని అంతం చేసుకోవాలి అనే నిశ్చయానికి వస్తున్న సమయంలో, సోమనాథం మాకు కలెక్టరుగా వస్తున్నాడనే వార్త తెలిసింది. మోడైన మనసు ఆశలనే చిగుళ్లు వేసింది.

అతను ఛార్జి పుచ్చుకున్న పదిరోజులకు నేను అతన్ని కలుసుకునే అవకాశం లభించింది. నా ఫైలొకటి చూపించడానికి అతని వద్దకు వెళ్లాను. ప్యూను నన్ను అతని ఆఫీసుగదిలోకి ప్రవేశపెట్టాడు. అతని ఆఫీసుగది విశాలంగా వుంటుంది. దానిలో మధ్యన ఒకటేబిలూ, ఆ టేబిలుకి అతను కూర్చునే వైపున ఒక కుర్చీ, రెండోవైపున నాలుగు కుర్చీలూ వున్నాయి. పైన 'ఫాను' తిరుగుతోంది. తెల్లని పాంటుమీద ముదరు ఆకు పచ్చరంగు

కోటువేసుకున్నాడు. నల్లగా సన్నగా వుండే మనిషి. చిన్నప్పటిలాగే జుత్తు మొహం మీద పడుతోంది. నేనతన్ని చూస్తూ అతను నాకేవిధంగా స్వాగతమిస్తాడో అనేక సార్లు అనేకవిధాలుగా నే నూహించుకున్నవి జ్ఞాపకం తెచ్చుకున్నాను. 'హల్లో! మూర్తీ! ఎన్నాళ్లకు కలుసుకున్నాం!' అని కావిలించు కుంటాడేమో; లేకపోతే ముభావంగా, 'ఏం మూర్తీ! కులాసాగా వున్నావా?' అంటాడో, నేను కలెక్టర్నని మర్చిపో. మనం చిన్ననాటి స్నేహితుల మని జ్ఞాపకముంచుకో అంటాడో అనుకునే వాణ్ని.

గదిలోకి అడుగుపెట్టి అతని టేబిలు వైపు ఒక్కొక్క అడుగూ వేస్తూంటే, నా హృదయంలో ఎన్నో శబ్దాలు వినిపించ సాగాయి. అతను నావైపు చూడటం లేదు. తలవంచుకుని ఆఫీసు ఫైళ్లను చూస్తున్నాడు.

దగ్గరగావెళ్లి టేబిలువద్ద నించున్నాను ఒక్కొక్కక్షణం ఒకొక్కయుగంలా వుంది. ఎప్పుడు నా వంక చూస్తాడా? ఎప్పుడు నన్ను గుర్తుపడతాడా? అని ఆత్రుతగా ఎదురు చూస్తున్నాను. నేనే పలకరిద్దామా—అనుకున్నాను. కాని, ఎంతైనా అతను అధికారికదా—!

అతను నావైపు తలెత్తి చూశాడు. ఆ చూపులో ఏ విధమైన ఆత్మీయతా లేదు. కలెక్టరు ఒక గుమస్తాను చూసినట్లుంది ఆ చూపు.

జీవితంలో ఉన్న తమాషా ఏమిటంటే, నువ్వు భవిష్యత్తు గురించి వెయ్యి విధాలుగా ఆలోచించినా సరే, జరిగేది మాత్రం ఈ వెయ్యిరకాలుగానూ కాక, వెయ్యొన్నొకటో విధంగా వుంటుంది.

నేను తెచ్చిన ఫైలుచూసి, 'సరే, నువ్వెళ్లు' అన్నాడు. ఆ అనడం కలెక్టరు అన్నట్లుందిగాని, నా స్నేహితుడు సోమనాథం అన్నట్లు కాదు.

అంతే! నాకు దానిఅర్థం బోధపడింది. అతను నన్ను గుర్తించ దల్చుకోలేదు.

గది బయటికివచ్చి కొద్ది క్షణాలు నిలబడ్డాను.

వర్షం కోసం అలమటించి పోయిన రైతు; ఆకాశంలో మేఘాన్ని చూడగానే పొంగిపోతాడు. అతని హృదయం ఆనందంతో గంతులేస్తుంది. సోమనాథం వచ్చినప్పుడు కూడా నా హృదయం అలాగే గంతులేసింది. వర్షిస్తుందన్న మేఘం, వర్షించకపోతే రైతుకు ఆశాభంగం కలగడం సహజం. కాని దానికన్నా బాధాకరమైనది మరొకటుంది, వర్షం కురిపిస్తుందన్న మేఘం తనతో ఉరుముల్నీ మెరుపుల్నీ తోడుతెచ్చుకుని పెనుతుఫాను సృష్టించి, పొలాల్ని నీటిలో ముంచేస్తే రైతుకెంత కష్టంగా వుంటుంది! పొలంలో నీళ్లు మొలలోతున్నాయి. ఇక ఈ ఏటికి పంట సున్నాయే...అన్నబాధతో రైతు పరిస్థితి ఎంత హృదయ విదారకంగా వుంటుంది.

సోమనాథం రాక నాలో పెనుతుఫాను సృష్టించి, దుఃఖవర్షంతో నా ఆశలపంటను పూర్తిగా నాశనం చేసింది. ఇక ఈ జీవితానికి మంచిరోజులు సున్నాయేనని పించింది.

ఆశలన్నీ తుడుచుకుపోయాయి. నాదొ

స్నేహితుడూ మాయింట్లో వారాలు చేసుకు చదువుకున్నవాడూ నన్ను నిర్దయగా పొమ్మన్నాడు. కనీసం నన్ను గుర్తించినట్లు చిరునవ్వైనా నవ్వలేదు ఎంత పొగరొచ్చింది! అందుకే నడమంత్రపుసిరి అంటారు పెద్దలు. తను ఏవిధంగా పైకి వచ్చాడో, నేనూ మావాళ్లూ అతని కేవిధంగా ఆశ్రయమిచ్చి సహాయంచేశామో మర్చిపోయాడు. చిన్నప్పుడు వాని కొంచెం చిరుగుపట్టిన లాగులు అమ్మ అతనికి ఇస్తూండేది. నేను కొంచెం బొద్దుగా వుండేవాణ్ణి. నా లాగులు వాడికి వదులైతే వాటిని సరిచేయించడానికయ్యే ఖర్చుకూడా ఇచ్చేది మా అమ్మ. అలా మావాళ్లచేత ఆదరించబడ్డ సోమనాథం, ఇప్పుడు కలెక్టరవటంవల్ల నన్ను గుర్తించడం మానేశాడా!

అసలు నా గ్రహస్థితిని నిందించుకోవాలిగాని, సోమనాథాన్ని అంటే లాభమేముంది? నా రోజులు బాగులేకపోబట్టి, నా స్నేహితుడు కలెక్టరుగావచ్చికూడా నాకు లాభం లేకపోయింది. ఆరోజు రాత్రి నాకు తిండి సహించలేదు.

తరువాత నెలరోజులు నా జీవితం అంధకార బంధురంగా గడిచింది. ఇంతలో ఈ ప్రయాణం తగిలింది.

నా ఆలోచనల కంతరాయంగా రైలుకి లైన్ క్లియర్‌గంట కొట్టారు.

మరొక అరగంటలో రైలు వస్తుంది.

ఆరోజు సంఘటనలు జ్ఞాపకంవచ్చాయి.

మామయ్యకి వంట్లో బాగులేదన్న విషయం కొద్దిరోజులుగా నాకుతెలుసు. వారం రోజుల క్రితం వచ్చిన ఉత్తరంలో మామయ్య పరిస్థితి చాలా ఆధ్వాన్నంగావుందనీ, కింగ్ జార్జి హాస్పిటలులో చేర్పించామనీ రాసివుంది. నేనువెళ్లి మామయ్యను చూడాలనుకుంటూండగానే మరో వుత్తరమూ, టెలిగ్రామూ వచ్చాయి.

మధ్యాహ్నం రెంటిండికి ప్యూను గంగయ్య రెండు టెలిగ్రాములు తెచ్చి, ముందర ఒకటి నాచేతిలో పెట్టాడు: దాని కవరుపై పేరుచూసి 'ఇది నాదికాదయ్యా' అన్నాను.

'అయితే మీది యిది సార్' అని మరొకటి నా చేతి కిచ్చి 'అది కలెక్టరుగారి సొంత టెలిగ్రాం. యిప్పటికి

# కీలు బొమ్మలు

నాలుగు టెలిగ్రాములు వచ్చినా, ఒక్కటీ చింపి చూసుకోడానికి ఆయనకు తీరుబాటు దొరకటం లేదు. అమ్మగారిదగ్గరకే వెళ్తున్నాయి. రేపు ముఖ్యమంత్రిగారు వస్తున్నారని తెగ'బిజీ'గా వున్నారు' అంటూ టెలిగ్రామ్ తీసుకుని వెళ్లిపోయాడు.

నాకు వచ్చిన టెలిగ్రాములో మామయ్య మరణశయ్యమీద వున్నాడనీ, నన్నువెంటనే బయల్దేరి రమ్మని అందులోవుంది. వెంటనే బయల్దేరితే తెల్లవారేసరికి విశాఖపట్నం వెళ్లొచ్చుగాని తాసిల్దారుగారి దగ్గర సెలవు మంజూరు చేయించుకొని బయల్దేరేసరికి రైలు అందుతుందన్న ఆశపోయింది. ఇంటికివెళ్లి మా శ్రీమతి కీ విషయం చెప్పాక, ఒక్కమ్మడిగా మాకొచ్చిన కష్టాలనన్నిటినీ తల్చుకుని, ఈ ప్రయాణానికి అయ్యే ఖర్చునీ, దానివలన వచ్చే నష్టమూ చర్చించి ఏమైనా వెళ్లక తప్పదనీ, తక్కిన విషయా లెలా వున్నా బాంధవ్యాలూ, అనుబంధాలూ మాత్రం విస్మరించడానికి వీలులేదనీ, ఖర్చుతగ్గడానికి నేనొక్కడినే వెళ్లివస్తే చాలుననీ నిర్ణయించుకున్నాం.

బండి వస్తున్నట్లు కన్పించింది. అప్పటికీ రాత్రి రెండుగంటలయింది: బండి ఏలూరు ప్లాటుఫారముమీద కొచ్చేసరికి మరొక పది నిముషాలయింది బండి ఆగాక, ఎలాగో అతికష్టంమీద థర్డుక్లాసు కంపార్టుమెంటులో కూచునే జాగా సంపాదించగలిగాను.

మర్నాడు సాయంకాలం అయిదు గంటలకి, బండి వాల్తేరుస్టేషను చేరింది, ప్రయాణమంతా కునికిపాట్లలోనే గడిపాను.

రైలుదిగి, స్టేషనునుండి తిన్నగా హాస్పిటలుకే బయల్దేరాను. నాకు రాసిన వుత్తరంలో వివరాలన్నీ రాశారు కాబట్టి మామయ్య ఎక్కడుండేదీ కనుక్కోవడం సులభమే నేను హాస్పిటలు జేరుకునేసరికి ఆరుగంటలయింది.

తమ ఆప్తుల్ని చూడడానికి వచ్చిన వాళ్లు కొందరు తిరిగి వెళ్తున్నారు. 'సర్జికల్' వార్డు ఎక్కడుందో కనుక్కుని అక్కడికి బయల్దేరాను. దారిలోనున్న వార్డులలో ఎన్నో మంచాలు వరుసలూ వాటిమీదనున్న రోగుల ఆకారాలూ కన్పిస్తున్నాయి. వీరంతా జీవన్మరణాల మధ్య ఊగిసలాడుతున్నారు.

సర్జికల్ వార్డులో, ముందున్న వరండాలో ఒక టేబిలువద్ద ఒక నర్సూ, మరొక యువకుడూ మాట్లాడుకుంటున్నారు నన్నుచూడగానే నర్సు, 'ఏమిటి?' అన్నట్లు నావైపు చూసింది, నా చేతిలోనున్న సంచీనిబట్టి గాబోలు నేను పరాయి వూరునుంచి వచ్చినట్లు తెలుసుకుంది.

నేను మామయ్య పేరూ, జబ్బూ మొదలైన వివరాలు చెప్పి అతనికోసం వచ్చానని చెప్పాను. నేనుచెప్పిన వివరాలు విని ఆ వ్యక్తి ఆ వార్డులో లేడని అంది. నాకు వచ్చిన వుత్తరం మాచిన్నామనుకున్నాను గాని, ఆ వుత్తరం కన్పించలేదు. నాతోపాటు గ్రహించిన నర్సు 'మీరెక్కడనుండి వస్తున్నారు?' అని అడిగింది.

'ఏలూరు' అని చెప్పాను.

'అయితే మీకోసమే గాబోలు 13 వ నెంబరు బెడ్డుమీదనున్న రోగి కలవరిస్తున్నాడు. అతన్ని చూస్తారా?' అంది. బహుశా అతను మామయ్యే అయివుండవచ్చుననీ, నర్సు పొరబడిందేమోననీ అనిపించి తలూపాను.

నర్సు నన్ను వార్డులోపలికి తీసికెళ్లింది. పదమూడవ నెంబరు బెడ్డుదగ్గరకు వెళ్లగానే మళ్లీ ఆశాభంగం కలిగింది. ఆబెడ్డుమీదనున్న రోగి చాలా ప్రమాద పరిస్థితిలో వున్నట్లు కన్పిస్తుంది మొహం ఉబ్బివుంది, అరమూసిన కన్నులతో చూడలేకపోతున్నాడు. విపరీతంగా ఆయాసపడుతున్నాడు. ముక్కులోంచి రబ్బరుగొట్టం ద్వారా ప్రాణవాయువు పెక్కిస్తున్నారు. కాలికి కట్లు వున్నాయి. అతను మామయ్య కాడు. ఆవిషయం చెప్పేసి వెంటనే తిరిగి వెళ్లిపోదామనుకున్నానుగాని, ప్రక్కబెడ్డుమీద రోగి అన్నమాటలు నాకాళ్లు కదలకుండా చేశాయి.

'వచ్చారా! మీకోసం రెండురోజులనుంచీ ఆ వ్యక్తి ఎలా కొట్టుకుపోతున్నాడో చెప్పలేం. పాపం! తీరా మీరు వచ్చేసరికి మిమ్మల్ని గుర్తుపట్టలేని స్థితిలో వున్నాడు' అన్నాడు. సుమారు ఏభైఏళ్ల వయస్సులో వున్నాడు. అతని మొహంలో జాలీ, సానుభూతీ, ప్రేమా నిండివున్నట్లు

కన్పిస్తోంది: ప్రాణాల్లాడుతూంటే, అతని కళ్లు చెమరుస్తున్నట్లుంటాయి. జుట్టు పండిపోయి వుంది. కాలికి కట్టువుంది. తక్కిన మనిషంతా బాగానే వున్నాడు.

అతను తప్పు అభిప్రాయంలో వున్నాడనీ, నేనెవరో ఆ రోగికి తెలియదనీ, నాకూ అతనికీ ఎలాంటి సంబంధమూలేదనీ చెప్దామనుకున్నాను కాని ఆ ప్రక్క బెడ్డు మీద రోగి అంతటితో వూరుకోలేదు.

మళ్లీ అతను, 'కన్న తండ్రిని అటువంటి స్థితిలో చూసినప్పుడు మీకు కలిగే బాధ నేనూహించగలను. అతను వచ్చిన దగ్గరనుండీ అన్ని విషయాలూ చెప్తూనే వున్నాడు. ఆయన సహాయం లేకుండా మీ అంతట మీరే ఇంతటి గొప్పస్థితికి వచ్చారన్నాడు. అసలు మీకు తీరిక వుంటుందో లేదో, రాగలరో లేదో అని కూడా అనుకున్నాడు. తను ఆఖరి క్షణాలలో మిమ్మల్ని చూసి, మీరు తన ప్రక్కన వుండగా తన ప్రాణంపోతే చాలునని అనేవాడు. పోనీండి కళ్లతో చూడలేకపోయినా మీరు అతనిని స్పృశిస్తే అతను మీరు వచ్చారని గ్రహిస్తాడు' అని ఆ వ్యక్తి చెయ్యిపట్టుకోమని సూచించాడు.

ఎందుకో నా కళ్లవెంట నీళ్లు తిరిగాయి.

నా ఎదుట బాధలోనున్న వ్యక్తియొక్క అవ్యక్త కోరికల వలనా, అసహాయస్థితి వలనా కాబోలు, నా మనసులో ఏ భావాలున్నా నా నోటివెంట అవి రాకుండా గొంతుకలో ఏదో అడ్డుపడింది.

నేను చెప్పలేను...! ఆ వ్యక్తి నావాడు కాడని. వదిలి వెళ్లిపోయే కర్కశత్వం నాలో విజృంభించలేదు. ఒక తోటి వ్యక్తి అంత్యదశలో వున్నప్పుడు, నా యధాశక్తి ఆ జీవికి తోడ్పడాలనే కరుణ నాలో పెల్లుబికింది. బహుశా, ఒకరి పనులు నామీద వదిలితే, కాదని చెప్పలేని దౌర్బల్యం కూడా నాలో వుండడంవలన కూడా అలా ప్రవర్తించి వుంటాను.

'మీరు కొంచెం ధైర్యంవహించి ఆయన ప్రక్కని కూచుని, ఆయనకు మనశ్శాంతి కలిగించండి' అని ప్రక్క బెడ్డు మీదనున్న రోగి చెప్పినమాటలు నాకర్తవ్యాన్ని బోధించాయి.

పదమూడో నెంబరు బెడ్డుమీదనున్న రోగిచెయ్యి నా చేతిలోకి తీసుకుని అతని ప్రక్కన కూర్చున్నాను.

అలా కూర్చున్న కొద్ది సేపటికి ఆ వ్యక్తిలో చిన్న కదలిక కలిగింది బహుశా అది తనవాళ్లెవరో తనవద్దకు వచ్చారన్న గ్రహింపువలన కావచ్చు. మూతపడిన కళ్లు కొంచెం తెరవడానికి ప్రయత్నించి కొద్ది క్షణాలుమాత్రమే కొంచెం తెరువగలిగి, మళ్లీ మూసివేసి, ఆయాసంతో రొప్ప సాగాడు. అతని బాధను చూడలేకపోతున్నా. అతనిని వదిలివెళ్లే ధైర్యంలేక అలా అతనినిచూస్తూ కూర్చుండి పోయాను. నా చెయ్యీ అతని చెయ్యీ హత్తుకుపోయి వుండడంవలన, మా నోటివెంట పలకరింపులు జరుగకపోయినా మా హృదయాలు మాత్రం ఒకదానితో ఒకటి సంభాషిస్తున్నట్లనిపించింది.

'సా శా రా! మీరు వచ్చినట్లు గ్రహించిన తరువాత అతని మొహంలో ఎంత ప్రశాంతత వచ్చిందో? మీరు తన ప్రక్కనే వున్నారనే భావంవలన అతను తనబాధను మరింత ధైర్యంగా ఎదుర్కోగలడు' అన్నాడు. అవునన్నట్లు తలూపాను. ప్రక్క బెడ్డుమీద రోగి నాకిస్తున్న ప్రోత్సాహం నాలో మరింత శక్తిని కలిగించింది.

ఇతరులు మనగురించి మంచిగా అనుకోవాలని, మనం ఎన్నిరకాల మంచిపనులూ, ఒకొక్కప్పుడు అర్థంపర్థంలేని పిచ్చిపనులూ కూడా చేస్తామో తల్చుకుంటే, ఆశ్చర్యంగా వుంటుంది!

నేను ఎందుకోసం ఇక్కడికి వచ్చానో అవతల మామయ్య విషయం కనుక్కోవడం ఎంత అవసరమో, ప్రక్కబెడ్డుమీద రోగికి చెప్పి, ఈ రోగిని అతనికి వప్పచెప్పి వెళ్లిపోదామని రెండుమూడుసార్లు కదలబోతే, నా చేతిని పట్టుకున్న ఆ వ్యక్తి చెయ్యి నన్ను మరింత గట్టిగా పట్టుకుంది. ఆ వ్యక్తి తనపట్టు వదిలేటట్లు లేదు. నేను నిస్సహాయంగా కూచున్నాను.

ప్రక్కబెడ్డుమీద రోగి, ఈ వ్యక్తి గురించి కొంత చెప్పాడు. మధ్యాహ్నమే, ఈ కేసు లాభంలేదని డాక్టర్లు అనుకోవడం తను విన్నాడట. ఆఖరి క్షణాలలో కొడుకునైన నేను రావడంవలన చనిపోయేటప్పుడు నోట్లో నీళ్లైనా పోసే అవకాశం నాకు కలిగిందన్నాడు.

అది విన్నప్పుడు నాకు చాలా కష్టం కలిగింది. నేనెవరు? అతనెవరు? నాకతనేమీకాడని చెప్పలేకున్నాని నా హృదయం ఎంతో ఆరాటపడింది. అలా చెప్పడంవలన నాకుగాని, ఆ ప్రక్కబెడ్డు మీద రోగికిగాని ఏమీ నష్టంలేదు.

కాని నా అంతరాత్మ, మృత్యువుతో పోరాడుతున్న ఆ 13 వ నంబరు బెడ్డు మీద నున్న రోగియొక్క ఆఖరి ఆశలు నేలమట్టం చెయ్యడానికి నాకేం హక్కుందని ప్రశ్నించింది. తన కొడుకే తన పక్కకు వచ్చి కూచున్నాడనే భ్రమలో

# కీలుబొమ్మలు

వున్న ఆ వ్యక్తి, నామాటలు విని ఏమైపోతాడు? ఇంక కొద్దిసేపు ఓపికపడితే ఆ వ్యక్తి యొక్క ఇహలోకయాత్ర ముగుస్తుంది. అప్పుడు నేనేం చెప్పినా అతని నేమీ బాధించదు.

అప్పటికి రాత్రి పదిగంటలైంది. నర్సునిపిల్చి ప్రక్క బెడ్డుమీద రోగి ఏదో మాట్లాడుతున్నాడు. వార్డు కిటికీలోంచి ఆకాశం వైపుచూశాను. చంద్రుడు లేడు గాని నక్షత్రాలు మెరుస్తున్నాయి. అవి, ఈ శరీరమనే ఖైదునుంచి తప్పించుకు రమ్మని ఆత్మ నాహ్వానిస్తున్నట్లున్నాయి.

అతను నాచేతిని విడువకుండా అలా పట్టుకుని, ఎగశ్వాస పీలుస్తూ, సగం మూతపడ్డ కళ్లతో నావైపు చూడాలని ప్రయత్నిస్తూ, ఆ రాత్రిలో చాలా భాగం వరకూ మృత్యువుతో పోరాడుతూ నే వున్నాడు. అతని మరణవేదన చూస్తూంటే, నాలో ఒకప్రక్క దుఃఖమూ మరొక ప్రక్క సానుభూతీ కలుగసాగాయి. నాలో క్రమంగా 'అతనెవరో నేనెవరో—' అన్న భావనపోయి, అతను నా ఆత్మీయుడనే భావం కలుగ సాగింది. అతనికి మరి కొంత సదుపాయం కలిగించాలనీ, అతని బాధను వీలైనంత తగ్గించాలనీ ప్రయత్నించ నారంభించాను. నర్సుని పిల్చి అతనికి మందేమైనా ఇవ్వాలేమో కనుక్కున్నాను. మందు అవసరం లేదనీ, అప్పుడప్పుడు గ్లాసెడు నీళ్లు పొయ్యమని చెప్పింది.

అట్లాగే అరగంట కొకసారి అతని నోట్లో గ్లాసెడునీళ్లు పొయ్యసాగాను.

అలాపోసిన నీళ్లు అతి కష్టంమీద మింగుతూండేవాడు. తెల్లవారు జామున నాలుగు గంటలకు మాత్రం మరి మింగ లేదు పోసిననీళ్లు కారిపోసాగాయి. శ్వాస ఆగిపోయింది. నాకు అనుమానం వేసి నర్సుని పిల్చి చూపించాను. ఆమె అతను చనిపోయాడని చెప్పింది.

నాలో వెంటనే కలిగిన భావం విచారం కాదు; విరక్తి అని చెప్పవచ్చును. మనసుకు విశ్రాంతి కలిగినట్లైంది. నా బాధ్యత తీరింది కాబట్టి, వెళ్లిపోవా లనుకున్నాను. చనిపోయిన వ్యక్తి అంత్య క్రియలు సంగతి ఆలోచించాలి.

ఏది ఏమైనా, రాత్రంతా పడిన శ్రమ వలన, కాస్త కాఫీ తాగితేగాని శరీరం స్వాధీనంలోకి వచ్చేటట్లు లేదు. బయటకువెళ్లి కాస్త కాఫీ త్రాగి రావాలని నిర్ణయించుకున్నాను.

ప్రక్క బెడ్డుమీద రోగి నిద్రపోతున్నవాడల్లా కళ్లుతెరిచి నావైపు చూశాడు. అతనికి జరిగిన సంగతి చెప్పాను. అతను విచారించి నన్నోదార్చ నారంభించాడు. అప్పుడతనికి అసలు విషయం చెప్పాను. నాకూ ఆ చనిపోయిన వ్యక్తికీ ఏమీ సంబంధంలేదనితెలుసుకుని అతను విభ్రాంతుడయ్యాడు. అతని కండ్లలో నీళ్లు పెల్లుబికాయి. ఏమీ మాట్లాడలేక తడబడ్డాడు. నేను కొద్దిసేపటిలో మళ్లీ తిరిగి వస్తానని బయల్దేరాను.

హాస్పిటలు బయట, కొద్దిదూరంలో వున్న హోటలు పద్మవిలాస్‌వద్ద మొహం కడుక్కుని కాఫీ త్రాగాను. తల దిమ్ముగా వుంది. అలా కూచుని కొంచెంసేపు ఆలోచించాను. మామయ్య సంగతేమయినట్లు? ఆ వుత్తరం కనిపిస్తే బాగుండును. మళ్లీ ఒకసారి ఆ ఉత్తరంకోసం నా జేబులన్నీ వెదికాను. ఈసారి చటుక్కున జ్ఞాపకం వచ్చింది. నేను జేబులో పెట్టాను ఆ వుత్తరాన్ని. అది తీసి చూసుకుని వెంటనే హాస్పిటలుకు వెళ్లాను.

దారిలో నాకు, మామయ్యగురించి వచ్చిన నేను, తెల్లవార్లూ మరొక వ్యక్తివద్ద గడిపానంటే — మావాళ్లు ఏమంటారా?— అన్న సందేహం వచ్చింది. వాళ్లు నన్ను, 'నువ్వు వట్టి దద్దమ్మవిరా! ఎవరో, వాళ్లబ్బాయికోసం ఎదురుచూస్తున్నాడని తెల్లవార్లూ వాడిదగ్గర పడివుంటావా, నీ పన్లు మానుకుని, ఇతరులకోసం వ్యర్థమైన పనులు చేస్తావు కాబట్టే నీ జీవితం ఇలావుంది!' —అంటారు. అయినా నేనేం చెయ్యగలను?— నన్నలా పెంచారు.

నర్సు ఈసారి నేను చెప్పిన వివరాలన్నీ విని, ఆ పేషంటుని ఆ క్రితంరోజే 'డిశ్చార్జి' చేశారని చెప్పింది. అంటే మామయ్యను ఇంటికి తీసుకు వెళ్లిపోయారన్నమాట. నేను వెంటనే వాళ్లవద్దకు వెళ్లాలి. నా సంచీ తీసుకోవడానికి పదమూడవ నెంబరు బెడ్డువద్దకు వెళ్లాను.

అక్కడ నాకు సోమనాథం కన్పించేసరికి ఆశ్చర్యం వేసింది. అతనూ నన్నుచూసి ఆశ్చర్యపడ్డాడు. ప్రక్కబెడ్డుమీద రోగి, సోమనాథంతో, నన్నుచూపించి, 'ఆయనే'. అంటున్నాడు. నేను దగ్గరికి వెళ్ళగానే, 'నువ్విక్కడికెలా వచ్చావు మూర్తీ?' అని అడిగాడు.

తను కలెక్టరు నన్న విషయం మర్చిపోయి, నా చిన్నతనపు స్నేహితుడిలా పలకరించాడు. అంతేకాక ఏదో తీవ్రమైనబాధలో వున్నట్లు కన్పించాడు. 'నేను మామయ్యకి వంట్లో బాగులేదంటే వచ్చాను. తెల్లవార్లూ ఈ బెడ్డు దగ్గరే వున్నాను. మామయ్య నిన్నప్పొద్దున్న డిశ్చార్జి అయిపోయాడని ఇప్పుడే తెలిసింది.' అన్నాను.

సోమనాథం, కొద్దిసేపు మౌనంగా వుండి తరువాత గద్గద స్వరంతో, తలవంచుకుని పదమూడవ నెంబరు బెడ్డుమీద వ్యక్తిని చూపిస్తూ 'ఈయన మా నాన్నే మూర్తీ. నేను సరైన టైముకి రాలేకపోయాను. కొన్ని కారణాలవలన నిన్న రాత్రివరకూ నాకీసంగతి తెలియలేదు. నాన్నకి యాక్సిడెంటయి ప్రమాదపరిస్థితిలో నున్నట్లు తెలియగానే బయల్దేరి వచ్చేశాను. కాని నేను వచ్చేసరికి అంతా అయిపోయింది...' అని శవంకేసిచూసి 'నాన్న నన్నొదిలిపెట్టివెళ్లిపోయాడు' అని చేతులతో మొహం కప్పుకుని ఏడ్చేశాడు.

అతని బాధచూస్తుంటే నా హృదయం ద్రవించి పోయింది. అతని భుజం మీద చెయ్యివేసి, 'విచారించకు సోమనాథం. మనం అంతా ఆ విధి చేతులోని కీలుబొమ్మలం' అన్నాను.

అతను కళ్ళు తుడుచుకుంటూ, 'అవును మూర్తీ, మనం విధి చేతిలోని కీలుబొమ్మలమే.' అని మౌనంగా ఏదో ఆలోచించసాగాడు. నేనూ కొంచెంసేపు మాట్లాడలేక పోయాను. అతను ఎంత అహంభావంకల వ్యక్తైనా, తండ్రిని పోగొట్టుకుని పుట్టెడు దుఃఖంలో వున్నాడు. అటువంటివాణ్ణి అలా వదిలి వెళ్ళటం సబబా? కాదా? అని ఆలోచించాను. చివరికి నా వుద్దేశం బయటపెట్టాను. 'నేనూ వూళ్ళో మామయ్యగారింటికి వెళ్ళిపోతాను.' అన్నాను.

సోమనాథం అర్థం కానట్లు నావైపు చూశాడు.

తరువాత జాలిగా నాతో, 'కొంచెంసేపు నాకు తోడుగా వుండు మూర్తీ, నాన్నని ఏలూరు తీసికెళ్ళిపోతాను.' అని దుఃఖంలో మరేమీ అనలేకపోయాడు. నేను అలాగేనని తలూపాను. అతను డాక్టర్లతో మాట్లాడడానికి వెళ్ళిపోయాడు.

సుమారు రెండు గంటల తరువాత శవాన్ని టాక్సీలో ఎక్కించగలిగాం.

నేనూ, సోమనాథం, డ్రైవరూ, ముందుసీటులో కూచున్నాం. హాస్పిటలు బయటికి వచ్చేశాక నేను కారుదిగి పోతానన్నాను. సోమనాథం తలూపి, కారు ఆపించాడు. నేను దిగగానే అతనుకూడా నా వెనకాలే దిగాడు. ఒక క్షణం ఇద్దరం మౌనంగా నిలబడ్డాం. ఇద్దరికీ ఏదో మాట్లాడాలని వుందిగాని, ఏం మాట్లా

డాలో తెలియటం లేదు.

'నన్ను క్షమించు మూర్తీ' అన్నాడు సోమనాథం మెల్లిగా, తలవంచుకుని.

'ఆ!' అన్నాను ఏదో ఆలోచిస్తున్న నేను.

'నువ్వు నాకు చేసిన ఉపకారం నా జన్మలో మర్చిపోలేము నాన్నకు ఆఖరి ఘడియలలో మనశ్శాంతి కలిగించావు. నువ్వే గనుక ఆ రాత్రంతా ఆయనవద్ద గడపక పోతే ఆయన ఆత్మ ఎంత ఘోషించి వుండేదో!' అన్నాడు. అతను నన్ను పొగుడుతున్నందుకు నాకు సిగ్గేసింది.

'ఆ. దాని దేముందిలే. ఆయన్ని ఆ స్థితిలో చూసిన వాళ్ళెవరైనా అలాగే చేస్తారు' అన్నాను.

'చెయ్యరు మూర్తీ; చెయ్యరు: ఎవరో నీలాంటి అమాయకులు తప్పితే మరెవరూ అటువంటి పరిస్థితులలో అలా చెయ్యరు. లోకంలో ఇంకా మంచితనం వుందని నిరూపించడానికి నీలాటివాళ్ళు చాలు. తక్కినవాళ్ళంతా నాలాటి వాళ్ళే. నా భార్యను సంతృప్తి పరచడంకోసం, నాన్న నన్ను వదిలివెళ్ళిపోయినా, వూరుకున్నాను. నాన్న 'మళ్ళీ నిన్ను చూసే ప్రాప్తముందో లేదో' అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. చివరి కలాగే అయింది' అని సోమనాథం కళ్ళు తుడుచుకుంటూంటే, నాకు ఆశ్చర్యం వేసింది.

# కీలుబొమ్మలు

'నీ భార్యను సంతృప్తి పరచడం కోసమా ?'

'అవును. దానికీ, మా నాన్నకి పడలేదు. మానాన్న పల్లెటూరు రైతవడం వలన ఆయనకు పట్నవాసపు భేషజాలు తెలియవు. నా భార్య చదువుకున్నదే కాక, పెద్ద ఆఫీసరు గారి కూతురు. ఆమె తండ్రికూడా కలెక్టరే. అందువలన ఆమెదంతా నాగరికత ఉట్టిపడే ప్రవర్తన. అది సాంప్రదాయ విరుద్ధమని మా నాన్న వాదన. వీరిద్దరి మధ్యా నేను నలిగిపోయాను. చివరికి ఇద్దరిలో ఎవరో ఒకరు మాత్రమే నాదగ్గర వుండగలరనీ, ఇద్దరూ వుండలేరనీ తేలింది.'

'అందుకే మీనాన్న నిన్ను విడిచి వెళ్ళిపోయారా?'

'ఒక విధంగా నాభార్యకు నేను చాలా ఋణపడి వున్నాను. ఈనాటి నాస్థితికి ఆమే ఆమె కుటుంబం ఎంతో దోహదం చేశారు. నేను ఆనర్సు పాసయినప్పుడు, నాక్లాసు మేటయిన ఆమె నన్ను ప్రేమించి వివాహమాడింది తరువాత నా ఐ. ఏ యస్. సెలక్షనుకు చాలావరకూ ఆమె తండ్రే కారణం. అందువలన నేను నా భార్యనేమీ అనలేను నాన్న అదిగ్రహించి తనే తప్పుకోవడానికి అంగీకరించాడు. ఆయన దేశయాత్రలు చేసివస్తానని వెళ్ళిపోయి ఆరు నెలలయింది. కాని నాభార్య ఆయనయెడల ద్వేషం వహించింది, కాని సహనం చూపించలేదు. ఆమెలోని కక్షమూలంగానే నాకు నాన్నను బ్రతికుండగా చూసే అవకాశం పోయింది.'

'అంటే?'

'నాన్నదగ్గరనుంచి వచ్చిన వుత్తరాలూ టెలిగ్రాములూ అన్నీ నాకందకుండా దాచేసి చించేసింది. ఆఖరి టెలిగ్రాము మాత్రం ప్యూను గంగయ్య, ఆవిడకు తెలియకుండా నాకే తీసుకువచ్చి ఇచ్చాడు. అందుకే, సకాలానికి రాలేక ఇప్పటికి వచ్చాను' అన్నాడు.

అది విన్న నాకొక కనువిప్పయినట్లయింది. అంతవరకూ నేనూ నా తల్లిదండ్రుల చేతులలో కీలుబొమ్మలా పెరిగానని, అందువలన నాజీవితాన్ని సరిదిద్దుకోలేక పోయాననీ విచారిస్తుండేవాణ్ణి. తన జీవితాన్ని స్వేచ్ఛగా మలచుకున్న సోమనాథాన్నిచూసి, అతని అదృష్టానికి ఈర్ష్య చెందేవాణ్ణి కాని అనుకోకుండా తటస్థించిన ఈ సంఘటనవలన, నేనూ సోమనాథమూకూడా విధిచేతిలోని కీలుబొమ్మలమనే సత్యం గ్రహించాను.

మళ్ళీ సోమనాథం అన్నాడు 'ఆరోజు నిన్ను నిర్లక్ష్యంగా పొమ్మని అవమానించాను. దానికి ఎంతమాత్రం నొచ్చుకోక నన్నింకా స్నేహితుడిగానే గౌరవిస్తున్నావు. నువ్వు జీవితంలో పైకి రాలేక పోవడానికి నీలో తగినంత స్వార్థం లేకపోవడమే కారణం. కానీ అందుకు విచారించవద్దు. మనిషిలో హృదయౌన్నత్యమే అన్ని పదవులకన్నా విలువైనది. చిన్నతనంలో డబ్బుకు పేదవాణ్ణై నీ ఆశ్రయంలో బ్రతికాను. ఇప్పుడు సహృదయతలో పేదవాడినై నీముందు నిలబడుతున్నాను. అందుకే నా రాక్షసత్వాన్ని క్షమించమని అడుగుతున్నాను. నువ్వు క్షమించకపోతే నాన్న ఆత్మకు శాంతి వుండదు' అని కన్నీరు కార్చాడు.

అతనిమాటలు వింటూంటే అంతవరకూ వ్యర్థం అనుకుంటున్న నా జీవితానికి కొత్త అర్థం స్ఫురించింది. అంతవరకూ కలెక్టరుగా కన్పించిన సోమనాథంలో, చిరుగు నిక్కర్ల చిన్ననాటి స్నేహితుడు కన్పించాడు. ఎంతైనా మనిషి, మనిషే ననిపించింది. ఎన్నోవేషాలూ, ఎన్నో పైపూతలూ, ఎన్నో నటనలూ తెచ్చిపెట్టుకున్నప్పటికి వాటన్నిటి వెనకాలా దాగున్న మానవత్వం బయటపడే సమయం వస్తుంది. అతని నిజస్వరూపం తెలుస్తుంది. తన నిజస్వరూపం చూపించే అద్దమే ఎదుటివాడిలోని మానవత్వం. ఎదుటివ్యక్తి ఒక మంచిపని చేస్తే మన మనసు ఆ మంచిపనిని చేయించిన మనస్తత్వం అద్దంగా చేసుకుని తన ప్రతిబింబం చూడాలని ఆశిస్తుంది. సోమనాథనికి, నేను చేసిన పనితో తన నిజస్వరూపం చూసుకునే అవకాశం కలిగింది.

'ఛ ఛ! మనలో మనకి క్షమాపణలేమిటి నీమీద నాకెప్పుడూ కోపం లేదు' అని అతని కళ్ళు తుడిచి కారెక్కించి పంపించేశాను నేను మామయ్య ఇంటివైపు సాగిపోయాను.

●

శుస్తీవల్ల నీరసమా ?



బిడ్డల వికాసములో లోటా ?



ఆకలి లేదా ?



ఆరోగ్య క్షీణతయా ?



## —అయితే వింకోలా-12 ఎందుకు తీసుకోరు ?

### ...ఇదే మీ ఆనందమయమైన ఆరోగ్య జీవితానికి మార్గము.

వింకోలా-12 అద్భుతమైనది. క్షణంలో ఎంత స్ఫూర్తినిస్తుంది !
మీరు శక్తివంతమైన అనుభూతిని పొందుతారు. మీరు
జీవితమాధుర్యాన్ని చవిజూడ గోరుతారు. వింకోలా-12
ఆనందదాయకమైనదేగాక: మీ రక్తములోని ఎఱ్ఱకణములను సృష్టించు
శక్తివంతమైన లోహ పదార్థమును సమకూర్చి, మీలో ఉత్తేజమును తిరిగి
ప్రసాదించును. విటమిన్ బి-12 ఆకలిని పెంచి, పటుత్వమును వృద్ధిచేయును.
ఆరోగ్యక్షీణతను నిర్మూలించుటకు ప్రఖ్యాతి చెందిన భారతీయ ఔషధము
ద్రాక్షారిష్టతో పాటు ఆరోగ్యమును ప్రసాదించి, బలము,
పటుత్వము, సౌష్ఠవమునకు కావలసిన ఖనిజ లవణములు, విటమినులు గలవు.




వింకోలా-12 సేవించి
**ఆనందమయమైన ఆరోగ్యజీవితమును అనుభవించండి.**

# వింకోలా-12

రుచిమైన విటమిను - ఖనిజపు టానిక్.



స్టాండర్డ్
ఫార్మస్యూటికల్స్
లిమిటెడ్, కలకత్తా.

SHILPI-SPL. 1/68 TEL

# 'ఆమె చెప్పినది నిజం'



—విజయలలిత

పది సంవత్సరాలకు ముందు జరిగిన ఒక విచిత్ర సంఘటన నా ప్రగతికి కారణం అవుతుందని నేను కలలో కూడా వూహించలేదు. ఆ కథను మీకూ తెలియచేస్తాను.

ఆ రోజు దీపావళి. ఇంట్లో మేమంతా తలంట్లు పోసుకున్నాము. కొత్త గుడ్డలను వేసుకున్నాము. టపాకాయలను పేల్చి, యింట్లో చేసిన పిండివంటలను తిన్నాము. మా ప్రక్కింటి అమ్మాయి వనజ వచ్చి 'విజ్జీ రావే, ఆడుకుందాం' అని పిలిచింది. మా యింటి యెదురుగా వున్న మైదానం లోకి నేనూ, వనజ, కామాక్షి, దుర్గ చేరాం. దాగుడు మూతలు ఆడుతున్నాం. నా కళ్లకు గుడ్డ కట్టారు. నేను వెళ్లి మరొకరిని తాకాలి. నేను అలా అలా వెతుకుతూ పోతూ ఒకామెను తాకాను. ఆమె ఎవరో తెలుసా? ఆ వూర్లో సోదె చెప్పే ముసలమ్మట. నన్ను తీక్షణంగా చూసింది. నాకు భయమేసి మా యింట్లోకి పరుగెత్తాను ఆమె కూడా నన్ను అనుసరించింది, మా అమ్మ వాకిట్లోకి వచ్చింది. 'సోదెమ్మసోది, నీ యిల్లు బంగరమవుతాది, చూపించవే నీ చిట్టి తల్లి చేయి' అంటూ నా చేతిని లాక్కుంది. నా చేతిలోని రేఖలను చూచి 'పిల్లదానా, నీకు కారెక్కే యోగముందాదిలే. నీకు బంగళా వాసం తప్పదులే. నీవు పట్టిందల్లా బంగారమవుతాదిలే' అంటూ తెగవాగేసింది. మా అమ్మకు సోదెమ్మ మాటలపై నమ్మకం కుదరలేదు. 'ఎందుకమ్మా కోస్తావ్. నీకు డబ్బేగా కావాలి, ఇదిగో తీసుకో అయిదు రూపాయలు' అంటూ చీరె కొంగులోవున్న నోటును తీసి యివ్వబోయింది. 'ఎంత మాటన్నావే ఎర్రిదానా? నీ డబ్బు నాకెందుకులే? నా మాట నిజమైన నాడు తీసుకుంటాలే' అని వెళ్లిపోయింది. ఆమె ఏ శుభసమయంలో అలా పల్కిందోగానీ, సరిగ్గా ఆమె చెప్పినట్టులా జరిగింది.

ఈ దీపావళికి ఆమె వస్తే ఎంతబాగుంటుంది? కానీ ఆమె ఎక్కడుందో ఏమో? అనుకుంటున్న సమయంలో గిరిరోడ్డు చివరన 'సోదెమ్మసోదె' అన్న గొంతు వినపడింది. ఆ గొంతు ఆమెదేనేమో అనుకుంటూ మా నౌకర్ని ఆమెను తీసుకురమ్మని పంపించా. నేను అనుకున్న ఆమే యీమె. నన్ను చూచి' ఏం తల్లీ చల్లంగా వుండావా. ఇక్కడన్నావంటే తల్లీ. నా మాట నెగ్గిందనుకుంటా. నేవస్తా' నంటూ వెళ్లబోయింది. వుండవ్వా అని చెప్పి నా రూంలోకి వెళ్లి, ఒక పట్టుచీరె, వందరూపాయలనోటు. మూడుశేర్ల బియ్యం' యిచ్చి పంపించాను. ఆమె చెప్పింది అక్షరాలా నిజం అయింది. ●

## సినిమా డైరీ

● విశాల్‌కంబైన్స్ "అగ్గివీరుడు" అక్టోబరు 17న విజయకంబైన్స్ ద్వారా విడుదలయింది.

● భవానీ ఫిలింస్ "గుణవంతులు"షూటింగు అక్టోబరు 18 నుండి 23 వరకు ప్రసాద్ స్టుడియోలో జరిగింది. శ్రీ ఎన్. టి. రామారావు, సరోజాదేవి, హేమలత పాల్గొన్నారు. ఈ చిత్రానికి శ్రీ కమలాకర కామేశ్వరరావు దర్శకుడు.

● గౌతం పిక్చర్స్ "ఆలీబాబానలభై దొంగలు" షూటింగు శ్రీ విఠలాచార్య దర్శకత్వంలో అక్టోబరు 18 నుండి 24వరకు వాహినీలో జరిగింది. శ్రీ ఎన్. టి. రామారావు, జయలలిత పాల్గొన్నారు.

● పద్మశ్రీ పిక్చర్స్ "అల్లుడే మేనల్లుడే" షూటింగు శ్రీ పి. పుల్లయ్య నిర్దేశకత్వంలో శారదాస్టుడియోలో ఒక వారం రోజులు షూటింగు జరుపుకుంది. కృష్ణ, నాగభూషణం, విజయనిర్మల, సూర్యకాంతం, రాజబాబు, సత్యనారాయణ పాల్గొన్నారు.

● సురేష్ మూవీస్ "సిపాయి చిన్నయ్య" నవయుగాద్వారా అక్టోబరు 30న విడుదలయింది. శ్రీ నాగేశ్వరరావు ద్విపాత్రాభినయం చేసిన యీ చిత్రానికి శ్రీ శేషగిరిరావు దర్శకుడు.

● పూర్ణా ఆర్ట్స పిక్చర్స్ "మాతృ దేవత" పూర్ణాద్వారా నవంబరు 7న విడుదలవుతుంది. ఈచిత్రం శ్రీమతి సావిత్రిచే డైరెక్టు చెయ్యబడింది.



# శారదతో ఇంటర్‌వ్యూ

— మోహన్ కుమార్

నాలుగేళ్ళ క్రితం ఆంధ్ర సచిత్ర వారపత్రికలో శారదని గురించి రాస్తూ భవిష్యత్తుగల తార అని పేర్కొన్నాను. నిజానికి ఆ మాటను మళయాళ చిత్ర రంగంలో ఆమె ఏనాడో రుజూ చేసినా, ఈనాడు 'మనుషులు మారాలి' చిత్రం ద్వారా ఎంతో భవిష్యత్తుగల తారని నిరూపించుకున్నది.

తెలుగు చలన చిత్రరంగంలోను, ప్రేక్షకులలోను గొప్ప విప్లవాన్ని తీసుకొచ్చింది 'మనుషులు మారాలి' చిత్రం. సంచలనం సృష్టించింది. ఇటీవల విడుదలయిన ఏ పెద్ద చిత్రానికీ రానంత పెద్ద మొత్తాలను వసూలు చేస్తున్నదీ చిన్న చిత్రం. తారాబలం కన్న కథాబలం ముఖ్యమని తేలిపోయింది— ఈ చిత్ర విజయంతో.

'మనుషులు మారాలి'కి మళయాళచిత్రం 'తులాభారం' మాతృక. తర్వాత దానిని తమిళంలో తీశారు. పై పేరుతో యిపుడు తెలుగులో వచ్చింది.

ఈమూడు భాషల్లోను శారద గొప్పగా నటించి ఎనలేని కీర్తి ప్రతిష్ఠల నార్జించుకున్నది.

## తెలుగులోనే సంతృప్తి

శారదను ఇటీవల వెమ్కో వీనస్ స్టూడియోలో కలిసినపుడు 'మీరు 'మనుషులు మారాలి' మూడు భాషల్లోను నటించారు కదా, బాగా నటించానన్న ఎక్కువ సంతృప్తి ఏ భాషాచిత్రంలో కలిగింది ?' అని అడిగాను.

అందుకామె సమాధానంగా 'అన్నీ బాగానే వున్నాయి. ఒకదానికన్న ఒకటి బాగుందనిపించింది. కాని, ఆ రెండింటికన్న తెలుగులో పోషించిన భూమికే నాకు ఎంతో సంతృప్తిని కలిగించింది' అన్నారు.

## నవంబరునుంచి తెలుగు చిత్రాలు!

'మనుషులు మారాలి' విడుదలానంతరం తెలుగు పరిశ్రమనుంచి ఎలాంటి రెస్పాన్సు వచ్చింది ? తెలుగు చిత్రాలు వస్తున్నాయా?'

'పరిశ్రమనుంచి, ప్రేక్షకులనుంచి బ్రహ్మాండమైన అభినందనల పరంపర లభిస్తోంది. తెలుగు చిత్రాలలో నటించమని అడుగుతున్నారు. ఇంకా ఏదీ కమిట్ కాలేదు. ఇదివరకు సైన్ చేసిన చిత్రాలు చాలా వున్నాయి. అవి పూర్తిచేయందే కొత్తవి ఎలా కమిట్ కావటం?...నవంబరు నుంచి చేస్తాను తెలుగు చిత్రాల.'

'మళయాళం ఇండస్ట్రీ మీద అభిప్రాయం చెబుతారా?'

'తప్పకుండా ... మళయాళ పరిశ్రమ చాలా చక్కనిది' 'తులాభారం' తర్వాతనే కేరళీయులంటే ఏమిటో మనవాళ్ళు అర్థం చేసుకోగలిగారు. వాళ్ళ సంస్కృతిని సాంప్రదాయాన్ని తెలుసుకోగలిగారు.

## మనవాళ్ళ ముందడుగు!

'మనవాళ్ళు కూడా చాలా అడ్వాన్సు అయ్యారని, ఎంతో కల్చరు అలవర్చుకున్నారని 'మనుషులు మారాలి' చిత్రానికి లభించిన ఆదరణ నిరూపిస్తున్నది. ఈ డాన్స్, ఈ డ్రీమ్, ఈ సెక్స్ ఉంటే చిత్రం సక్సెస్ అవుతుందన్నది అసత్యమని తేలిపోయింది. మన ప్రేక్షకులు చాలా మంచి మార్గంలో వున్నారు. వాళ్ళకి చక్కని అభిరుచులున్నాయి. కొత్తదనం వున్న కథలతో కుటుంబం అంతా చూడ గలిగేలా చిత్రం తీస్తే చక్కటి ఆదరణ లభిస్తుందన్న విషయాన్ని మనుషులు

మారాలి రుజూ చేసింది. కాబట్టి మన నిర్మాతలు మంచి చిత్రాలు ధైర్యంగా తియ్యవచ్చు వాటిని తప్పకుండా ప్రేక్షకులు ఆదరిస్తారనే నమ్మకం నాకీ చిత్రం ద్వారా కలిగింది' అన్నారు శారద.

**ముద్దులు వద్దు**

'మన చిత్రాలలో ముద్దులు ప్రవేశ పెట్టడం గూర్చి మీరేం చెబుతారు?' అని అడిగిన మరో ప్రశ్నకు సమాధానం చెబుతూ—

'నన్నడిగితే వద్దనే అంటాను. ముద్దులు విదేశీ సాంప్రదాయం. ఎక్కడ పడితే అక్కడ, ఎప్పుడు పడితే అప్పుడు ముద్దులు పెట్టుకోవటం మన సాంప్రదాయం కాదు, ఇండియన్ గర్ల్‌కి కొన్ని హద్దులున్నాయి. ఆ హద్దుల్ని అతిక్రమిస్తే భరించలేరెవరూ. చిత్రాల్లో ప్రవేశపెడితే ముఖ్యంగా కళకి తీరని నష్టం వాటిల్లుతుంది. 'ఇందాకా రాగా లేనిది చిత్రాల్లో ముద్దులు చూపిస్తే మాత్రం తప్పేమిటి?' అంటూ పరిశ్రమలో కొందరంటున్నారు కాని, నిజానికి ఇందాకా తీసుకొచ్చింది నెవరు? ఎందుకంత అవసరం వచ్చింది? ప్రేక్షకులు కోరుతున్నారా అర్ధనగ్న దృశ్యాలను? వాళ్ళు కావాలంటున్నారా శృంగారం పేరిట చూపుతున్న అసభ్య దృశ్యాలను?? ...ఇటువంటి వాటిని ప్రేక్షకులు ప్రోత్సహించడం లేదు. చక్కని కథను ఎన్నుకుని దాన్ని అందంగా చూపించ గలిగినప్పుడు ప్రేక్షకులు ఆ చిత్రాన్ని తప్పకుండా ఆదరిస్తారు.' అన్నారామె.

ఆమె చెప్పిన దాన్లో ఎంతో సత్యం ఉంది. రెండేళ్ళుగా కేరళ స్టేట్ అవార్డ్సు అందుకుంటున్న శ్రీమతి శారద ప్రస్తుతం శ్రీ రమణ చిత్రవారి 'సంబరాల రాంబాబు' చిత్రంలో ముఖ్య భూమిక ధరిస్తున్నది.

మనుషులు మారాలి చిత్రాన్ని జెమినీ సంస్థ హిందీలో రంగుల్లో నిర్మించ మన్నది. ఆ చిత్రంలో కూడా శారద నటిస్తుందని ఆ సంస్థకు చెందిన ఒక ప్రతినిధి చెప్పారు. ●

## పాఠకులకి మనవి

దీపావళి కథలపోటీకి పోయినసారికన్నా ఎక్కువ కథలే వచ్చినా కథలస్థాయి మొత్తంమీద నిరాశాజనకంగానే ఉన్నది! బహుమతిపొందిన మొదటి మూడు కథలనీ ఈ సంచికలోనే చూడవచ్చు. మిగిలినవాటిలో 'మామూలుగా' ప్రచురణకి ఎన్నిక అయిన కథల జాబితా ఈ క్రింద వేస్తున్నాము. పోటీలో పాల్గొన్న వారందరికీ మా ధన్యవాదాలు. —సం॥

1 అందనిపండ్లు — బి. టి. లక్ష్మీదేవి
2. అపరాధి — యస్. దస్తగిర్
3. అపార్థం — పరిమళా సోమేశ్వర్
4. ఆకలి — పి. లీలావతి
5. ఆత్మార్పణ — కె. వి. కృష్ణకుమారి
6. ఆదర్శ దాంపత్యం — ముట్నూరి వేంకట నాగేశ్వరరావు
7. ఆశ — తాళ్ళూరు నాగేశ్వరరావు
8. ఇది న్యాయం — యలమంచిలి ఝాన్సీలక్ష్మి
9. ఇదీ లోకం — ఎచ్. గిరిజాకుమారి
10. ఉద్యోగం — పావని
11. ఎగిరిపోయిన చిలక — పి. ఎస్. నారాయణ
12. ఎగ్జిబిషన్ — కొలను వేంకట దుర్గాప్రసాద్
13. గాఢాంధకారంలో ఒక కాంతి కిరణం — తేరాల శ్రీ
14. 'గోదావరి మరచిపోయినా...' — భట్టిప్రోలు బాలదేవి
15. జాజిమొగ్గలు — తమిరిశ జానకి
16. జ్ఞానోదయం — ఫణి
17. తప్పు — రాంబాబు
18. తీరనిబాధ — కె. గౌరీసుందరి
19. తీర్పు — శ్రీపతి
20. తుఫాను — కృష్ణ
21. తుమ్మెద వాలని పువ్వు — ప్రయాగ గృహలక్ష్మి
22. దాలిగుంట — పిశుపాటి ఉమామహేశ్వరమ్
23. దేవుడు — వై. రాంబాబు అండ్ శాయి
24. నాకు నువ్వూ — నీకు నేనూ — అవసరాల రామకృష్ణారావు
25. నీడలేని దేవుడు — సి. ఎస్. రావు
26. నేనెందుకు బతికాను — నాగభైరవ కోటేశ్వరరావు
27 నేరము — సాక్ష్యము — న్యాయపతి రాజగోపాలం
28. వేల — వింగి — 'రసజ్ఞ'
29. పిరికివాని సాహసం — జీడిగుంట రాజ్యలక్ష్మి
30. ఫలించనికోరిక — ఎ. విజయలక్ష్మి
31 మమత — భ్రమత — కంచనపల్లి వెంకటకిషన్‌రావు
32 బలి — యస్. మంజుల
33. బాగుపడే దెప్పుడు — ఏన్. ఉమామహేశ్వరరావు
34. భయపెట్టాను, అంతే! — తాతినేని వెంకట నరసింహారావు
35 మనిషిలోని మమత — మాధవి
36 మానవత్వం — మోదీన్
37. మాయబ్రతుకు — అందే రామారావు
38. ముళ్ళ పొదల మధ్య మల్లె పువ్వు — అకొండి వెంకటరత్నం
39 మూడుచక్రాల సైకిలు — ముదిగొండ వీరభద్రయ్య
40. వంచన — అమ్మంగి వేణుగోపాల్
41. వయసువెర్రి — వి. యస్. ఆర్. శాస్త్రి
42. విడచినచీర — వజ్రపు కృష్ణారావు
43. విప్లవ — జె. భాగ్యలక్ష్మి
44. విలువ — మాహనుమంతరావు
45 స్వాధీన మృత్యువు — మురయా
46 హృదయశోదన — ఎ. శోభాకామక్త

# సినిమా

'బందిపోటు దొంగలు' చిత్రాన్ని నిర్మించిన మాధవీ పిక్చర్స్, శ్రీ గుహనాథన్ వ్రాసిన సాంఘిక కథను తెర కెక్కించే ప్రయత్నాల్లో వున్నారు. ప్రతిరోజూ స్టోరీ చర్చ జరుగుతూంది. ఈ చిత్రానికి తాతినేని రామారావు నిర్దేశకుడు. నాయక పాత్రను శ్రీ అక్కినేని ధరిస్తారు.

* * *

'ప్రాణమిత్రులు' తర్వాత పద్మశ్రీ పిక్చర్స్ నిర్మించనున్న సాంఘిక చిత్రంలో నటించడానికి శ్రీ నాగేశ్వరరావు అంగీకరించారు. 'వింత కాపురం' దర్శకునిచే ఈ చిత్రం డైరెక్టు చెయ్యబడగలదని తెలుస్తూంది. శ్రీ పి. పుల్లయ్య స్క్రీన్ ప్లేను వ్రాస్తున్నారు. శ్రీ వి. వెంకటేశ్వర్లు నిర్మించనున్న యీ చిత్రంలో వాణిశ్రీ కథానాయిక.

* * *

శ్రీ నాగేశ్వరరావు రజతోత్సవ చిత్రాన్ని విడుదల చేసిన ప్రసాద్ ఆర్ట్సు పిక్చర్స్ నిర్మించనున్న సాంఘికంలో శ్రీ అక్కినేని నాయకుడు. శ్రీ తాతినేని రామారావు దర్శ-



'గండరగండడు'లో
నర్తకి జి శకుంతల

కత్వంలో తయారుకానున్న యీ చిత్రాన్ని శ్రీ ఎ. వి. సుబ్బారావు నిర్మిస్తారు. ప్రస్తుతం కథల ఎన్నిక కార్యక్రమం జరుగుతూంది,

* * *

ఉత్తమచిత్ర నిర్మించనున్న సాంఘికంలో కూడా శ్రీ నాగేశ్వరరావు కథానాయకుడు. శ్రీ సత్యగాత్మ వ్రాసిన కథకు ఆత్రేయగారు సంభాషణలను వ్రాస్తున్నారు. చిత్రంలోని ప్రధాన పాత్రలను శ్రీమతి జమున, పద్మనాభం, గీతాంజలి, సూర్యకాంతం పోషిస్తారు.

* * *

విశ్వభారతి నిర్మించనున్న సాంఘికంలో నటించడానికి శ్రీ నాగేశ్వరరావు ఒప్పుకున్నారు. శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ మాటలను వ్రాస్తున్న యీ చిత్రానికి శ్రీ సత్యగాత్మ దర్శకుడు.

* * *

కె. జి. ఆర్. పిక్చర్స్ నిర్మిస్తున్న జానపద చిత్రంయొక్క షూటింగు అక్టోబరు 24వ తారీఖున ప్రారంభమైంది.

# ఇంటా బయటా

నాకు సినీజీవితంలో కొన్ని పెద్ద లక్షణాలున్నాయ్. నేను ఎవరికీ ఇబ్బంది కల్గించను, ఇచ్చిన కాల్‌షీటును ఎగగొట్టను. నా షాటు ఎప్పుడు వచ్చినా కాల్‌షీటుకు రాగానే మేకప్‌తో రెడీగా వుంటాను. నేను నా పనేమో చూసుకుంటాను. సెట్లో ఎవరితోనూ అనవసరమయిన చర్చలో పాల్గొనను. దర్శకుని ఆజ్ఞను శిరసావహిస్తాను. షూటింగు అయిన వెంటనే ఒక్క నిమిషంకూడా ఆగక, నా కారును స్టార్టు చేసి నేరుగా మా యింటికి పోతాను.

ఇంటి గేటు ముందు కారు ఆపి హారన్ కొట్టడం నాకు అలవాటు. మేడ పైనుండి నా పాపాయిలు 'డాడీ, కమాన్' అంటూ పైకి పిలుస్తారు. నేను వెళ్ళి సోఫాలో కూర్చోగానే నా సహధర్మచారిణి గ్లాసు మంచినీళ్ళు యిచ్చి నా కోటును, బూటును విప్పుతుంది. నా పిల్లలందరూ నన్ను బాత్‌రూంకి లాక్కెళ్తారు. కాళ్ళు చేతులు కడుక్కొని కాస్త విశ్రమిద్దామనుకుంటే మా చిన్నోడు వచ్చి మీదపడి 'నాన్నా నాన్నా నాకు ఆ బొమ్మ కొనిపెట్టవూ' అని అడుగుతాడు నేను వచ్చేవరకు నా భార్య భోంచెయ్యదు మేమిద్దరం కలసి భోజనం చెయ్యడం మాకు అలవాటు, ఆనందం కూడా. ఆమెకు తెలియకుండా నేను యేపనీ చెయ్యను. మా దాంపత్య జీవితం నిత్యనూతనంగా వున్నట్టు మేము భావిస్తాం.

ఏకలవ్యునికి ద్రోణాచార్యు లొక్కరే గురువయితే నాకు శ్రీయుతులు నాగేశ్వరరావు, ఎన్. టి. రామారావు, గుమ్మడిగార్లు గురువులు. వాళ్ళ నటన నా 'నాటన'కు ఇన్‌స్పిరేషన్ యిస్తున్నదని చెప్పగలను.

ఇంట్లో నా భార్య, పిల్లలు నావాళ్ళయితే, సినిమా నటునిగా నాకు దర్శకనిర్మా-



తలు, పాత్రికేయులు, ప్రేక్షకులు సన్నిహితులు.

నాపై పరిశ్రమ చూపుతున్న ఆదరం, ప్రేక్షకులు ప్రదర్శిస్తున్న అభిమానం, పాత్రికేయులు యిస్తున్న ప్రోత్సాహం కలకాలం వుంటే అదే నాకు పదివేలు.

—శోభన్ బాబు.

# చక్కటి కానుక

## ఫొటోగ్రఫీ వారిచే మొదలుపెట్టించుటకు




## క్లిక్ III




CMAG-119-203 Tel.

మీబాలున పరిచయం చేయండి, ఛాయాచిత్ర కళాప్రపంచంలోని సౌందర్యానికి ఒకక్లిక్ III కెమేరాతో. అది ఉపయోగించుట చాలా తేలిక. గుణించుట లాంటి గడబిడలు ఏమీలేవు. గురిచూచి మీటనొక్కితే చాలు. ప్రథమ ప్రయత్నంలోనే, అదిచేకూర్చు తుంది, ప్రజ్వలమైన ఫలితాలు. ప్రతిఫిల్మ రోలుతో తీయవచ్చు, పన్నెండు ప్రకాశవంతమైన చిత్రాలు. ఈ పండుగ దినాలలో, మీబాలున కివ్వండి, కానుకగా ఒక క్లిక్ III కెమేరా, ఆరంభించుటకు, అనుక్షణం వెంట అంటిపెట్టుకొని ఉయుంచుకొనుటకు అత్యుత్తమమైన కెమేరాఅదే అథరైజ్డ్ అగ్ఫాడీలర్ల అందరివద్ద లభిస్తుంది



ఆగ్ఫా పర్యవేక్షణక్రింద.
AGI ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్, బరోడా,
వారిచే తయారు చేయబడినది,
సోల్ డిస్ట్రిబ్యూటర్స్:
ఆగ్ఫా గెవార్ట్ ఇండియా లిమిటెడ్, బొంబాయి · క్రొత్తఢిల్లీ · కలకత్తా · మద్రాసు.

# సినిమా

ఈ చిత్రానికి చిల్లర భావనారాయణ మాటలను, విజయకృష్ణమూర్తి సంగీతాన్ని సమకూరుస్తున్నారు. శ్రీ బి. విఠలాచార్య నిర్దేశకత్వంలో తయారయ్యే యీ చిత్రంలో శ్రీ ఎన్. టి. రామారావు నాయకుడు. నాయిక శ్రీమతి దేవిక.

* * *

రాజేంద్ర ఆర్ట్స్ నిర్మించనున్న జానపదంలో నాయకుడిగా నటించడానికి శ్రీ ఎన్. టి. రామారావు అంగీకరించారు. నాయికగా శ్రీమతి బి. సరోజాదేవి నటిస్తుంది. ఈ చిత్రానికి శ్రీ విఠలాచార్య దర్శకుడు, శ్రీ ఘంటసాల సంగీత సారథి.

* * *

పూర్ణిమ పిక్చర్స్ ఒక సాంఘిక కథను తెర కెక్కిస్తున్నారు. ప్రముఖ దర్శకుడు శ్రీ సి. ఎస్. రావు వ్రాసిన కథను నిర్మాత శ్రీ డి. ఎన్. రాజు నిర్మిస్తున్నారు. శ్రీ ఎన్. టి. రామారావు నాయకుడిగా నటించనున్న యీ చిత్రం శ్రీ సి. ఎస్. రావ్‌చే డైరెక్టు చెయ్యబడుతుంది.

* * *

రాజకమల్ పిక్చర్స్ నిర్మించనున్న సాంఘిక చిత్రంలో హీరోగా నటించేందుకు శ్రీ ఎన్. టి. రామారావు ఒప్పుకున్నారు. స్క్రీన్‌ప్లేను శ్రీ చంగయ్య, మాటలను శ్రీ పద్మరాజా వ్రాస్తున్న ఈ చిత్రానికి శ్రీ సేకేటి శివరాం దర్శకుడు. ఈ చిత్రాన్ని శ్రీ రామరాజు నిర్మిస్తారు.

* * *

డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ అధినేత శ్రీ డి. వి. ఎస్. రాజు మంచి కథలకోసం వెతుకుతున్నారు. తీసేది జానపదమయినా, సాంఘికమయినా హీరో పాత్రను శ్రీ రామారావు నిర్వహిస్తారు. జానపదమయితే శ్రీ విఠలాచార్య డైరెక్టు చెయ్యగలరు.

* * *

సుభాషిణీ ఆర్ట్స్ పిక్చర్స్ బాలమురుగన్ కథను తెర కెక్కించనున్నారు. శ్రీ కె. హేమాంబరధరరావు డైరెక్టు చేసే యీ చిత్రంలో కూడా శ్రీ రామారావే నాయకుడు.

* * *

కౌముదీ ఫిలింస్ రెండు కథలను రెడీ చేసివుంచారు. రెండింటినీ శ్రీ ఎం. ఎస్. రెడ్డి వ్రాశారు. సంభాషణలను శ్రీ పింగళి నాగేంద్రరావు సమకూర్చారు. వీటి నిర్మించినా నాయకుడు శ్రీ రామారావే. దర్శకత్వాన్ని శ్రీ కమలాకర కామేశ్వరరావు చేపట్టగలరు.

* * *



'కథానాయిక మొల్ల'లో హరనాథ్, వాణిశ్రీ

## తెరపై "ముద్దు" కావాలా? వద్దా?

**కుమారి జయలలిత:**

మనదేశంలో పూజ్య బాపూజీ, పండిత నెహ్రూ, రవీంద్రనాథ టాగూర్, తిరువళ్ళువర్‌లాంటి మహాత్ములు పుట్టారు. మనది పుణ్యభూమి.



మనజాతి గౌరవాన్ని విదేశీయులకు చాటి చెప్పిన వివేకానందుడు పుట్టిన పవిత్ర భూమి మనది. అలాంటి మనం 'ముద్దు'ను అనుమతిస్తే మనకున్న యశస్సు, మర్యాద మట్టిపాలు కావల్సిందే.

**శ్రీ రాజనాల:**

తెరమీద 'ముద్దు'తోనే అవుతారా? ఇంకా యింకా ఏమయినా ప్రవేశపెడతారా? అయినా 'ముద్దు' పబ్లిక్‌గా పెట్టడం నాకెందుకో యిష్టంలేదు.

**శ్రీ సత్యనారాయణ:**

మన శీతోష్ణస్థితికీ, విదేశాల శీతోష్ణస్థితికి చాలా వ్యత్యాసం వుంది. మనది వేడిదేశం. వాళ్ళది చలిదేశం. వేడిదేశంలో వున్న మనకు వుద్రేకం ఎక్కువ. 'ముద్దు'ను ప్రవేశపెడితే నటీనటులకు 'నటన'పై ఏకాగ్రత దెబ్బతినడమే గాక, శరీర ఆరోగ్యం దెబ్బతినే అవకాశంకూడా వుంటుంది. కాబట్టి 'ముద్దు' మనకొద్దు.

— సేకరణ: శ్రీనివాస్

పద్మశ్రీ పిక్చర్స్ నిర్మిస్తున్న 'అల్లుడే మేనల్లుడు' చిత్రం అక్టోబరు 12 న ప్రారంభమైంది. శ్రీ పి. పుల్లయ్య దర్శకత్వంలో తయారవుతున్న యీ చిత్రంలో శ్రీ కృష్ణ నాయకుడు. శ్రీ భమిడిపాటి సంభాషణలను, శ్రీ శంకర్ సంగీతాన్ని సమకూరుస్తున్న యీ చిత్రంలోని ముఖ్య భూమికలను విజయనిర్మల, సూర్యకాంతం, నాగభూషణం, రాజబాబు, సత్యనారాయణ, రమాప్రభ ధరిస్తున్నారు. ఈ చిత్రానికి శ్రీ వి. వెంకటేశ్వర్లు నిర్మాత.

* * *

ఫల్గుణాపిక్చర్స్ నిర్మించనున్న క్రయిం థ్రిల్లర్‌లో హీరోగా నటించడానికి శ్రీ కృష్ణ అంగీకరించారు. శ్రీ నందనరావు దర్శకత్వం నిర్వహించే ఈ చిత్రంయొక్క కథాచర్యలో శ్రీ గోపిశెట్టి, బాపినీడుగార్లు పాల్గొంటున్నారు. శ్రీ ఏకామ్రేశ్వరరావు, రాఘవలు నిర్మించనున్న ఈ చిత్రంలో వాణిశ్రీ, రంగారావు ముఖ్య పాత్రధారులు. సంగీతాన్ని కోదండపాణి, కెమరాను కన్నప్ప నిర్వహిస్తారు.

* * *

రవిచిత్ర నిర్మించనున్న ద్వితీయ చిత్రంలోకూడా శ్రీ క్రిష్ణ నాయకుడు. నాయిక విజయనిర్మల. ఈ చిత్రానికి నిర్మాత వై. వి. రావ్ కథను వ్రాసారు. దర్శకత్వాన్ని శ్రీ ఎస్. వి. కుటుంబరావు గమనిస్తారు.

—శ్రీనివాస్




నవంబరు ఒకటో తేదీనుంచి ఆంధ్రప్రదేశ్‌లో మద్యనిషేధం ఎత్తివేస్తారనే వార్త కొందరిని ఆశ్చర్యంలోను, మరికొందరిని విచారంలోను, ఇంకొందరిని ఆనందంలోను ముంచెత్తింది.

ఆంధ్రరాష్ట్రంలో తాగని వారికన్న తాగేవారిసంఖ్య తక్కువే అయినా ఈ వార్త—వాతావరణాన్ని బట్టి పరిశీలిస్తే ఎక్కువమందిలో తాగినంత ఉషారును, తగినంత నిషాను రేకెత్తించిందని చెప్పవచ్చును.

ముఖ్యంగా కొందరు వ్యాపారస్తులని సంతోషాబ్ధిలో తేలించింది వార్త. ఎక్కువ లబ్ధిని చేకూర్చిపెట్టే వ్యాపారం ఇంతకన్న కావలసింది ఏముందీ? తీరిక దొరికినపుడల్లా ఏ వేళలోపడితే ఆ వేళలో, ఏ ట్రెయినుకుపడితే ఆ ట్రెయినుకు గోతాంలో డబ్బు నింపుకుని హైదరాబాదు చేరుకుంటున్నారు — చేరుకుని దుకాణాల పర్మిట్లకి, బార్ పర్మిట్లకి—స్టాకు కొనుగోలుకీ హడావిడి పడుతున్నారు.

మంత్రివర్గాల చుట్టూ, అధికారవర్గాలవారి చుట్టూ ప్రదక్షిణలు చేస్తూ పర్మిట్లకోసం ప్రాధేయపడుతున్నారు: పడరానిపాట్లుపడుతున్నారు. ఏంచేస్తారు మరి, పాపం అవసరం!

పోతే—దీని ప్రభావం మధ్యతరగతి కుటుంబాలమీద, సినిమాలపైన ఎలా వుంటుందన్నది చర్చనీయాంశం.

దుకాణాలకీ, బార్‌లకీ పర్మిట్లు యిచ్చారంటే యిక జనాన్ని ఎవరూ ఆపలేరు. ఎప్పుడూ తాగనివాడికికూడా ఒకసారి తాగి అదేదో చూద్దాం అనిపిస్తుంది. మధ్యనిషేధం తీసివేసిన మొదటి మూడునెలలూ విడుదలయిన సినిమాలకి బాగా ఎఫెక్ట్ అవుతుంది. కలెక్షన్లు తగ్గుతాయి. కొత్తమోజులో ఆ బాటలో ఏదో వింత ఆనందం కనిపిస్తుంది.

పగలంతా శ్రమించిన శ్రామికుడు, సామాన్య పౌరుడు సాయంకాలం అయ్యేసరికి 'రిలీఫ్' కోసం, మానసికోల్లాసంకోసం నేడు సినిమాకు వెళ్తున్నారు; రేపు బార్స్‌కి వెళ్తారు. నిషేధం లేనందువల్ల సరుకు ఖరీదు కూడా తక్కువగానే ఉన్నట్టు కనిపించి 'సినిమాలు రోజా చూస్తూనే వున్నాం. ఇవాళ తాగేద్దాం' అనుకుంటాడు. అలా అనుకుని తాగేసింతర్వాత ఆ 'మూడ్'లో పడిపోతాడు. అక్కణ్ణుంచి ఎన్ని చిత్రాలైనా చేస్తాడు. సీసా చేతపుచ్చుకుని బయలుదేరి — అది బారో, బజారో కూడా తెలీకుండా ప్రవర్తించటంకూడా జరుగుతుంది.

ఈ 'నిషా'కు అలవాటు పడిన మనిషి మరి దేనినీ కోరడు. అలవాటు కానే కూడదు; అయితే అది ఎంతదాకా అయినా వెళ్తుంది. రోజా తాగటానికి మామూలు మనిషికి డబ్బుండవద్దా? అనుకుంటే—రోజా సినిమాలకి ఎలా వస్తోంది? అనికూడా అనుకోవచ్చును. సినిమాకు తక్కువ డబ్బు, సరుకుకు ఎక్కువడబ్బు అవుతుంది గనుక— సినిమాలకి అడ్జస్ట్ చేసుకున్నట్టే — దీనికీ అడ్జస్ట్ చేసుకుంటాడు. అప్పో సప్పో చేస్తాడు—అలవాటుచంపుకోలేక.

ఈ దుకాణాలు పెట్టడంవల్ల ఎక్కువగా దెబ్బతినేది మధ్యతరగతి కుటుంబాలు. సినిమా పరిశ్రమ. ఈ నష్టం యిప్పుడు తెలీదు: మద్యనిషేధం తీసివేసిం తర్వాత— మొదటి మూడునెలలూ జరిగితే అపుడు లెక్కలు వేసుకుంటే తెలుస్తుంది— వసూళ్లలో అప్పటికీ యిప్పటికీ ఎంత భేదం ఉన్నదో! అంతదాకా వేచి ఉండాల్సిందే!

—మోహన్ కుమార్

| గెలవండి రు. 2000 | # విజయ సాహితి - 8. | పొడిగింపబడిన ఆఖరు తేదీ 25-11-69 |
|---|---|---|

(భారత సుప్రీంకోర్టు తీర్పు ననుసరించి, నిర్వహింపబడుచున్న ప్రథమ తెలుగు సాహిత్య పోటీ)

## 12. ఆధారములు

1. అడది **ఆడదాన్ని/మగవాణ్ణి** అర్థం చేసుకున్నట్లు మగవాడు స్త్రీని ఎప్పటికీ అర్థం చేసుకోలేడు.
2. ఎమురుచూచే ఆశలుంటే. ఆ ఆశలను తీర్చుకోవాలనే **ఆరాటం/పట్టుదల** వుంటే బ్రతుకు తియ్యగా వుంటుంది
3. మానవుడికి విచారం గాని, ఆనందం గాని పెల్లుబికినప్పుడు **ఏకాంతం/తోడు** అన్వేషిస్తాడు.
4. స్త్రీ ఎప్పుడెప్పుడు, ఎందుకెందుకు, ఎలా ఎలా **ఏడుస్తుందో/నవ్వుతుందో** ఎవరు చెప్పగలరు !
5. ఆత్మతేజమును వికసింపజేయుటకు **ఓర్పు/శరీరం** ఒక సాధనం అంటాడు ఆదర్శసాధనా నిమగ్నుడు.
6. భగవంతుని మీద ఉన్న **ప్రేమ** నిజమైనది. మానవులపై వుండే ప్రేమ **కలుష/సహజ**మైనది
7. **కళ/జీవితం**లో యదార్థాన్ని తెలుసుకోటమే నిజమైన కళా స్వాదన.
8. **కళ/ప్రేమ** అంటే యేమిటో కళంకంలేని మనసు గలవానికే బోధపడుతుంది.
9. ప్రాణికి ప్రాణి సన్నిహితం కావటం **కష్టం/సేవ** లోనే కాబోలు !
10. పెళ్ళి కాని విచారం కంటె, పెళ్ళి కాదేమో నన్న **భయం/విచారం** ఆడపిల్లల్ని ఎక్కువ కాలుస్తుంది.
11. జీవితంలో పెళ్ళి ముఖ్యమైనదే కావచ్చు. దానికి **తోడుగా/మించిన** మరికొన్ని బాధ్యతలు కూడా వుంటాయి.
12. స్త్రీకి జీవితంలో వివాహం అనేది పెద్ద **మలుపు/సమస్య**.

| | 1 | | 2 | | 3 | | 4 | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ఆడదాన్ని | మగవాణ్ణి | ఆడదాన్ని | మగవాణ్ణి | ఆడదాన్ని | మగవాణ్ణి | ఆడదాన్ని | మగవాణ్ణి |
| 2 | ఆరాటం | పట్టుదల | ఆరాటం | పట్టుదల | ఆరాటం | పట్టుదల | ఆరాటం | పట్టుదల |
| 3 | ఏకాంతం | తోడు | ఏకాంతం | తోడు | ఏకాంతం | తోడు | ఏకాంతం | తోడు |
| 4 | ఏడుస్తుందో | నవ్వుతుందో | ఏడుస్తుందో | నవ్వుతుందో | ఏడుస్తుందో | నవ్వుతుందో | ఏడుస్తుందో | నవ్వుతుందో |
| 5 | ఓర్పు | శరీరం | ఓర్పు | శరీరం | ఓర్పు | శరీరం | ఓర్పు | శరీరం |
| 6 | కలుష | సహజ | కలుష | సహజ | కలుష | సహజ | కలుష | సహజ |
| 7 | కళ | జీవితం | కళ | జీవితం | కళ | జీవితం | కళ | జీవితం |
| 8 | కళ | ప్రేమ | కళ | ప్రేమ | కళ | ప్రేమ | కళ | ప్రేమ |
| 9 | కష్టం | సేవ | కష్టం | సేవ | కష్టం | సేవ | కష్టం | సేవ |
| 10 | భయం | విచారం | భయం | విచారం | భయం | విచారం | భయం | విచారం |
| 11 | తోడుగా | మించిన | తోడుగా | మించిన | తోడుగా | మించిన | తోడుగా | మించిన |
| 12 | మలుపు | సమస్య | మలుపు | సమస్య | మలుపు | సమస్య | మలుపు | సమస్య |

ప్రతి రెండు కూపనులకు 1 లఘు సాహితి ఉచితం.

| | 1 | లఘు సాహితి | 2 | |
|---|---|---|---|---|
| 1 | ఆడదాన్ని | మగవాణ్ణి | ఆడదాన్ని | మగవాణ్ణి |
| 2 | ఆరాటం | పట్టుదల | ఆరాటం | పట్టుదల |
| 3 | ఏకాంతం | తోడు | ఏకాంతం | తోడు |
| 4 | ఏడుస్తుందో | నవ్వుతుందో | ఏడుస్తుందో | నవ్వుతుందో |
| 5 | ఓర్పు | శరీరం | ఓర్పు | శరీరం |

నిబంధనలకు బద్ధుడనై నా ఎంట్రీలకుగాను రూ. ..............

ఎం. ఓ./ ఐ.పి.ఓ. ద్వారా పంపి రశీదు జతపరచుచున్నాను.

M.O./I.P.O. నెం. ..............

పేరు ..............

అడ్రసు: ..............

..............

గమనికలు :— 1. ఆధారముల సహాయంతో మీరు తప్పు అనుకొనే పదం కొట్టివేయండి. (2) ఎంట్రీ [illegible] చొప్పున M.O./I.P.O. (క్రాసుచేయని) ద్వారా చెల్లించి రశీదు జతపరచి పంపాలి. (3) ఎవరు ఎన్ని ఎంట్రీలైనా పంపవచ్చు. ఆల్ కరెక్టు మొదలు రెండు తప్పులు వరకు గల ప్రతి కూపనుకు బహుమతి లభిస్తుంది. (4) ఆల్ కరెక్టుకు : 1000 రూ.. 1, 2 తప్పులకు, లఘు సాహితికి వరుసగా 400, 300, 300 రూ॥. (5) ఎంట్రీలు తెల్ల కాగితములపై వ్రాసి పంపవచ్చును. విజేతల లిస్టు— జవాబులు 30—11—69 "విజయ జ్యోతి"లో. కావలయువారు 30 పై॥ పంపండి. M.O. లు, ఎంట్రీలు పంపవలసిన అడ్రసు :—

Manager
**VIJAYASAHITHI**
E. Thandrapadu P. O., Kurnool (A. P.)

మేనేజరు, విజయ సాహితి
ఈ. తాండ్రపాడు (పోస్టు), కర్నూలు జిల్లా (ఆంధ్ర)

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA

GOLD SPOT

KURNOOL

BOMBAY GOA POONA DELHI AGRA SURAT BARODA HYDERABAD HUBLI MADRAS

IZRA

## NOW, INDIA'S FAVOURITE DRINK COMES TO CAPTURE KURNOOL

Here it comes! Lingering flavour Rich colour:
Enticing taste. Extra quantity India's sensational,
best selling drink Gold Spot. Sip one today-you will relish it always




GOLD SPOT



BOMBAY POONA SURAT RAJKOT AHMEDABAD INDORE BARODA HUBLI KANPUR JAIPUR BANARAS HYDERABAD MADRAS AGRA BANGALORE GOA VIJAYAWADA DELHI RAJAHMUNDRY VIZAG

గమనిక : మీరు త్రాగి ఆనందించు ప్రతి గోల్డు స్పాటు వెంబడి మీ డీలరు నుండి బహుమతి కూపను పొంది బహుమతులను గెలవండి.

Grams : GOLDSPOT Phone : 688

మెస్సర్స్ రాయలసీమ బాట్లింగ్ కంపెనీ,
బళ్ళారి రోడ్, కర్నూలు — 3.